'రైతుగ్రంథమండలి'—౧.

# హరిజననాయకుడు.



గ్రంథకర్త:
ప్రొఫెసరు - రంగనాయకులుగారు,
డి. లిట్. (ఆక్సుఫర్డు)

౧౯33

సర్వస్వామ్యసంకలితము]

[వెల అర్ధరూపాయ.

# రైతు గ్రంథ మండలి.

ప్రధాన పోషకులు :—

శ్రీమతి పాములపాటి లక్ష్మమ్మగారు.

పోషకులు :—

శ్రీ మునునూరి వెంకట సుబ్బారాయుడుగారు.

శ్రీ అలపర్తి వెంకయ్యగారు.

,, అలపర్తి జగన్నాయకులుగారు.

,, లావు అంకమ్మగారు.

,, పెద్ది సత్యనారాయణగారు.

అభిమానులు :—

శ్రీ జాస్తి బ్రహ్మయ్యగారు.

,, నూతలపాటి రామకృష్ణయ్యగారు.

,, దాసరి రామస్వామిగారు.

,, ముక్కామల వీరయ్యగారు.

,, అలపర్తి నాగయ్యగారు.

# విజ్ఞప్తి.

సోదరాంధ్రదేశీయులారా !

కార్మిక కర్షక సమ్మేళనార్థమై, రైతుల ఆర్థిక, సాంఘిక, రాచకీయాభివృద్ధికై 'రైతు' సంఘములు ఆంధ్రదేశమందంతట స్థాపింపబడుచున్నవి. రానున్న రాచకీయ స్వారాజ్య పరిస్థితులందు కార్మిక కర్షకులకు, ఆర్థిక స్వారాజ్యము సంపాదితమగుటకై రైతులు, హారిజనులు తమ సర్వశక్తుల నుపయోగించవలసియున్నది. వారు కార్యసిద్ధిని బడయవలెనన్న విజ్ఞానమును తగినట్లు సముపార్జించవలసియున్నది. విజ్ఞానములేనిది స్వధర్మమెట్టిదో నిర్ణయించుకొనుటకుగాని నిరూపణమైన స్వధర్మమును సాధించుటకుగాని సాధ్యముకాదు. కనుకనే, విజ్ఞానమును ప్రజా సామాన్యమున కందుబాటులో పెట్టుటకై మేమిా 'రైతు గ్రంథమండలి' ని స్థాపించితిమి.

మా గ్రంథమండలిద్వారా ఆధునిక, రాచకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవహారములగురించి ఆ యా విషయములం దారితేరిన పండితులచే గ్రంథముల వ్రాయించి ప్రకటింపఁ దలంచి యున్నారము. ప్రథమముననే సుప్రసిద్ధ రైతు నాయకులును,

ఆచార్యులు నగు శ్రీ రంగనాయకులుగారి యుద్గ్రంథములు తొమ్మిది మాకు సంపాదితమైనవని తెల్పుటకు సంతసముగా నున్నది.

మా గ్రంథమండలిద్వారా సంవత్సరమునకు మూడు పొత్తములనైన ప్రకటింప దలంచియున్నాము. ప్రతి పుస్తకమును చందాదారులకు ప్రత్యేక చౌకధరలకు వి. పి. గా పంపింతుము.

ఆంధ్రదేశీయులు అందును ముఖ్యముగా రైతులు, మా గ్రంథమండలియెడ ఆదరాభిమానముల జూపెట్టి మా యాశయముల నెగ్గింతురు గాక.

జి. లక్ష్మినారాయణ ఎం. ఏ.

సంపాదకుడు.

గాంధి మహాత్మునకు జయ్.

ఈ గ్రంథమందు పేర్కొనబడిన జాతీయనాయక పాత్రములుతప్ప తక్కిన పాత్రము లన్నియు కల్పితములు. ఇందు పేర్కొనబడిన పేరులుగలవా రాయా గ్రామములం దుండిరేని వారిని నే నెరుగను ; వారినిగూర్చి నేను వ్రాయదలంచలేదు.

ఈ గ్రంథమందు 1932 మార్చిలో సూచింపబడిన సాంఘిక పరిమార్పులను, అద్భుతముగా మహాత్మగాంధిగారు, దేశమందంతట కల్గించుచుండుట మన యదృష్టమే. అట్టి మార్పులను నేను క్రిందటి పది వత్సరములనుండియు కోరుచుంటిని.

సాధ్యమైనంతవరకు వ్యావహారిక భాషనే యుపయోగింప ప్రయత్నించితిని.

రామానీడు విద్యాలయము,
నిడుబ్రోలు.
23-12-1933

రంగనాయకులు.

# అంకితము.



చిన్న తనముననే కన్నతల్లి మరణింప, అపారమగు ప్రేమతో, చిన్న మెత్తు మాటనైన యనక, కన్న తల్లికంటెను మక్కువతో బెంచి, ధన వ్యయమును లెక్కింపక, గౌరవమునే తలపోసి, పుత్రశ్రేయమునే యభిలషించి, కష్టించి, పెంచి పెద్దవానినిజేసి, నా హృదయమందు ఓర్పునకు, శాంతమునకు, ప్రేమకు, అపరావతారముగా ప్రతిబింబించుచున్న నా పెద్దతల్లి "మంగమ్మ తల్లికి" నేనీ పుష్పముతో పూజచేయుచున్నాను.

రంగ

# హరిజన నాయకుడు.

## మొదటి ప్రకరణము.

## బసవలింగయ్య.

గంగయ్య పూర్వులు వేల్పూరునందే పుట్టి పెరిగిరట. కనుకనే అతని యింటిపేరు వేల్పూరు. వేల్పూరివారు ఈ గ్రామమందు పది కుటుంబాలు మాత్రమే కలవు. ఈడ్పుగల్లులో నాల్గు, కుందేరులో ఆరు, నెప్పల్లిలో రెండు కుటుంబాలు కలవట. కాని, వేల్పూరిలోని గంగయ్య కుటుంబమే వేల్పూరివారికి ప్రధానమైనది. వేల్పూరువారు ఆదిమాంధ్రులైనను, తమ గ్రామమునందు పురాతన కుటుంబీకులు కనుక తదితర కులముల వారందరు వారన్న కొంత యాదరముకల్గి వేల్పూరివారి 'కుదురు' యింటివారగు గంగయ్య కుటుంబమునకు కొంత ప్రత్యేక యాధిక్యత తమ మత, సాంఘిక, సాంప్రదాయములందు, జూపెట్టుచుండిరి. గ్రామ దేవతల కొల్చునప్పుడెల్ల మొదటి యాట వేల్పూరివారిది. మారిమ్మ, ముత్యాలమ్మకు ప్రథమమున వీరే బొట్టుపెట్టవలెను. పెద్దకాపుగారు తొలకరిలో విత్తనాలు వేసేముందు వేల్పూరివారి ఆడుపడుచు విత్తనముల మంత్రించవలెను. సంక్రాంతి, సంవత్సరాదిపండుగ

లప్పుడు వేల్పూరివారి ముసలాతమ్మ రైతులందరకు బంతిపూలు, వేపపువ్వు తెచ్చిపెట్టవలయును. గ్రామమునందెవ్వరైన, ఆంబోతెద్దును వేయునట్లయిన వేల్పూరివారి కుర్రదూడ ఆయెద్దుకు ముద్రవేయవలెను. ఇందులకుగాను పారితోషికముగ వేల్పూరివారి కుదుటి కుటుంబమునకు కళ్లాములందు ప్రతిరైతు, తన సత్తాకు తగినట్లు ధాన్యమును ధర్మముచేయవలెను. గంగయ్యగారి కుటుంబము, వేల్పూరు గ్రామము కట్టబడినప్పటి నుండి, యీ మర్యాదలకు, ఇచ్చిపుచ్చుకోలులకు, అలవాటుపడియుండిరి.

మన గంగయ్య కిప్పటికి 80 వత్సరము లుండును. వేల్పూరు పెదకాపు రమణయ్యగారి తాతక్రింద మొదట కూలికి కుదిరినాడట. ఆరోజులలో (అనగా 1880-90 సంవత్సరములందు) రైతులివాటికంటె దృఢకాయులట. కూలీలు కూడ, ఇప్పటికంటె ఎన్నోరెట్లు కష్టపడుటకు శక్తికల్గియుండిరట. తాను వయస్సునందున్నప్పుడెట్లు దేశపు పరిస్థితులుండెనో, రమణయ్యగారి కుమారుడు రామస్వామిగారికెన్నోమారులు గంగయ్య చెప్పుచుండెడివాడు. ఒకనాడు క్రొత్తగా నెల్లూరు జిల్లానుండి వచ్చిన యల్లుమందకు, తమ కుటుంబమునకు పట్టుగొమ్మలాగ యుండిన గంగయ్యను పిలిచి, రామస్వామి "తాతా, తాతా" మాముత్తాత కాలములో కమ్మాలెట్లుండెడివారే యని యడిగెను.

గంగయ్య— ఏమిటినాయనా, ఎన్నిపర్యాయములని చెప్పేది? ఏమంటోయి యల్లమందగారూ, మీరు క్రొత్తగా వచ్చినారటగా నెల్లూరు జిల్లానుండీ, మీ వైపున యేమైన రైతులు, కూలీలు, మాకాలమునాటి వారివలె కష్టించువారేమో కాని, ఈమాగాణి భూములలో ఆలాంటి పనితనము కలవారే కనపడడములేదు. మాఅబ్బాయి రామస్వామికి నామీద యెంతో ప్రాణము, అందుకనే పదేపదే ' పాడిందేపదమురా ' అన్నట్లు ఎప్పుడూ యీమాటలే చెప్పమంటాడు. దీనికేమిగాని, మీతట్టున ఆడవారు పొలముపోతారా?

యల్లమంద— అవునోయి గంగా, మాదేశాన ఆడంగులు బాగా పనిచేస్తారు.

రామస్వామి— యల్లమందగారు మానాయన మాచిన్నప్పటినుండీ మాతాతను గంగా అనవారు. మావూరి మాది గల కంతకు మాతాత కులపెద్ద. మా నాన్న తప్ప ఇంకెవ్వరు 'గంగా' అనరు యీవూరిలో. అందరు తాతా అనే పిలుస్తారు. మాఅమ్మకు కూడా గంగయ్య తాతే.

యల్లమంద— తెలియకన్నాను, తాతా మరేమి అనుకోవాకు.

గంగయ్య— దానికేమిలే చిన్నవాడవు. మావూరి మర్యాదలు నీకేమి తెలుసుగాని, ఏదీ చెప్పకపోతివేమి, మీ కందుకూరు రైతుల స్త్రీలు పొలాలకు వెళ్లుతారా?

యల్లమంద — ఆహా! వెళ్ళ కేమి, మా అమ్మ, చెల్లెండ్లు ఎప్పుడూ పొలాలకు వెళ్లేవారేగదా? మావూరిలో మాదే పెద్దకుటుంబము. మావాళ్లకే అభ్యంతరము లేకపోయినప్పుడు ఇతరుల కేమియభ్యంతర ముండును. మాచెల్లెలు కోటమ్మ ఏరుతట్టునయున్న మాపడమర చేలో మంచమీద నిలబడి, లే, లే, కాకి లేలే యని ఘల్ ఘల్ మను వడిశెలను త్రిప్పుచున్నప్పుడు ఎంతశాణింపుగా యుంటుం దనుకున్నావు. సాయంత్రము వేళ యొక్కజొన్న కండెలు వళ్ళో వేసుకొని, పాలకండెలు తింటూ, మధ్యమధ్య పాటలు పాడుకుంటూ, ఆడపిల్లలు పొలాలనుండి తిరిగి వచ్చేటప్పుడు, సంధ్యాసమయ పిట్టల పికపికలు తోడుగా, ఇంటి ముఖంబువట్టి అరచుచు బోవుచుండు గొర్రెల మందల చూచియే తీరవలెను. తాతా! పాలచెంగావిరవికలు తొడిగి మబ్బంచు చీరలుకట్టి, మా మాదిగ వనితలు కడుపుబ్బ నవ్వుచు, కుర్రవాండ్రతో సరసాలాడుచూ, జీతగాండ్రతో వొయ్యారము జేయుచూ, వచ్చుచున్నప్పుడు దిగుచున్న చీకటిని ఆగు మాగుము అని అడ్డగించుచుండు ముద్దులొల్కు సూర్యుని బంగారు తీగెలు ఊగుచున్న జొన్న కంకులకు, రాలుచున్న చనగచమురునకు, వాలుచున్న లేజిగురులకు, వన్నె బెట్టుచున్నప్పుడు, పసివాడనగు నాకెంత హృదయానందము కల్గెడిదో చెప్పతరమా తాతా?

గంగయ్య— ఇదేమి కాలమోగాని, అబ్బాయీ! మాప్రా ణ్ణాల్లో కమ్మారికి పోయేరోజులు వచ్చినట్లున్నవి. నా చిన్నతనాన మారమణయ్య ముత్తవ, అమ్మి అత్తమ్మ, ఎప్పుడూ పొలానే పాటుపడుచుండేవాళ్లు. మన పెద్ద కాపు ముత్తవను నే నెప్పుడు పెద్దమ్మా! అని పిల్చే వాడిని. మా పెద్దమ్మకు తెలియని వ్యవసాయపు పని యే ముండేది? ఎన్ని ఆవులు, గేదెల పాడితీశేది? ఎంత మంది జీతగాండ్రకు వండి పెట్టేది? మొక్కజొన్న కండెలు విరిపించడములోనా, శనగకాయను కొట్టించ డము లోనా, కందికంపను కుప్పలు వేయించడము లోనా, ధాన్యపు రాసులకు కావలి కాయించడము లోనా, దానధర్మములు చేయించడములోనా, ఎందు లోనైనా, మాపెదమ్మ ఎవ్వరికైనా తీసిపోయి వెను గునా? ఆమె ముగ్గురు కూతుళ్లు, తల్లిని మరిపించే అందకత్తెలు, అంతకుమించిన పనికత్తెలు. ఇప్పటివలె రైతుల భార్యలు, యిండ్లల్లో మురిగి మూల్గేవాళ్లా! ఈ నాడు నాతో మాట్లాడడానికి గూడా యేమిటో నిన్న గాక మొన్న బుట్టిన యీకమ్మారి పిల్లలకు సిగ్గు. ఆ రోజుల్లో స్త్రీ పురుష భేదము లేనట్లే చింతపండు చేయడం, కందికంప కొట్టడం, చనగకంప తొక్కించ డం, జొన్నకంకి కొట్టించడం, అది యిది యననేమి అన్ని పనులందు మాల, మండి, యెవ్వరో, సంసారు

ఎన్నరో, చెప్పడానికి వీలులేకుండా కలిసిమెలిసి అందరు స్త్రీలు, పురుషులు, పనిచేసేవారు. మా పెద్దమ్మ పాట పాడుచూ కందులు జల్లెడ పట్టుతుంటే, సౌభాగ్య తడి కను అవతలి కొమ్ము పట్టుకొని పదము కల్పుచుండెను. మిగిలిన స్త్రీలు, పాట నందుకొని విసరుచుంటే, ఆక ళ్లాము, అందము, చందము, దేవతలకైనా అబ్బునా?

రామస్వామి— ఐతే తాతా, మా అమ్మమ్మ పొలంలో పని చేసేదిగదా! ఆమెను తోడి సంసారులు గౌరవించెడి వారేనా?

గంగయ్య— ఏమీ! నా పెద్దమ్మ కూతురిని అమర్యాద చేసే పాటివారుకూడా కలరా? వడిశెల వేయడంలో మా చెల్లెమ్మతో పోటీకివచ్చేవారే సాటి కమ్మారిలో కలరా? కొజ్జాటి చీర కట్టుకొని, అద్దాల రవిక తొడిగి, బంతి పువ్వును కొప్పులో పెట్టి, నొష్టన 'అంతట్టి' బొట్టు పెట్టుకొని బుగ్గను అంటుకొన్న మొక్కజొన్న పుప్పొడితో నా చెల్లెమ్మ జొన్నచేలోనుండి గంతు వేయుచూ వస్తూవుంటే మా పెద్దనాన్న ఎంత సంతోషపడేవాడో చెప్పతరమా? అబ్బో! ఆమె అందమెక్కడ, వయ్యార మెక్కడ. ఆమె పాదములొత్తుటకై యెందరు సంసారి స్త్రీలు యువ్విళ్లూరు చుండెడివారో తెలియునా?

మల్లమంద— తాతా, మా పెద్దయ్య, పెద్దమ్మా అని కలవ రిస్తావే! మరి మా ముత్తవ వెట్లావుండేదో చెప్పవేమి?

గంగయ్య— (గంగయ్య సిగ్గు నభినయించుచున్నాడు. చల్లగా దగ్గి, చుట్ట నోట్లో పెట్టుకొని) "మీరు తుంటరి పిల్లకాయలు. మీ ముత్తవ కేమికొదవ నాయనలారా! దేవుడంతటి మా పెద్దయ్య, లక్ష్మివంటి మా పెద్దమ్మ కొలువులో నావలెనే ధన్యురాలగు చుండెడిది. అది కాపురానికి వచ్చేటప్పటికి రామస్వామి తాత పెత్తనానికి వచ్చినాడు. మన పెద్దకాపు పుట్టి అప్పటికి పదేడులైనది. మా పెద్దనాయన ముదుసలివై, పొలానికి పోవులమాని, వ్యవసాయ మంత పెద్ద కొడుకు మీదనే పెట్టినాడు. నాసింగి బాగుండ కేమి? మా పెద్దనాయనేగా కుదిర్చి పెట్టినాడు. మా మామగారిది ఒందేరు. ఆతడు ఆ వూరు పెద్దరెడ్డిగారి కమతములో యుండెనట. మా పెద్దనాయన ఆ వూరు ఏదో వ్యవహారము పరిష్కారము చేయుటకై పోయియున్నప్పుడు, పదహారేండ్ల పిల్ల నొకదానిని గొడ్లచావిటిలో చూచి, పుట్టుపూర్వోత్తరాలు కనుక్కొని, వ్యవసాయపు పనులన్నిటియందు తెల్వితేటలు కలదని తెలుసుకొన్నాడు. ఆ మరునాడు నన్ను పిలిచి "గంగా, నీకు పెండ్లికూతురును చూచి వచ్చినానురా, పిల్ల అంగు గలది. తండ్రి మరియాదస్థుడు. బాగా పనితనము నేర్చినదే! ఒక్క అంకెము ధాన్యము అలాకనగా దంచునట పెండ్లి చేసుకుంటావా?" అన్నాడు. "ఏమోనండి. తండ్రియు,

దైవము, నీవేగదా నాకు. నీట మునుగమన్నా, పాల మునుగమన్నా, 'వల్లె' యంటానుకాని మరొక మాట వచ్చునా నాకు'' అంటిని. ''నీవు వట్టి పిచ్చి వాడవురా గంగా నిన్నాగడగ్గాయిపిల్ల యెన్నితిప్పలు పెట్టునో! సరే, నీవు వెళ్ళి మీఅమ్మకుచెప్పు. పౌర్ణమి వెళ్ళిన ఆరురోజులకు పెండ్లిజరుగునని; అన్నియత్నాలు నేను చేయిస్తాలే'' అన్నాడు. ఆరోనాడు పెండ్లి అయింది ఇక చెప్పవలెనా? వేల్పూరు పెద్దకాపుగారి పెద్ద కమతగాడు కుందేరు పెద్దిరెడ్డిగారి కమతగాని పిల్లను పెండ్లిచేసుకొనే టప్పుడెంత అట్టహాసము జరిగెనో యూహించుకోవలసినదే గాని చెప్పతరమా? వండే వారికి, పెట్టేవారికి, ఆదినమంత విరామమేలేదు. ఈ చుట్టుపట్లగల ఆరు గ్రామాదుల పంచము లందరు బంతులు తీరి భోజనాలు చేసిరి. పుట్టిబియ్యము ఉడి కిన వట. మహారాజుల పెండ్లియైనా, అట్లా జరిగినదా యని నేనెచ్చటికి పోయినా మా కులపువాళ్లు అటుండే వాళ్లు చాలాకాలము వరకు.

మాపెదనాయన చెప్పినట్లే, మీ ముత్తవ భేషైన పనికత్తె. మాపెద్దమ్మకు ముచ్చట కల్గించేది. వెంకయ్యకు అది అంటే యెంతో ఆదరము. చిన్నిమ్మకు దానిమీద మక్కువ యింతింతని చెప్పడాని కలవిగాదు. దానికి చిన్నిమ్మ ఆమెకు అదిమేసరి. పనిపాటలందు, ఇంపుసొంపులందు, పాడిపంటల

పోషించుటందు ఆకాలపు స్త్రీలముందు దిగదుడవడానికి పనికి వస్తాగా నాయనలారా ఈనాటి ఆడంగులు.

రామస్వామి— తాతా! మాముత్తవ పెద్దదైన తరువాతనే చేసుకొంటివే? నిన్నెప్పుడైన ఆడించేదేనా?

గంగయ్య— నాయనా! ఎంతటివాడవోయి! మారమణయ్య కడుపున తగినవాడవే పుట్టావు! మేము మీ కమ్మారి మాదిరిగా రంగులు పింగులు వేసుకుని తిరిగేవాళ్లమా? తిరగాలన్నా మాకు నాల్గుడబ్బులిచ్చేవా రెవరున్నారూ? పెండ్లినాటికి నాకు ముప్పై సంవత్సరాలు. దానికి 16 సంవత్సరాలని చెప్పితిగదా! నాకు అరవై యేడులు వచ్చిందాకా సంసారపక్షముగానే యుండేవాళ్లము. నాడబ్బై యేట అది దేవుడి సాన్నిధ్యమునకుపోయె. ఇంకా నన్నాడించడ మెక్కడ. పాపమిప్పు డేలోకము లో యున్నదోకాని మీముత్తవ యెంతటి పనికత్తె యనుకొన్నారు? పగలంత పొలాన పనిజేసివచ్చి ఇంటిలో భోజనాదులన్ని సరిపెట్టి పిల్లలను పండబెట్టి ఇరుగుపొరుగు వారిని మరియాదచేసి వచ్చి నాకాళ్లు పిసుకుచూ నిద్రకు జోకొట్టేది. మాపెద్దబాబుకు దాని మీద యెంతో ఆదరముగా యుండేది. దానికి మొదటి బిడ్డను కన్నప్పుడు మూడు నెలలబాటు పనిజేయించు కోకుండానే కూలి యిప్పించినాడు.

యల్లమంద— తాతా నీకన్నబిడ్డలంద రీ యూరిలోనే యున్నారుగా ?

గంగయ్య— లేదు నాయనా మాపెద్దవాడు రమణయ్యగారి కమతములోనే యున్నాడుకదా ! వాడేగా అలగాజాతి కూలీల కందరికి జీతగాండ్లమధ్య పెత్తందారు. మీరు యీవూరు వచ్చేముందే మావూరిలో పెద్దకోలుపులు జరిగినవి. చుట్టుపట్ల గ్రామాదులవా రందరు వేలకొల దిగా వచ్చిరి. వారిలో మాపెద్దవాడిని పొగడనివా రే లేరు. వాడు తప్పెటవాయించుతూ అడుగు వేయుచూ యుంటే చూచి ముచ్చటపడిరి అందరు. కత్తిసాములో గాని విలువిద్యలోగాని వాని మించినవా రెవ రీప్రాంత్య ములందు లేరట. రెండోవాడు తల్లికి నచ్చిన పిల్లగాడు. మన రామస్వామికి వలెనే ఎర్రగా యుండేవాడు. వాడి చాతి దృఢమగు దీర్ఘమగు చేతులు నెత్తిపై నుండు దట్టమగు జుట్టు తలుచుకొంటే విచారముకల్గు చుండును. వాడికి యిరవై సంవత్సరాల వయస్సు వచ్చేవరకే ఈవూరిలోని మేటియగు పనివారందరికి నాయకుడైనాడు. మా పెద్దవాడి కప్పుడే పెండ్లియైనది. కోడలు కాపురానికి వచ్చినది. మా యింట్లో ఆనంద మునకు కొదువ లేకుండెను. ఇంతలో ఏమని చెప్పేది బాబూ! పిడుగువలె మా రెండోకుర్ర వాడు లింగయ్యను యెవ్వరో నలవగొట్టి ఎండిపోయిన కాలువలో పార

వేసి నారని తెల్లవారి ఇంట్లోనుండి వీధిలోనికి వచ్చే సరికి చెప్పిరి. నడుము విరిగిపోయినట్లయ్యెను నాకు. ఇక దాని సంగతి చెప్పాలనా? పాడంత గగ్గోలై పోయినది.

రామస్వామి— తాతా! లింగడు దొంగతనము చేయలేదటగా? మా నాన మెవ్వరితోనో రహస్యంగా చెప్పుతుంటే విన్నా! పాలెములో యెవ్వరి యింట్లోనో ఏమిటో జరిగినదటగా? పట్టుకుని చితకగొట్టారట.

గంగయ్య— ఎందుకులే ఆసంగతి మనకు. ఏదో వయస్సులో వుండేవాళ్లు గ్రహచారము చాలకపోతే తలకు మించిన పిచ్చిపనులు చేస్తే లోకము క్షమించునా? ఆదెబ్బలతో వాడికి నడుము విరిగినది; తలపగిలినది. వాడికి వళ్లంత సత్తురుమయమే? నేనట్టె కూలబడిపోతిని. మా చిన్నాడి కొడుకు తన భుజముమీద నా చేయి వేసుకొని నన్ను యింటికి తోడుకొనివచ్చెను. వాడిని మాయింట్లోనే యుంచితిమి. ఈకుప్పుగల్లు వాసుడు మందుమాకులు వాడి, గాడిద చమురు తెప్పించి త్రాగించెను. మా పెద్దతండ్రి కావలసిన డబ్బు యిచ్చుచుండెను. నాల్గురోజులు అమితబాధతో గడపినాడు. ఐదోరోజున నన్ను పిల్చి "బాబూ, తప్పు చేసినాను, క్షమించుము, అన్నయ్య కోటయ్యా నా లైదుమాకులు వద్దురా, మన కొద్దురా, ఈ పాడు పొత్తు, మనకీ

పాలెపుపొత్తు అచ్చిబాటుకాదురా, అని చెప్పాడు. కాని మన గ్రహచార మిట్లుంటే నేనెందుకు వింటాను, నేను చచ్చినా నాకు కష్టముగా లేదు కాని, మన తాతగారి కమతములోయున్న లింగడు, ఊరిలో యిట్టి దుర్మార్గము చేసినాడే యను అప్రతిష్ట మన దేవిడి కొచ్చినదే యని విచారపడుచున్నాను. అయ్యా! నా తప్పు క్షమించుము, తాతకు నాదే తప్పంత, నీకు అన్నకు, యేమి బాధ్యతలేదు. నాతప్పునకు తగిన శాస్తి జరిగినది అని చెప్పుము. రమణయ్యగారి చేయిక్రింద నాల్గు నాళ్లు మనసార కష్టించాలనుకుంటే ప్రాప్తి లేక పోయినది. నే చేసినపాపము క్షమించబడితే, నేను మళ్లా నీకే కొడుకునై పుట్టుతాలే నానా? అమ్మ నిటు పిలువుము." ...... ఏదీ అమ్మా! అమ్మా! ఏడువకు, నీగర్భాన త్వరలోనే నేను పుట్టుతాలే! అంటూ, కొనయూపిరి విడిచినాడు. ఇక మాదుఃఖానికి అంతు న్నదా! కోటయ్య సిగ్గుచేత ఊళ్లోకే రెండు నెలల కాలము పోయేవాడు కాడు. మీ ముత్తవ పాలెంలో తన మొగమే చూపెట్టడానికి సంకోశించింది, నే నెక్కడకు పోయినా ఆలగాజాతుల వాళ్లందరు నావంక అట్టే చూచేవారు.

యల్లమంద — మరినీకు లింగడు తిరిగి పుట్టినాడా ?

గంగయ్య— ఆహా! వాడి మాటయొక్క బలమేమోకాని వాడుపోయిన మరుమాసముననే మీాముత్తవ గర్భాన అవతరించాడు. వాడి అవతారమే మా ముత్తయ్య.

యల్లమంద— నాతో నిన్న పొలానికి వచ్చి ఆవులను, దూడలను, ఎద్దులను, ఆటలాడించిన వాడేనా? పాతి కేండ్లున్నవి? తాతా? వాడు మాదిగ పిల్లవాడైనా, వాడిమొఖాన యెంత తేజమున్నది!

రామస్వామి— అన్నయ్యా! నీవు మంచి పనివాడవని, మన వెంకన్న చెప్పితే విన్నాగాని, మా ముత్తన్నను యెప్పటి కైనా మించకలవా? వాడు వేసిన వామికి వంకర పెట్ట కల్గువారున్నారా? వాడు వేసిన కుప్పలు, ఈ వూరిలో కెల్ల అలాయిదాగానే యుండును. వాడు పిల్చి తేచాలు ఆవులు పరుగెత్తును. ఇతరుల క్రింద రెండు యెకరాలు దున్నితే, వాని క్రింద మూడెకరాలు సాళ్లువేసి, పైగా దుముకుచూ, రంకెలువేస్తూ, కొంతముల్లోకి మన ఎడ్లు వచ్చునని, నిన్న సాయంత్రమేగా రామచంద్రయ్య మనకు చెప్పింది.

గంగయ్య— ఇదేమో చిత్రముగానేయున్నది. ముత్తయ్యకు పదహారేండ్లు వచ్చేసరికి, లింగనికుండిన హస్త కౌశ ల్యత, కార్యనిపుణత, బాహుపటుత్వము, యేర్పడెను. ఇప్పుడు, వానిలో యిద్దరు మనుష్యులున్నారా యని పించును. మన రామచంద్రయ్యగారికి అరక దున్నుట

లోను, వీరయ్యగారికి పశువులు మేపుటలోను, యీాడు జోడుగా యుండనేర్చినవాడు వాడేగదా! మా రమణయ్యకు ముత్తడిమీాద అమిత ప్రాణం.

రామస్వామి—— ఐతే, ముత్తడి కేమో పిచ్చి కొంచె మున్నదటగా, ఈసంసారులందరిని ద్వేషించుతాడట, చాకలి, మంగలివాళ్లు, తూర్పువాళ్లు, అంటే భగ్గుమంటాడట, పాలెంలోయున్న వారందరిమీాద, కారణంలేకుండానే తగవు పెట్టుకుంటాడట. మన వెంకన్నకు గూడ, వాడంటే, యేదో సందేహముగా నుండును. తాము వచ్చిన క్రొత్తదినాలలో, తమ్ముకూడ, సందేహముతో చూస్తుండేవాడట. రామచంద్రయ్య పవిత్రతను జూచి, వీరయ్యకున్న పశుహృదయపరిజ్ఞానము గాంచి, జ్ఞానమ్ము మెత్తదనము తలంచి, కొంతకాలానికి సాధువైనాడట. తలకు మించిన ఆలోచనలు, చోటుకుమించిన చైదము లున్నవి. వీనికి ఎప్పటికేమి మూడునో యని, భయ పడుచున్నాను.

గంగయ్య—— కాలనైపరీత్యము బాబూ! మా కాలములో, అలగా జాతికి చెందిన శూద్రులన్నాకూడ, మాకెంతో భయంగావుండేది. నామట్టుకునాకు, యీాభై యేండ్లు వచ్చినప్పుడుకూడ, రైలెక్కి బందరు పోతుంటే, ఎచ్చట పెద్దకులాలవారొచ్చి, నాప్రక్క కూర్చుంటారో యని, గుండెలు తటకట కొట్టుకొనేవి. నాలైదు మాసులు,

మా రమణయ్యతో, ఏలూరు తెలికచక్క కొనడానికి, రెండు మారులు ఎద్దుల నాణ్యాము చేయడానికి, మన రామచంద్రయ్యతో బాటు విజయనగరానికి వెళ్లిన తరువాత కాదా, నా కా భయముపోయినది. అన్నట్లు మనమీ వూళ్లల్లో కాని యిన్ని భేదాలు కల్పించుకునేది, ఆ రైళ్లల్లో యేమిలేదు. 'ఫూ' అంటే యెగిరిపోయే గుడ్డలు పైన వేసుకొని, ముసుగులెట్టుకొన్న వాళ్లెంత మందో, వెనకాముందూ చూడకుండా, ఎన్నో మారులు, నాప్రక్కనే, నన్నంటుకుంటునే కూర్చుండేవాళ్లు. నీకుల మేమిటనిగాని, నీ వృత్తి యేమనిగాని, అడిగినవాళ్లున్నారా? మారమణయ్యా, ఇచ్చటివాళ్లేమనుకుంటారో యని, సిగ్గుతో నన్ను దూరంగా యుంచుతాడుగాని, ఆ ప్రయాణాలలో, నేనే తనకు అన్ననైనట్లు, అరటిపండ్లైనా, మిఠాయేనా, సమస్తం తెచ్చిపెట్టి, నా ప్రక్కనే కూర్చుని భోజనము, చేసేవాడు.

రామస్వామి— ఐతే, నీవు మమ్ములను అంటుకోవేమి తాతా?

గంగయ్య— కుర్రాడికి యేమి సందేహాలు? నీవుకూడా మా ముత్తడితో సావాసముచేసి, చెడిపోతావా యేమిటి? కలకాలమునుండి,మీవాళ్లు, యీవూరిలో, పేరు ప్రతిష్టలు సంపాదించుకొన్నారు. మాతాత కాలమునుండి, మీకమతములో మేము పనిచేసి, మీ యింటి దేవతను కొల్చుచున్నాము. గోతిలో యొక కాలుబెట్టి కునుకు

చున్న నేనుకూడ, సంకరము తెచ్చిపెట్టి, మా దొరలకు అమర్యాద తెచ్చేదా? ఏపాలెంలోనో, చావుదెబ్బలు తిని, మా లింగడు, దొరలకు అప్రతిష్ట తెచ్చితినే యని యేడ్చి, పాతిక సంవత్సరాలైనది.

యల్లమంద— ఐతే, నీ మాట వినేలాగునలేడే ముత్తన్న?

గంగయ్య— ఏమీ! మిమ్ములను అంటుకున్నాడా? ఎవ్వరు చూడలేదుకదా!

రామస్వామి— భయపడవాకు తాతా! ఇంతలో మునిగి పోయినదేమున్నది? మానాయనకూడ యున్నాడులే! ముత్తన్న, నేనూ, పరుగెత్తిపోవుచున్న ఆవును మరలింప బోతిమి. దారిలో నేను పడ్డాను, ఆత్రముతో ముత్తన్న వచ్చి, నన్ను లేవదీసి కూర్చోబెట్టి తన చారతో నీళ్లు తెచ్చి త్రాగించినాడు. మా నాన్నకూడవచ్చి, యిది తెలుసుకొని, గంభీరముగా నవ్వుచూ "ముత్తా, నీవు గడుసువాడవురా, నా బిడ్డకు సంకరము అంట గట్టావూ?" అన్నాడు. పాపము ముత్తన్న యేమి తోచక, పెదవులు మెదపుచుండెను. "భయపడవద్దులే! మారాముడు కాశీలోను, బెజవాడలోను, రైళ్లలోను, మాలమాదిగల నీళ్లు త్రాగడం లేదటలే! ఈ పాపిష్టి లోకులేమనుకుంటారో యనికాని, లేకపోతే, గంగన్న, నేనూ చేతులు చేతులు పట్టుకొని. చెటపటాలుగా, తిర గాలసినదిగాదూ? అబ్బాయీ, తేరు కొన్నావటరా?

పొలాన నీవు పనిచేసినంత పుణ్యము కాని, ఇంటికి చక్కా వెళ్లు. ముత్తడూ! నీవు, వూళ్లోవారితో పోట్లాట పెట్టుకోవద్దు. పాలెంలో వాళ్లు పోగరు బోతులు. మునుపు మీఅన్న లింగడి సంగతి, నీకు తెలుసుగా? నీకేమి యెప్పుడు జరుగునో యని, నాకు భయము" అన్నాడు.

గంగయ్య

ఔరా! ఎంతటి వాళ్లు యీ కాలపువాళ్లు! మాదిగల నీళ్లు త్రాగడమే కాకుండా, భయములేకుండా, చెప్పుకోవడము కూడనా? ఏదో, ఈమాయప్రపంచములో యీవేషాలన్ని వేయాలగాని, వాస్తవముగా, ఎప్పుడూ, పంచములుపిళ్లు, శూద్రులు వారు, అని, పొలాలలో పనిచేసుకొనేటప్పుడు, మేము మాత్రము అనుకొనేవాళ్లమా? పనిచేసే వడుపులో గాని, కోత, కట్టివేతలో గాని, అరకనడిపి, సాళ్లువేసి, జడ్డిగముపట్టి, విత్తనాలు వేయుటలోకాని, మేమీభేదాలు పట్టింపుగా జూచేవాళ్లమా? ఒక్కమనుములో, అందరము, ఒకరి ప్రక్కను మరొకరము పనిచేసేవాళ్లమే! ఐతే, అట్లాపనిచేయు చున్నంతకాలము, మాకులాలను మరచిపోయేవాళ్లము. గట్టు దాటి, డొంకలోకివచ్చేసరికి, మేము పంచములము, వారు శూద్రులయ్యేవారు.

రామస్వామి

ఐతే, మావారు, మీవారు, సరసాలాడుకొనేవాళ్లేనటగా?

గంగయ్య—

ఏమివమువు మారామయ్యాకు? అబ్బాయీ! నీకు పెండ్లియీడు వచ్చింది. అప్పుడే, ఆడవాళ్ళమీద మనసుపోవుచున్నది. ఇప్పు డెంతో అప్పుడూనంతే. ఐతే, ఈరోజులలో, చీకటిదినాలలో, ఎచ్చటనో, యెవేవో చెడ్డపనులు, చేసుకుంటూరట. ఆరోజులలో, చెడ్డసుద్దులేమిలేకనే, కులాలభేదముల నటుంచి, మంచి మంచిసరసాలు కుర్రవాళ్లు చేస్తుంటే, పిల్లలు ముసిముసి నవ్వులు నవ్వుతుంటే, మధ్య మధ్య పెత్తందారు నోటూరబూతులు తిట్టుతూ పనిజేయమంటుంటే, వళ్లుకాలేటట్లు యెండకాస్తుంటే, ఆడపడుచులతో, మావాళ్ల ముసలివాళ్లు, సంసార కష్టసుఖాలగూర్చి ముచ్చట్లాడుతూవుంటే, మేము కూలివాళ్లము, బీదవాళ్లము, వారు పెద్దకులాలవారు, అని మాకేమైన అసూయకల్గెడిదా?

యల్లమంద—

ముత్తన్న, ఈ సంసారులమీద పంచములు దండెత్తాలంటాడే!

గంగయ్య—

వాడికిదియొక పిచ్చి. సంసారులొకరు, పంచము లొకరటయ్యా! మా దినాలలో, అందర మొక్కటిగానే యుండేవాళ్లము. ఈ కాలమంత మాయగాయున్నది. సంసారుల నంటుకుంటే, మాకే పాపము కల్గుననుకొనేవాళ్లము మేము. ఇప్పుడేమో, కిరస్తాని మతమంట, అది వచ్చినప్పటినుండి, మావాళ్లు కొంత మంది, పైకులాలు మనల నంటుకోకపోతే, వాళ్లను మనమూ

అంటుకోవద్దు. శూద్రులు మన పిల్లలతో సరసమాడితే, మనమూ వాళ్ల పిల్లలతో సరసాలాడగూడదా అని అంటున్నారు. (ఇంతలో రమణయ్య వస్తున్నాడని విని, ఎవరిదారినివారు వెళ్లిపోయినారు).

అబ్బాయి, రామస్వామీ! యల్లమంద ఎక్కడరా? అంటూ వేల్పూరుపెద్దకాపు రమణయ్యగారు, వసారాలోనికివచ్చేసరికి, చుట్టనుకాస్తదాచిపెట్టి,గంగయ్య లేచినిలబడ్డాడు.అతన్నిచూచి ఏమోయి! గంగా, నీవు, జాగ్రత్తగాకనుకలిగియుండపోతే, ముత్తన్నయేదోముప్పునీకూ,నాకూ, తెస్తాడు. అందుకేమిసందేహం లేదు. వాడికి, పైవారంటెభయమేలేదు. వానినేదోశక్తి ఆవహించినట్లున్నది అన్నాడు.

గంగయ్య—

లేదండి, లింగడుచచ్చిపోయేముందు, చెప్పిపోయినాడు. వాడే యీముత్తడుగా, నాకుతిరిగిపుత్రుడుగాపుట్టినాడు. వానిని యెవరోచావమోదినారుగదా ! నాకుచెప్పకపోయినా, వాడికి, పాలెంలోవారిమీదకసియేయుండినదికాబోలును. వీడు ముత్తడు, తనచిన్నతనాననుండి, యిట్లానే పొగరుబోతుమాటలు నేర్చినాడు. పెద్దలుమిమ్ములనుకనిపెట్టుకొనియున్నాముగదా ! కనిపెట్టికాపాడవలసినదిమీరె !

రమణయ్య—

యల్లమందా! మా బావమరిది పునాదిపాడునుండి వచ్చాడు. ఆతడికి, వెంకన్నగారికుటుంబమేకావలెనంట. వెంకన్న యేమో మాట్లాడవలెనన్నాడునీతో. నీవులోపలికి వెళ్లు.

యల్లమంద—చిత్తముఅని వెళ్లిపోవును.

రామస్వామి

అయ్యా ! మునసబుగారి రామయ్య, మనముత్తడిచేత మనమే, ఈవిధముగా శూద్రులతో పోట్లాటపెట్టించుచున్నామని, యీ దుపుగల్లులో చెప్పివచ్చినాడట.

గంగయ్య

బాబూ, రమణయ్యా ! మావాడు, పంచములకిప్పుడు లేనిది, ఏమికావాలంటాడు? నేనడిగితే, "నీకేమి తెలుసు లేవే, ముసలా డివి, మీకాలానికిమాకాలానికిచాలాభేదమున్నది, ఈకాలాన మాటలంటే, మాదిగిలై తేమాత్రముపడ తారటే ! మాలమా దిగలు, తాలూకాబోర్డులలోమెంబరులవుతుంటే, చెన్నపట్టణ పురాజ్యములోప్రవర్తనముచేస్తుంటే, మనవాళ్ళని అమర్యాదగా అనరానిమాటలీచదువుచట్టుబండలు లేనిశూద్రులు అంటేపడా లనటే! నీవెప్పుడూయిట్లానేచెప్పుతావు, తలవంచుకొనితన్నులు తింటావు" అంటాడు.

రమణయ్య

నాకూ, సరీగా, తనకోరికలగూర్చి చెప్పలేదు. నీకేమైన తెలుసు నటరా?

రామస్వామి

వాడు, వాళ్ళవద్ద, వీళ్ళవద్ద, అప్పుడప్పుడనేమాటలబట్టి తెలిసి నదిగాక, వాడుస్వంతముగాచెప్పితే తెలిసినది చాలాతక్కువ.

వాడికి యీకులభేదాలుగిట్టవు.అందరూ సమానసాంఘికగౌరవ మేపొందవలెనట. తెల్వితేటల ననుసరించి, ఉద్యోగ, గౌరవాలుబొందాలట. కమ్మారు, పంచములుచేత పనిచేయించుకొన్నప్పటికి, వాళ్ళనుతిట్టరాదట, కొట్టరాదట, పెండ్లిపేరంటములవిషయాలలో, భేదాలుండరాదట. తల్లితండ్రులొప్పకొని, స్త్రీపురుషులు మెచ్చుకుంటె, పెండ్లిండ్లుచేసుకోవచ్చునట. బీదలకు భూవసతికల్పించాలనియు, తిండిలేక మలమలమాడువారుండరాదని, వాడిపంతము". ఇంతలో, బజారునయేదోగల్లంతుగాయుండినట్లు తెలుసుకొని, గంగయ్యబైటకుపోయి, నాల్గు నిముషాలలోనే, కంటనీరుపెట్టుకొంటూవచ్చి, "ముత్తడుబైజవాడలో రైలెక్కగా, యెవ్వరోచూచారట.రాత్రియింటికిరాకపోతే, పోలానయున్నాడనుకున్నా, నాకేమితోచడంలేదు" అని చతికిలబడ్డాడు.

---

# హరిజన నాయకుడు.

## రెండవ ప్రకరణము.

ఈడుపుగల్లు, బెజవాడ తాలూకాలో, బెజవాడకు పది మైళ్ళదూరములో ఉన్నది. జనాభా నాల్గువేలు, 1910వ సంవత్సరములో. కొద్దిగా బ్రాహ్మణులున్నా, రైతులందు హెచ్చుమంది కమ్మవారే! ఈమధ్య, కొన్ని తూర్పుకాపు కుటుంబాలు వచ్చినవట. ఈవూరి రైతులు బాగా ఆస్థిపాస్తులు కల్గి, కమ్మవారిలో గౌరవము పొందినవారని ప్రశస్తి. కృష్ణాజిల్లాలో కెల్ల, పేరుపొందిన, అడుసుమల్లి, పర్వతనేనివారి కుటుంబాలు చాలా యీవూరిలో కలవు. మాగాణి వచ్చి చాలకాలమైంది యీప్రాంతానికి. యీడుపుగల్లు భూములు బలమైనవిగనుకను, కాల్వకు దాపున యుండుటవలనను, పంటలు బాగా పండుచుండుటవలనను, ధరలు క్రమముగా హెచ్చుచుండుటవలనను, రైతులనేకులు ధనికులైనట్లున్నారు. భూములధరలు హెచ్చుచున్నవిగనుక, రైతులు తమకాదాయమున్నను, లేకున్నను, ధనికులమని విర్రవీగుతున్నారు. ఇతరచోటులందువలెనే, ఈయూరియందుకూడ, రెండుమూడు ముఠాలున్నయి. ఒక ముఠాదారుడు, భజన చేయించుదామంటే, మరొక ముఠాదారుడు భోగము మేళము తెప్పిద్దామంటాడని లోకులనుకుంటారు. ఈయూరి పెద్దచెరువు, సాయంసమయ

ములందు చుట్టునున్న, ఉన్నతమగు రావిచెట్లు, జువ్విచెట్లు, సూర్యకిరణప్రభావమువలన, మలయమారుతమునకు వన్నెవెట్టు చుండ, హృదయంగమముగ ఉంటుంది. ఈవూరికి, ఆదిమాంధ్రిగూడెము చాలాపెద్దదికలదు. గ్రామమునపాఠశాలఉన్నా, పంచములపిల్లలకాబడికిపోవుటకు ధైర్యములేదు.

యుద్ధముజరుగుతున్న కాలములో, పంచము లనేకులు, బెజవాడలో, గిడ్డంగులందు, రైలుస్టేషన్‌వద్ద, కూలినాలి చేసికొని, తలావంద, రెండువందల రూపాయలు సంపాదించుకొని, తమ తమ యిండ్లకుంజేరి, రైతులభూములను, మక్తాకు తీసికొను చుండిరి. 1920 వ సంవత్సరమునుండి, దాదాపు, యాభైయెకరాలమాగాణి, పదియెకరాలమెట్ట, యీపంచములచే సాగు చేయంబడుతుంది. నల్గురు మెసపటోమియాకు, యుద్ధకాలములో, సిపాయీలుగాపోయి, తెల్లసోల్జర్లతో, కష్టనిష్ఠురములంబొంది, వివిధజాతుల హిందువులతో, సమానముగ, యోగ్యతను సంపాదించి, కొన్ని యింగ్లీషు మాటలతో డొక్కశుద్ధి చేసికొని, ప్రపంచమున నేమియో కొంతవరకు కండ్లు తెరచి చూచి, ఈడ్పుగల్లుకు తిరిగివచ్చారు. 1919 వ సంవత్సరము నందే, తాము సిపాయీలుగా వెళ్లి,ప్రభుత్వమునకు సేవజేశారు. కనుక, జీవనోపాధికై కొంత భూవసతి యిప్పించవలెనని ప్రభుత్వమునకు అర్జీలు పెట్టుకొన్నారు. అప్పటి కలెక్టరుగారు, కంకిపాడులాకువద్ద కొంత గవర్నమెంటు పోరంబోకను,ఈడ్పుగల్లు, వేల్పూరు డొంకలలో కొంతభాగమును, వీరికి గ్రాంటు

చేశారు. ఒక్కొక్కరికి రెండేసి యకరముల చొప్పున భూమిని గ్రాంటు చేయడంతోనే, వీరి కిక మిన్ను మన్ను తెలియక, తాముకూడ భూస్వాములమైతిమను, క్రొత్త తత్వము నాస్వాదించి, తమ్మింక నెవ్వరుకూడ, చులకనజేయుటకు వీలులేదను నమ్మకముబొందిరి. 1918-వ సంవత్సరములో క్రిస్టియను మిషనరీలు, బందరునుండి, బెజవాడనుండి, తమ ఫోర్డు మోటారు కారులందువచ్చి, ఈ ప్రాంతపు పంచములకు, మతమిప్పించ, ప్రత్యేకప్రయత్నములు చేయుచుండిరి. ఆరోజులలో, వారిచేతిలో కీలుబొమ్మలై, జిల్లా కలెక్టరులు, వారిచేత సిఫారసు చేయబడినవారి కందరికి, భూములనిచ్చుచూ, వ్యాజ్యములందు సహాయము చేయుచు, ఉద్యోగము లిచ్చుచు, క్రీస్తుదేవుని సేవ జేయుచుండిరి. ఈమ్పుగల్లులోకూడ, పదిమంది పంచములు, తమ కుటుంబములతో సహా, మతముబుచ్చుకొని, సిగలను కత్తిరింపించి, క్రాపులుపెట్టించుకొని, తమతమపేరులగూడ, మార్పించుకొని, క్రొత్తమనుష్యులమైతిమిగదా యని నిట్టూర్పు విడుచుచు, కమ్మవారినిక మొగమెత్తిచూచి, ధైర్యముతో వారితో మాటాడవచ్చుగదాయని, యనుకొనుచుండిరి. వీరిలో ఆర్గురికి మెట్టభూమి, నలుగురికిమాగాణిభూమియును, క్రొంచెముగా ప్రభుత్వమువారిచ్చారు. 1920వ సంవత్సరములో, కమ్మవారందరు వోట్లహడావుడిలోఉంటే, యీక్రొత్తమతస్థులు సిపాయీలు, పంచములకందరకు పెత్తందారులై, కమ్మవారిమీద కత్తులునూరుచుండేవాళ్లు.

గాంధిమహాత్ముని, సహాయనిరాకరణోద్యమము బహు తీవ్రముగాజరుగుచుండెను. సుప్రసిద్ధన్యాయవాదియగు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, తమయభ్యర్థిత్వమును వదలుకొని స్వదేశసంబంధమగుప్రచారముచేయుచూ, ప్రజలువోటులనియ్యవద్దని ప్రచారముచేయుదొడగెను. ఈడుపుగల్లునందు, వేల్పూరునందు, ఒకముఠావారు, ఓట్లియ్యవద్దని, మఱొకముఠావారు, ఓట్లియ్యాలిసిందేనని వివాదపడుచుండిరి. వేల్పూరి మునసబుగారు, ఓట్ల నియ్యవలసినదే యని పంతముబట్టి, తనకెదురు ముఠావారు కమ్మారికి ఓట్లు నిస్తారని తెలిసి, తాను కొళంద రెడ్డిగారికే సింగులు ఓటు యిప్పించుతానని ప్రచారము మొదలుపెట్టెను. పెద్దరైతు రమణయ్య ఏమీచెప్పక జోక్యము కల్గించుకొనలేదు. ఆయన రెండో కొడుకు రామస్వామి మాత్రము, ఓట్ల నియ్యవద్దని అచ్చుటచ్చుట చెప్పుచుండెను.

ఇరుపక్షములవారు పంచములందు ఓటర్లు అయినవారి వద్దకువచ్చి, తమ తమ వాదములగూర్చి క్షోభగా యేమేమో చెప్పకొనివెళ్లిరి. వారుచెప్పినది తమకు తెలియకపోయినను, తమవోటుఅధికారము తమ్ము పెత్తందారులను చేసినదిలే యని భూస్వాములగు పంచమఓటర్లు ముచ్చటపడుచుండిరి. ఎప్పుడూ తమ మొగమైనచూడని, అడుసుమిల్లివారి పెత్తందారీదినాలలో తమ పల్లెకు మాటిమాటికి వస్తున్నాడు, తమవారికేదో క్రొత్తలాంఛన మబ్బినదని, తదితర పంచములందరుబ్బి, వేల్పూరులో పంచములకు పెత్తందారైన గంగయ్యవద్దకు,

బెజవాడ, బందరునాయకులు, అభ్యర్థులు, తమతమ పేరులతో సహావచ్చి, ఆ యెండాకాలమునందు తమ గొంతులన్ని యెండి పోయేటట్లుగా, ఏమేమో చెప్పిపోయిరి. బంధుత్వమువలన నేమి, స్నేహముపలననేమి, గంగయ్యకు ఈడుపుగల్లు పంచమ వోటరులందు పలుకుబడి హెచ్చుగానుండుటవలన, వారితో తమ యభ్యర్థులతరపున మాట్లాడమని, తన రెండోకొడుకూ, ముత్తయ్యమీద అపవాదులువేయించి, తనయింటికి కొరవి పెట్టించ ప్రయత్నించిన వేల్పూరు మునసబుగారూ, తన్నదే పనిగా బలవంతపెట్టుతుంటే, ఏమీతోచక, రమణయ్యగారి వద్దకు వెళ్లి ఆయనచెప్పినట్లు, తనయిచ్ఛవచ్చినట్లు, ఈడుపుగల్లు పంచములగూడ నడుపుట తనధర్మమని నిశ్చయించుకొని, 1920-వ సంవత్సరం శెప్టెంబరు 14-వ తేదీన సాయంత్రము ఆరుగంటలకు, బుజ్జి అంకమ్మగారి యింటిముందు చాపమీద కూర్చొని, పాటిలోని పెత్తందారులందరతో మాట్లాడవలసి యున్నది గనుక, పిలిపించమని అంకమ్మనడిగెను.

అంకమ్మ ఈడ్పుగంటిపంచములకు పెద్ద. మాదిగలకందరికి వానియింటివారే కులపెద్దలు. మతముపుచ్చుకున్న పదిమంది గాక; మిగిలినవారంతా, ఆతడంటేఅమితభయభక్తులతో ప్రవర్తించుకుంటారు. మాలలు అప్పుడప్పుడు గొణుగుతున్నా, అధికసంఖ్యాకులైన మాదిగలతోకలసి, అంకమ్మపెత్తనమునే ఒప్పుకొని, కొలుపులు, పెండ్లిండ్లు, పిడాకులు, వగైరా సాంఘికవ్యవహారముల చక్కబెట్టుకుంటూ ఉండేవాళ్లు. క్రీస్తియనులు, తలయెత్తుకొనితిరగడమునేర్చినప్పటినుండి, పూర్వాచా

రపరాయణులై, కమ్మవారంబెభయపడుతూ, నక్కుచూ, నంగుతూఉండే యీఅంకమ్మతో, తమకేంపనిలనితిరస్కార భావంతో, చీటికి,మాటికి, బెజవాడవెళ్ళి, మిషనరీదొరగారితోసంప్రతించుకొంటూఉండేవాళ్లు. కానిపాట్లోవారంతా, వీరిక్రొత్తవేషాలు, పేరులు, పెత్తనాలు, చూచి, అసహ్యించుకొనడంచేత, వీరిమాటవినేవారులేకైరి.

పెత్తందారైనఅంకమ్మ పొట్టికురచమనిషి. బాగానల్లటివాడు, మంచినడివయస్సులోనున్నాడు. పెద్దశిగ, గొప్పనుదురుకల్గి, మేటిమగటిమికల్గినవ్యవసాయకునివలెఉంటాడు. అప్పుడప్పుడు, పొగాకునమలుచుండడంచేత, ఆతనిదంతాలొకింతగారపట్టిఉన్నాయి. ఈసాయంత్రము, గంగయ్యతనయింటికి వోట్లవ్యవహారములోవచ్చాడనేపరమసంతోషంతో, పాటిలోనివారందరకీకబురంపి, యింటిముందునీళ్లుచల్లించి, చాపలుపరిచి, వచ్చినవాళ్ళకివ్వడానికిపొగాకుతెప్పించి, తయారుగాఉంచాడు. ఒకొక్కరే,పాటివారువస్తున్నారు. వచ్చినవారందరికిపొగాకుకాడలు, అంకమ్మచిన్నకూతురుసౌభాగ్యంయిస్తుంది. ప్రొద్దుగూకేసరికిఅందరుచేరారు. చీకటిపడిందిగనుక, దివిటీతెప్పించి, గుమ్మడివారికుఱ్ఱాడిచేతపట్టించాడు.

మెసపటోమియాకుపోయినవారిలో బుర్రిసుబ్బయ్య, తమ్ముపిలిపించినపనేమిటన్నాడు. అంకమ్మ, గంగయ్యవంకచూశాడు.

గంగయ్య—ఏమున్నది? అందరికితెలిసిందేగా?

ఊకమ్మారు, యిదేమో, వోట్లు, వోట్లుఅనిమనవెంబ

డిపడ్డారు. ఇదివరకేమో, యేవ్యవహారములోనైనా, కమ్మా రెట్లానడచుకోమంటే, అట్లాపోయేవాళ్ళము మనమందరము. మారెమ్మకొలుపుకైతేయేమి, గంగానమ్మజాతరకైతేయేమి, మనవాళ్లుయేమిచెయ్యాలో, మనతాతలనాటినుండి, యిదియిట్లా, అదిఅట్లా, అనిమనకు తెలిసుంది. కాని, యీవోట్లహడావుడీ, రైళ్లు, మోటారుబండ్లు, తంతులుమాదిరిగానేయీ ఖెల్లోరి బిసలాగుండి. మనకేమీ తెలియదు. మనతాతముత్తాతలు, వాటినిగురించియేమీయెరుగరు. సాధారణంగా, మనకునాయకులైనకమ్మారైనా, యేదోదారిచూపెట్టుతారనుకుంటే, వారుతలాఒకరీతినిపొమ్మంటూరు. తుదకు, ఆ బెజవాడ బ్రాహ్మడిగోలావద్దు; యీబందరుకమ్మాయనరొదావద్దు, ఆగవర్నరుపేటరెడ్డిరంకెలువద్దన్నా, ఈకమ్మారుపూరుకోక, ఒకరీతట్టుకు, ఒకరాతట్టుకు, లాగుతున్నారు. యేమోపెద్దపాటిపై త్తందారులుకదా మీరందరు, మిమ్ములనుకలుసుకొని, మంచిచెడ్డలువిచారిద్దామనివచ్చాను. ఓహో, యింతేనా, యీతెల్లబుట్టచెప్పవచ్చింది, అనిఒకరు, యింతమాత్రానికిమనలనుపిలిపించడమెందుకు అనిమరొకరు, బాగానేవుంది, తమపోట్లాటతామతీర్చుకోక, మనకుకూడయీబంకతగిలించడానికావచ్చాడు, అనిమూడోమనిషి, ఒరే యిదంతామనలోమనకుకీచులాటపుట్టించడానికిరా, అనిమరొకరు, యిట్లాపలువురుపలువిధాల, అందరొక్కమారేమాట్లాడప్రారంభించారు.

ఎనుబోతు వెంకన్న—

తాతా! యీవోట్ల హడావుడి, మాకూ గందరగోళముగానే

ఉంది. ఓయి, మీరంతా నిశ్శబ్దంగా ఉండాలి. వేల్పూరు పెద్ద మాదిగ మనమాటకొసరమొస్తే, యేమిటీగోలంతా? (అందరు సత్యమణిగారు). మాపూళ్లో, మొసపట్టోమియాకు పోయివచ్చిన మా అప్పారకు, కులపెద్ద అంకమ్మకు, యింకా నలభైమందికి మాత్రం వోట్లుఉన్నయి. మీపూళ్లో యిరవైఅయిదు వోట్లు మాత్రం ఉన్నవట. యివన్నీ, నీవెట్లా చెప్పితే, అట్లా యిస్తాము, అందరికి యిష్టమేనా చెప్పండి అన్నాడు. (కలకలము ప్రారంభ మయింది).

మన్నవ రామయ్య—

పెద్దలు, పెత్తందారులు, అని మీరేమో గల్లంతుచేస్తారు. వోట్లంటే యేమిటో తెలియని యీ ముసలివాళ్లు, మనకేమి పెత్తనము చేస్తారయ్యా! ఈవోట్లు యెందుకు వచ్చినయ్యో, మనమెందుకు యివ్వాలో, యెవ్వరైన చెప్పుతారా మరి?

అంకమ్మ—

నీకు వోటు వున్నదటోయి?

మన్నవ రామయ్య—

కరణంగారిని యీ ప్రొద్దు అడిగితే, లేదన్నాడు.

అంకమ్మ—

ఇంతమాత్రానికే, చారడంతనోరు చేశావు.

బొల్లెద్దు శంకరయ్య—

మనకున్న వోట్లల్లా పదిహేను. వాటిల్లోయేదో గుణముండక

పోతే, అన్నీ తెలిసిన యీకమ్మోరు మనచుట్టూ యెందుకు తిరుగుతారు? వాటికంత ఖరీదుంటే, యెవ్వరు హెచ్చుధర పెట్టితే వారికిస్తాం. ఏమంటావు? కులపెద్ద అంకమ్మా! మనము యెవ్వడికైనా తప్పుపెట్టితే, పదిరూపాయలు వసూలుచేసి, అందరికి విందుచేయడం లేదా? అట్లానె వోటుకు రూపాయి యెవ్వరిస్తే వాళ్లకిద్దాము. ఏమేతాతా? యేమంటావు?

(ఎ. వెంకన్న సోదరుడు చెంగన్న, ఖంగునదగ్గి, గొంతుసవరించుకొని, తనచేతిలోని కర్రనుపైకెత్తి). "తాతా! ఈ శంకరయ్యకు యెప్పుడూ తాగుడు ఆరాటమే. వాడిమాట లక్ష్యపెట్ట వాకు. తాగుడు మంచిదికాదని, యెంతోమందివచ్చి మనకు చెప్పుతున్నారు. తుదకు మనకులపెద్దకూడ, ఆముతెకగుడ్డల వారిమాటవిని, ఈమధ్యజరిగిన, కులతీర్పు డబ్బును, కల్లు గొనడానికిగాక, చిన్నపిల్లలకు పైగుడ్డలు కొనిపెట్టడానికి, ఉపయోగించాడు. ఇప్పుడుగూడ, మళ్లా యీవోట్లు అమ్మకొని, తాగి, తందనాలు తొక్కడం మనకులానికి లాకీగాదు.

శంకరయ్య—

ఐతేనీమొర యేమిటోయి! వోట్లనుమురగేస్తానంటావా!

చెంగన్న—

మురగేయడంయెందుకూ? మనదేశానికినల్లవారిరాజ్యంవస్తుందట. చెన్నపట్టణంలో, మనదేశమువాళ్లేపెత్తనముచేస్తారట. మనము, వోట్లను, మంచివారికి, యితరులమేలెంచేవారికి, మంచి

చెడ్డలు తెలిసినవారికి స్తే, వారు చెన్నపట్టణంపోయి, మనలను ప
రిపాలించడానికి, బుద్ధిమంతులు, పెత్తనంచేయ నేర్చినవారు, బీ
దసాదల మేలుకోరువారు, రైతుల బాగు, కూలీల సౌఖ్యము,
హెచ్చుచేయువారిని, మంత్రులు గా యేర్పాటుచేస్తారట.

గావిపాటిసిద్దన్న—

ఈమాటలు యెక్కడ నేర్చావురా? పెత్తనం, మంత్రులు, ఓ
హెూ!

చెంగన్న!—బెజవాడలో, రెండుసభలుజరుగుతుంటే,
వినివచ్చానోయి. నేను మెసపటోమియాపోయానుగదా! ఆదే
శాలన్నిటిలోను, అచ్చటిప్రజలే, పెత్తనం జేసుకుంటున్నారు.
తెల్లవాళ్ళ దేశములో, నల్లవాళ్లురాజ్యంచేయడంలేదుగదా! మ
న దేశములో, తెల్లవాళ్ల పెత్తనంయెందుకూ?

అంకమ్మ—

చెంగన్నా! మనకా పెద్దసుద్దు లెందుకోయి? యీవోట్లమాటే
మిటంటావు?

చెంగన్న—

అనేటందు కేముంది. లంచాలుమనకొద్దు మంచివారెవరోమీా
రుచెప్పితే, వారికి, నేనూ, నాఅన్న, వోట్లనిస్తాము.

గంగయ్య—

బాగానేఉంది. తిరిగిమొదటికేవచ్చావే? మంచివాళ్లెవ్వరోమీా
లో, యెవరైనా తేల్చుకున్నారా?

ఎ. వెంకన్న—

ఆహా! కోటలయ్యగారాయన, రెడ్డిదొర.

శంకరయ్య—

గొప్పమాటన్నావు, లేకలేక, పైనబడికట్టించే, ఆరెడ్డిదొరేదొరి కాడునీకు.

అంకమ్మ—

నాకారెడ్డిగారితో సంబంధంలేదుగాని, మనకున్న త్రనంచేసేవా రుకావాలసిఉంటే, బాగాలరచేవారేపనికివస్తారోయి. వూరిలో కిపెద్దరైతువునీవు. రావిపాటిచుక్కయ్యా! నీవేమైనా,ఆలోచిం చావా? తాతా! యీతడుపదియకరాలవ్యవసాయంచేస్తున్నా డు. బెజవాడలో, తోళ్ళవ్యాపారంకూడాఉంది. వూళ్ళో, నా తోబాటు, కోటలబేరంచేస్తుంటాడు.

రా. చుక్కయ్య—

మన శంకరయ్య చెప్పినట్లు; మనకులసాంప్రదాయాల ప్రకార మైతే, మన వోట్లన్నిటిని, ఒక్కరికో, యిద్దరికో, పోటీమీద వేలంవేసి, వచ్చినడబ్బుతో, కల్లుపనికిరాకపోతే, పిల్లలకు, పైగుడ్డలకై, ఉపయోగించవచ్చు. కాని, మనమీరోజుల్లో, కులపుమాటనే యెప్పుడూ, తలపెట్టకూడదు. కులాలపట్టిం పులు, యుద్ధంతోనేపోయినవి. ఎక్కడో, యింగ్లండులో పుట్టిన తెల్లవారెక్కడ, మనవూరిలోని, బోడివాళ్లెక్కడ? ఎవ్వరికి పనికిరాని మన యీపదిమంది అంటరానివాళ్లను, కమ్మారిని, బెజవాడలోని బ్రాహ్మణులను; గజగజవణికించే తెల్లవాళ్లు,

పలకరించి, మర్యాదజేసి, మతమిచ్చివెళ్లారే! ఏమే తాతా! యెప్పుడైనా యిట్టివిశేషాలు మీనాయన యెరుగున్నాడా! ఎరుగడు. ఈడువుగల్లేమో, మనమేమోకాని, వెనుకటి రోజుల్లో, యీదేశాలువదలి, సముద్రాలమీద ఓడలెక్కి, యెక్కడనోఉన్న మెసపటోమియాకు, ఆరోజుల్లో యెవ్వరైనా వెళ్లారా? లేదు. ఇళ్లుతగులబడ్డప్పుడో, వేకువజామునవారు మళ్ళు తడపడానికి కూలీలవసరమైనప్పుడోతప్ప, యిప్పటివలె వోటుకోసరం మనగూడెంలోకి, యీకమ్మా రొచ్చేవారేనా? లేదు. క్రొత్తక్రొత్తవింతలు కల్గుతున్నయి. దేనినన్నా తీసుకొని దేశాంతరము వెళ్ళినవాళ్ళను యెరుగుదుముకాని, దొంగిలించి పారిపోయినవాళ్ళున్నారుకాని, అప్పులుతీర్చలేక వూరు విడిచినవాళ్ళున్నారుకాని, మనతాతగారి ముత్తయ్యవలె చదువుకోసరము, సంసారులమీద దండెత్తడంకొరకు, తలిదండ్రుల విడిచి, దేశాంతరము పోయినవాళ్లను చూశామా! లేదు.

శంకరయ్య—

లేదు, లేదు, లేదు, అంటావేమయ్యా! ఇక ఉండేదేంది? నీవు, నీపొలము, నీ మాటలేనా?

చుక్కయ్య—

మనశంకరయ్యకు, కల్లుఆరాటంయెక్కువయింది(అందరునవ్వారు). మనంకనివినియెరుగనివ్యవహారాలు, తెల్లవారియుద్ధమువచ్చినతరువాతజరుగుతున్నయి. ఈవోటులలోయేదోగొప్పవిశేషంలేకపోతే, చదువుకున్నవారు, ధనికులైనవారు, గొప్పవారు

యింతగామనచుట్టూతిరగడమెందుకాఅని, నాకుబందరుబోయే టప్పుడుతట్టింది. ఆసాయంత్రం, నాతోళ్ళుకాస్త, అమ్మినతరువాత, రైలుఖిమించిపోతే, చేసేదేమీలేక, మధ్యచోకులో, యేదోమీటింగుజరుగుతుంటే, అచ్చటికిచల్లగావెళ్లాను. వెయ్యికిపైగాజనండున్నారు. ఒకరుబెంచిమీద, యిద్దరుకుర్చీలలో కూర్చున్నారు. ఒకాయన లేచిమాట్లాతున్నాడునేనువెళ్లేసరికి. అట్టేచూస్తినిగదా, మనతాతగారిముత్తయ్యేఆతడనిపించాడు. (అడుగో, తాతకూడఅదరిపడుతున్నాడు) కానినాకుగట్టిగానమ్మకంకలుగలేదు.

అంకమ్మ—

ఎట్లావున్నాడు? యెన్నియేండ్లుంటయి? ధ్వనియెట్లావుంది?

చుక్కయ్య—

నీకేయింతఆతురతగాడున్నది, కన్నతండ్రిగంగయ్యతాతకెంతతహతహకల్గుచున్నదోకదా! ఎర్రనికుర్రవాడు; దాదాపుముప్పైయేండ్లుఉంటయి, మంచికోరమీసంవచ్చింది. గిరజాలుపెట్టాడు. ఈనాటికమ్మారివలెనే, చోక్కాతొడిగి, ఉత్తరీయంవల్లెవాటువేసుకున్నాడు. నొస్టనగంధపుబొట్టువుంది. ఆవిశాలమైనకండ్లు, చక్కనిచెక్కిళ్ళు, ఎత్తగుభుజాలు, దృఢమగుచేతులు, తళతళమంటున్నపండ్లు, మహాచక్కగాడున్నాడు. కళ్ళుతుడుచుకుని, పదేపదేచూచి, యెవ్వరో, బ్రాహ్మణుడుగాబోలనుకున్నా.

గంగయ్య—

సరేలే, యెవరికర్మం యెవరుతప్పించగలరు? ముత్తయ్యా యేవూళ్లో, యేమిచేస్తున్నాడో మనకేం తెలుస్తుంది. ఆయ నేమిచెప్పాడు యీవోట్లనుగురించి?

చుక్కయ్య—

ఓట్లున్నవాళ్ళంతా వోటర్లు. వీరందరికి మనరాజ్యంలో క్రొత్త పెత్తనంవచ్చింది. తమ వోట్లను, మంచివాళ్ళకిచ్చి, వారిని చెన్నపట్టణం పంపితే, వారు ఆపట్టణంలో సభచేసి, మంత్రులను యెన్నకొని, వారిచేతమనకు రోడ్లు, కాలవలు, బావులు, వంతెనలు, మాగాణి, ఆస్పత్రులు, చెరువులు, పాఠశాలలు, యేర్పాటుచేయిస్తారు. చెడ్డవాళ్లకిస్తే, వాళ్ళుపోయి, మనకు రావలసినన్ని సౌకర్యాలను రానివ్వకుండా, తమకు, తమ బంధువులకు, లాభాలు కలుగజేసుకుంటారు. ఈ రోజుల్లో, ప్రతి వోటరుకూడా, తన మేలుమాత్రమేగాక, తన వూరియొక్క, జిల్లాయొక్క, మంచిచెడ్డలను, ఆలోచించుకోవాలన్నాడు.

శంకరయ్య—

అట్లైతే, యీకమ్మారు మన మేలుకూడా విచారిస్తారా? మన పాట్లోకి కలరావస్తే తొంగైనా చూడరేం.

గంగయ్య—

ఎన్నాళ్లకు శంకరయ్యకు, దారి కనబడిందోయి ?

చుక్కయ్య—

ఈరోజుల్లో, కులాలపట్టుత్వంతగ్గింది. రైళ్లలోనేమి, బస్సుల లోనేమి, ఆఫీసులలోనేమి, వ్యాపారములోనేమి, తిరునాళ్ళ లోనేమి, వర్ణసంకరంకల్గుతూఉంది. వెనుకటివలె, అంటరాని వాళ్ళనుత్రోసివేయడానికివీలులేదు. పబ్లికురోడ్లు, భావులు, చెరువులు, స్కూళ్ళు, కోర్టులు; కచ్చేరీలు, అన్నింటిలో, పంచములు, సమానహక్కులుపొందవచ్చు. చట్టములసంగతితెలియకపోవడంవల్ల, పంచములిప్పటికిగ్రుడ్డివాళ్లై, యెప్పటియట్లే ఉన్నారుకాని. యీయెన్నికల్లోపాల్గొనడంద్వారా వారియీాపిచ్చిపోతుందనినమ్ముతున్నా అన్నాడు.

అంకమ్మ—

ఇంతకూ, యెవ్వరికిమ్మన్నాడు. మనవోట్లను?

చుక్కయ్య—

ఎవ్వరికిమ్మనడమేముంది? ఎవ్వరైతే, ప్రజలకులాభంచేయడం కొరకు, రైతులకుమేలుచేయడానికి, కూలీలకుపనిపాటలు హెచ్చుచేయడానికి,కష్టపడతామంటారో, వాళ్లకేమీావోట్లనివ్వాలసిందిఅన్నాడు.

ఎ॥వెంకన్న—

చుక్కయ్య చెప్పేదంతా, నాకేమో గొడవగాఉంది. మంచి వాళ్లకేయిద్దాం మనవోట్లన్నిటిని. కాని యిప్పుడు వస్తున్న వాళ్లల్లో, యెవ్వరు మంచివాళ్ళో మనకేం తెలుసు. వాళ్ళు

మన కులస్థులన్నా అయితే, వారి వీరి నడిగి తెలిసికొందుము. వారేమో పెద్దకులాలవారైతిరి. ఏమని యెవ్వరినడుగదాం? ఆ బందరులో కోరమీసాలాయన యేమీ చెప్పలేదా? ఆయన పేరేమిటి;

చుక్కయ్య.

మీటింగంతా అయిపోయినతరువాత నేనుచల్లగా ఆయన యెద్దకుపోయి, అయ్యా! మీ పేరేమి? ఏయూరు? అని అడిగాను. నన్ను బసవలింగయ్య అని అంటారండి. మాదసలు బెజవాడ తాలూకా. ఈవూళ్లో, రాంజీగారి పాఠశాలలో ఉపాధ్యాయుడుగా ఉన్నాను. మిమ్మెచ్చటనో చూచినట్లున్న దే. మీది యేవూరుగల్లా అన్నాడు. నేనదరిపడి, ఐతే, బాబూ! మీ పేరు ముత్తయ్య కాదుగదా? అన్నాను. పకపకనవ్వుతూ, కాదండి, నేనాప్రాంత్యాల్లో, యీమధ్య కోవెలమూడి గోపాల కృష్ణయ్య, కొళంద రెడ్డిగార్ల తరఫున, వోట్ల ప్రచారానికై వచ్చాను. మీరు మునసబుగారి యెద్దులను నాణ్యముజేయు చున్నారప్పుడు, అనెను. ఆశాభంగుడనై ఆయనకు దండము బెట్టి, వెళ్లిపోయాను.

గంగయ్య

చుక్కయ్యా! ఆయనకులమేదో తెలుసుకున్నారా?

చుక్కయ్య

లేదండీ! హోటల్లో రాంజీగారి స్కూలునుగురించి, వాళ్ళనివీళ్ళనిఅడిగాను. ఆయనకాకినాడలోపేరుపొందినఒకపెద్ద

పంతులుతమ్ముడట. పండంటిబ్రాహ్మణులట, రాజమండ్రిలోని వీరేశలింగంగారు, కలకత్తాలోనిరాయలుగారిమాటవిని, మన వాళ్ళనుబాగుచేయడానికి, బెజవాడలో, కాళేశ్వరరావు, గుడివాడలోగూడూరిరామచంద్రరావు గార్లవలెనే, పంచముల కోసరం, పాఠశాలను, బందరులోపెట్టాడట.తనకులస్తులువెలేసి నాకూడాభయపడక, మనవాళ్ళకై, యెన్నో,పాట్లుబడుచున్నాటడ. ఆస్కూల్లోపంతుళ్ళుగా ఉండేవాళ్ళంతా, మనవాళ్లమే లుకోరేవారట.

గంగయ్య

అట్లైతే, మనంకూడా, ఆబసవలింగయ్య, చెప్పినట్లే రెడ్డికి, గోపాలకృష్ణయ్యకు, మనవోట్లనిద్దాం. నేనురేపుబెజవాడ పోయి, వారిద్దరిని, కలుసుకొని, మాట్లాడివస్తా. అంకమ్మా! నీవుకూడావస్తావా?

అంకమ్మ

రాకేమి, మనచుక్కయ్యనుకూడా, తీసుకువెళదాం. వారితోమాట్లాడడానికి, ఆతనికి, బాగాఅనుభవంఉంది.

శంకరయ్య

ఎప్పుడైతేతాతవచ్చాడో, కల్లుముంతపగిలిపోయిందని తీర్మానించుకున్నా.

చెంగన్న

ఒరేశంకరయ్యా! నిజముచెప్పరా! నీకీలంచంమాటచెప్పింది, తూర్పువీధిముతాదారుడుకాదటరా? నాకుతెలిసిందిలేఅ

ప్పాడే. మనకు త్రాగబెట్టి, మన చేతచిందులు తొక్కించాలను కొంటున్నారు, యీబస్త్రీలకెక్కనకమ్మారు. అదిసాగదురా యీరోజుల్లో.

ప్రొద్దుపోయిందికనుక, అందరూలేచి, యెవరియిండ్లకు వారుపోయారు. మరునాడుప్రొద్దుననేగంజత్రాగి, చుక్కయ్య, అంకమ్మ, గంగయ్య, బెజవాడకు కాలినడకను బోయి, యెనిమిది గంటలకు చేరారు. అప్పుడే కాలకృత్యాలు తీర్చుకొని, కుర్చీపైకూర్చుంటున్న, రెడ్డిగారి యేజంటు మరొకరితో మాట్లాడుతున్నాడు. చుక్కయ్య అవీభూదిరేఖల నొష్ట అడ్డంగాతీర్చి, బ్రాహ్మణుడివలే, అడ్డగోచిపెట్టి, రూపసియైన, యీక్రొత్తవానిని గంగన్నకు చూపెట్టి, "తాతా! ఆయనే బందరులో ఉపాన్యాసం యిచ్చింది". అని సంజ్ఞజేశాడు. వీరు ముగ్గురు, వారిద్దరికి నమస్కరించారు. బసవలింగయ్య, గంగయ్యనుజూచి, నివ్వెరపోయి, పరమసంతోషంతో, నమస్కారంచేసి కౌగలించుకున్నాడు. పాపం ఆ రెడ్డిగారి యేజంటు, యేమీతోచక, యెగాదిగాచూస్తున్నాడు. అంకమ్మకు చమట పట్టింది. గంగయ్యకు, మాటలు తడబడుతున్నాయి. చుక్కయ్యమాత్రం, బాబూ! బసవలింగయ్యగారూ! వీరు మాకుల పెద్ద గంగయ్య. వేల్పూరుకు చుట్టుపట్లనుండే పంచములకు తల మానికము. మొన్న, వీరు బందరులో సెలవిచ్చిన మాటవిని, రెడ్డిగారితో మా వోట్లు నిస్తామని చెప్ప వచ్చాము. తెల్లనిగడ్డం, ముడుతలువడిన నెన్నుదురు కల్గిన

మాగంగయ్యతాత, తమమర్యాదవలనఅమితమైనసంతోషం పొందాడు, అన్నాడు.

బసవలింగయ్య

చుక్కయ్యగారూ! మీరుఅంతఆశ్చర్యపడాలసినపని లేదు. నేనుమీప్రాంత్యంవదలి, యిప్పటికినాల్గుసంవత్సరాలేగా! యింతలోనేమరచిపోయారా? ఏజంటుగారూ, యీపండుముసలిమానాయనగారు. నాపూర్వపుపేరులింగయ్య. పంచములందరిని, గౌరవార్హులుగాచేయుతలంపుకలవాడినిగనుక, నాకుశ్రీపున్నవలక్ష్మీనారాయణగారు, బసవలింగయ్య, అనిపేరుపెట్టారు. అంకమ్మగారూ! భయపడతారెందుకు? కూర్చోండి, యీకుర్చీలో, రెడ్డిగారియేజంటుకీలాటిపట్టింపులేమీ లేవండి. నాయనగారూ! చూశారా దేశమెట్లామారుతుందో! మనపంచములనుద్ధరించడానికి, జాతీయనాయకులుకూడ, పూనుకుంటున్నారట. ఇదిగో, యీదినంవచ్చినఆంధ్రపత్రికలో, గాంధిమహాత్ముని మేలుకొలుపుఉంది. ఏజంటుగారూ! మానాయనగారితోకలసి, మావాళ్ళక్షేమసమాచారాలు తెలుసుకోవాలనికుతూహాలంగాఉంది.యిప్పటికిసెలవియ్యండి. మావాళ్ళందరివోట్లు,మీవారికేయిప్పించుతానని యిదివరకే చెప్పానుగా. రండి. అంకమ్మగారూ, చుక్కయ్యగారూ, అని తండ్రిచేయి పట్టుకొని బయటికి తీసుకువెళ్లాడు.



# హరిజన నాయకుడు.

మూడవ ప్రకరణము.

బసవలింగయ్య, చుక్కయ్య, అంకమ్మ, గంగయ్య, బెజవాడ గవర్నరుపేట సత్రంలోకి వెళ్ళి, అరుగులమీద కూర్చున్నారు. బ్రాహ్మణులు తిరిగే చోటయిది, యిచ్చట తామెట్లా కూర్చొని మాట్లాడుకోవడమాయనే సందేహం, బ్రాహ్మణునివలెనేయున్న బసవలింగయ్యగారితో, ఉన్నంత సేపు, వేల్పూరు, ఈడ్పుగల్లు కులపెద్దలకు కలగనేలేదు. బసవలింగయ్య, తనతండ్రి కెదురుగాకూర్చొని, తనకథచెప్ప ప్రారంభించాడు.

“నేను మనవూరునుండి వెళ్ళిపోకముందే, కొంతకాలం మన బడిపంతులువద్ద, మరికొంతకాలము మన పెద్దకాపుగారి గుమస్తావద్ద, చదువు చెప్పించుకుంటున్నా. శతకాలు పూర్తి చేసి, పల్నాటివీరులచరిత్ర వల్లనవేసి, భాగవత పారాయణం లోకివస్తున్నా. ఎకుసులువరకు, లెఖ్ఖలుకూడ వేశాను. ఇంకా వారంరోజుల్లో మనవూరినుండి వెళ్ళిపోతాననగా, కోవెలమూడి పెద్దరైతుకొడుకు, ఈడుపుగల్లు అడుసుమిల్లివారి ముఠాదారుడు, నేనూ, బెజవాడనుండి, కాలినడకను వస్తూవున్నాము. నేనెవరో తెలియక, తమవలెనే కమ్మవారి రైతుబిడ్డననుకొని,

ధనము, ధాన్యము, పాడిపంటలు, వగైరాలగూర్చి మాట్లా డుతూ, ఈడుపుగల్లు వంతెనవరకు, వచ్చారు. ఇక నచ్చటనుండి, యెవరిదారినివారు వెళ్లవలసివచ్చింది కనుక, మీాదేయూరంటే, మీాదేయూరనుకుంటుంటే, నేను, వేల్పూరుగంగయ్య మూడో కొడుకునన్నాను. ఏమో పుట్టిమునిగిపోయినట్లు, కన్నుమని, ఆయిద్దరు నాపైమండిపడి, తమ్ముమోసంచేసి, వేషంవేశావని, అనరానిమాటలన్నీ అన్నాటు నాకంటే చదువులో పనికిమా లినవారైనా, పిరికితన అహంకారం, అసూయ, యేమాయని, నాకధికవిచారం కలిగింది. ఇక మనవూళ్లో, యెన్నాళ్లు మనవా ళ్లకుచెప్పినా, యెవ్వరునామాట వినకపోవుటచేత, కమ్మవారు, శూద్రకులసులతో పోటీపెట్టుకొనేవిధం కన్పడక, వూరువిడిచి బస్తీకి పోతేనేగాని, ఆత్మగౌరవము దక్కదని, నిశ్చయించు కొని, వెళ్లిపోయాను.

గంగయ్య

ఎవ్వరికి చెప్పకుండా వెళ్లిపోయావేమిరా నాయనా! మీాఅమ్మ, ఆనాటినుండి యీానాటివరకు, చింతింపని రోజులేదే! నీతమ్ములిద్దరికి, పెండ్లియీాడువచ్చినా, ముత్తయ్యమాట తెలి యనిదే, పెండ్లిండ్లు మనయింట్లోచేయడానికి వీలులేదంటూా వుంది

బసవలింగయ్య

నీవెప్పుడూ, పైకులాలవారి గొప్పతనము. మనవారి పతనముగురించే మాట్లాడుచుంటివి. పెద్దకాపుగారి కుటుంబ

చెప్పడు, మనవాళ్ళతో, అన్యోన్యముగాయున్నారు గనుక, నీవు, శూద్రుల నొక్కమాట అనడానికి నోరు రాదయ్యెను. పైగా, నేను, అచ్చటచ్చట యేమేమో మాట్లాడుతున్నానని, మునసబుగారి ముఠావారందరు, పెద్దకాపుగారిని దూషించడము ప్రారంభించిరి. చెప్పితినా, పెద్దకాపు, వాళ్ళమీద దండెత్తి, అప్రతిష్టపాలగుదువు, నీవు కండ్లవెంబడి నీళ్లుపెట్టుకుంటావు, యెందుకీతంటాలంతాయని, ఆపొద్దున భోజనముచేసి, చక్కా బెజవాడ పోయినాను. బెజవాడలోనున్న మిషనరీ దగ్గరకువెళ్లి, నాకు చదువుకొనవలయునని యున్నది, యేదైన సదుపాయము చూపెట్టుమని యడిగితిని. ఆయన, బందరు పొమ్మనిచెప్పి, బందరు కాలేజీవారకు, ఒక యుత్తరము వ్రాసియిచ్చెను. కాలేజీదొర, దయతో, నాకు ముందుగా విద్యార్థులందరుండు హాస్టలులో, చిన్నయుద్యోగ మిచ్చి, ప్రతి దినము, ఉదయము, సాయంత్రము, తమ హెడ్ మాష్టరుగారిచేత, యింగ్లీషు చెప్పించుట కేర్పాట్లుచేసెను. ఒక్క సంవత్సరములో, నాల్గవఫారమువరకు వస్తిని. రెండో సంవత్సరమునందు, కలకత్తా పంపించి, మెట్రిక్యులేషను ప్యాసగునట్లు చేసినాడు. అంత, తనకాలేజీలోనే చేర్చుకొని, హాస్టలుకు, సెక్రటరీగాయేర్పరచి, నెలకు రు 30 లు జీత మేర్పాటు చేసి, రెండుసంవత్సరాలయ్యేవరకు ఎఫ్. ఏ. పరీక్షయందు ప్యాసయ్యేటట్లు సహాయము చేసినాడు. బి. ఏ. క్లాసులో చేరినతరువాత, నన్నొకనాడు పిలిపించి, క్రిస్తియను మతస్థులనే, కాలేజీకి సంబంధించిన యుద్యోగములందు నియమింపవలె

ననియు, హిందువులైనవారిని తొలగించవలెననియు, క్రిస్తియనులకే, స్కాలరుషిప్పు యిచ్చి, భోజనము వగయిరాలు, ఉచితముగా యేర్పాటుచేయవలెననియు, పైవారు నిర్ణయించినారని చెప్పి, నన్ను యేమిచేయకోరెదవు, అని యడిగెను. నాకిట్టి యిబ్బంది వచ్చునని చాలాకాలమునుండి భయముకలిగియుండుటవలన, మనస్సునందు హిందువుగానెయుండి, నాకులస్తులకందరకు, దేశమందు పేరుప్రతిష్ఠలు తేవలెనను కుతూహలము కలవాడనై యుంటినిగనుక, రెండురోజులలో నా సమాధానము తెలియపరచెదనంటిని. క్రిష్టియనులు, ఎన్నివిధముల మీవారికి సహాయముజేయుచున్నారో, అనాధలైనవారికి, యెటుల దిక్కుదివానము కల్పించుచున్నారో నీకు తెలిసిన విషయమేగదా? అనిమాత్రము చెప్పి, నన్ను పంపివేసిరి.

బందరు వెళ్ళినప్పటినుండి, దేశోపకారకమగు పనుల జేయు పెద్దవారందరివద్దకు వెళ్ళుచూ, వారివలన బోధచెందుచుంటిని. ముఖ్యముగా, స్కూలుఫైనలు తరగతి ప్యాసయిన తరువాత, నాలోనాకే నమ్మకముకలిగినదిగనుక, జాతీయకళాశాల పెట్టించి, మనదేశమునకు స్వారాజ్యము దెచ్చుటకై కంకణముకట్టుకొన్న, కోపల్లె హనుమంతరావుగారి స్నేహితము చేసుకొని, వారిద్వారా కృష్ణాపత్రిక బృందము, జాతీయమహాసభ బృందముతో చెలిమికల్గించుకొంటిని. వారమునకొక్క సాయంత్రమైనను, జాతీయకళాశాలయావరణములో, ఆచల్లనిచెట్ల క్రింద, ఆభావిప్రక్కనో, దొరువులచాటుననో, కొబ్బరనీళ్ళను త్రాగుచూ, ఎల్లప్పుడు ప్రజోపయోగకారకమగుపనుల గూర్చి

చింతించు మహానుభావులచెంత కాలముగడపెడివాడను. తత్వశాస్త్రజ్ఞానమును, తననయనములనుండి, జ్యోతులవలె ప్రకాశింపజేయు కృష్ణారావుగారు, కులములతో పనియేలేదు. విగ్రహారాధన యవసరములేదు, పంచములనువారేలయని, వాదించుచుండిరి. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, హిందువుల నందరిని బ్రాహ్మణులుగా మార్చిననేగాని, హిందూసంఘము బలిష్టము కాదని ఘోషించెడివాడు. స్వరాజ్యమురానిది, మనదేశమునకు ముక్తికలుగదు. పరరాజ్యమున్నంతవరకు మనలోమనకు అంతఃకలహములుతప్పవు. అని డాక్టరు పట్టాభి శీతారామయ్య గారు చెప్పినారు. సంస్కృత భాషాజ్ఞానమును, తిరిగి, మన ప్రజలకు కల్గించితేనేగాని, మనవారికి, మనభాష, కవిత్వము గురించి గౌరవముకలుగదని హనుమంతరావుగారు అనేవారు. ఇట్టి చర్చలనేకములు విన్నపిమ్మట, నాకుమాత్రము, ఏకులము నందు మాతండ్రి కులపెద్దగా వన్నెగాంచినాడో, ఏమతాచారములు నాజాతివారందరికి, ఉగ్గుబాలతో దేహములోని కెక్కెనవో, ఏరామకృష్ణులచైదముల భావపరంపర నా రక్తబంధువులకు పెన్నిధియైయున్నదో, అట్టి హిందూమతమును, జాతీయతనుబాసి, నాయంతటనేనే, నాసంఘమునుండి వెలియై, క్రీస్తుమతమందు జేరుటతగదని తీర్మానించుకొంటిని.

నన్నట్లు పిలిపించి, కర్తవ్యమును నిర్ణయించుకొమ్మని ప్రిన్సిపాలుగారు చెప్పిన పిమ్మట, నేను హనుమంతరావుగారిని చూచుటకు వెళ్ళితిని. ఆయన కళాశాలయందు, బుద్ధుని శిలా ప్రతిమను గుంటూరునుండివచ్చిన శ్రీ లక్ష్మినారాయణ

గారికి జూపెట్టుచూ" యీ హిందూసంఘములాంటి అద్భుత మగు సాంఘికసంస్థ మరొకటి కలదాయని నాకొకప్పుడు ఆశ్చర్యము కలుగుచుండునండి, లక్ష్మీనారాయణగారూ! ఈ మహామహుడు బుద్ధదేవుడు, తాను హిందూమతమునుండి దూరమగుచుంటిననుకొనెను. ఆయన శిష్యులు, తమ పద్ధతి హిందూపద్ధతికి పూర్తిగా వ్యతిరేకమనుకొని, తమ నుతమే వేరనుకొనిరి. అట్లని వారినివదలివేసినదా, హిందూసంఘము! వారి వెనువెంటనే పోవుచూ, మృదువుగా ప్రేమతో లేదు లేదు, మీయాలోచనలు నాకివ్వండి, మీ ఆచారములు మంచివగునంతవరకు నాకు కావాలసినవె, మీరు నానుండి వేరుకావలసిన పనిలేదు. అని పల్కుచూ వారిని క్రమముగా చేరజేసి, తుదకు బౌద్ధసాంప్రదాయముల తనపొట్ట నిడు కొన్నది ఈబుద్ధుడే, యిప్పుడు మన దశావతారములలో నొకడైపోయినాడు. ఇంకా కొన్నాళ్ళుపోతే, క్రీస్తువుకూడా హిందూయవతారములలో నొక్కడగును. అప్పుడు మనకు క్రీస్తవులు, హిందువులుకారను అప్రతిష్ఠపోవును. మాబృంద ములోనివారందరము, హిందూమతమునం దిప్పుడుండు దురా చారముల జూచి, సహింపజాలక, అందున్నంతవరకు, మాకా మలినము వదలదను భ్రమచే, రఘుపతి వెంకటరత్నం నాయు డుగారు, వీరేశలింగంగారి బోధవిని, బ్రాహ్మసామాజికుల మైతిమిగదా? ఇప్పుడు తిరిగి దేశసేవను ప్రారంభించి, మన దేశము, చరిత్ర, నాగరికత, విజ్ఞానము, హిందూమతమును గూర్చి, విశాలదృష్టితో చూడడం ప్రారంభించి, పెత్తనము

కట్టుకొనేవరకు తిరిగి హిందువులమైతిమిగదా యనుచుండెను. ఇంతలో నన్నుజూచి, ఓహో, ముత్తయ్యా! వచ్చినావా! యీయనగారు వీరేశలింగంగారి శిష్యకోటిలోనివారు. గుంటూరుజిల్లాలో సాంఘికసంస్కారోపన్యాసములు చేయుచుందురు. మీ పల్నాటికన్నమనాయునిగూర్చి బాగా పొగడుచుందురు. లక్ష్మీనారాయణగారూ! యీముత్తయ్య రానున్న నూతనయుగ రాజ్యలక్ష్మిని వరింపనున్న, పంచమయోధుడు. ఈయనచరిత్ర చాల అద్భుతముగనుండును, అని మమ్ము ఒకరికొకరిని యెఱుకపరచి, లోపలికి తీసుకొనిపోయెను. నేను వారిద్దరికి, నా కథయంతయు తెల్పి, నేను ప్రథమమున శూద్రజాతులవారిపై ద్వేషముకలిగియున్నాను, రాను రాను, అందఱు అజ్ఞానాంధకారమునబడి తన్నుకొనుచుంటిమనియు, నూతనసాంఘిక కట్టుబాటులగూర్చి, మహావక్తలగు గోపాలకృష్ణునివంటివారు బోధించినగాని, కర్మవీరులగు మా హనుమంతరావు ప్రతిభృతులు చేసి చూపెట్టినగాని, సంకుచిత భావోద్రేకులైన వివిధ అగ్రకులములవారు, సరియగుమార్గమునకురారని తెలిసికొంటిననియు, చెప్పితి. వారంత శాంతముగావిని, 'భేష్, భేష్' యనిరి. మేమింతకుముందే హిందూ సంఘస్వాస్థత, చిరకాలజీవములను గూర్చి, మాట్లాడుకొనుచుంటిమి. ఒకయుగములో, మనసంఘమునుద్ధరింప, బసవేశ్వరుడు చాలా కష్టించినాడు. వారిపేరు, మనవారియందింకను నిల్చియున్నది. మీయున్నదికూడా యదేపేరు. బసవలింగయ్య అనుటకుమారు, లింగయ్య, అనడము సాధారణమైనది. నీకీ

దినమునుండి బసవలింగయ్య యని, నామకరణము చేతుమా? మీ అన్నయ్య బసవేశ్వరుడు నీలో వెలుగుగాక! బసవునివలెనే నీవును, హిందూసంఘమునకు సేవజేసెదవుగాక! అని లక్ష్మీ నారాయణగారు, ఆనందభాష్పములొలుక దీవించిరి. వ్యవహారమును ముందుగాఆలోచించు అలవాటుకలవారు గనుక, హనుమంతరావుగారు నాయనా! నీకు నామకరణమైనది. యిప్పటినుండి నీవు బ్రాహ్మణుడవే. సాయంత్రిము, గోపాల కృష్ణునికి, యెట్లు మేము,ఒకక్రొత్తయుత్తమబ్రాహ్మణుని తయారుచేసితిమో, చెప్పెదము నీకు ఆకాలేజీవారి యుద్యోగము, వెంటనే వదలివేయవలసిన యవసరముకలిగినది. ఒక్క నెలదినములు నోటీసుకాలముండును. ఈలోపుగా, రాంజీరావుగారు క్రొత్తగా పంచములకొరకై స్థాపించిన పాఠశాలలో, ఉద్యోగము నొకదాని నేర్పాటుజేసెదను. యిప్పుడింకను నీవద్దనున్న రెండువందల రూపాయిలను, నీవన్నట్లు, కాలేజివారికి అవసరమైతే, తిరిగి యిచ్చివేయవచ్చును. ఈయూపరణములోనే, ఒకకుటీరమునందు కాపురముండవచ్చును" అని సలహా చెప్పిరి. ఆసాయంత్రిమే, ప్రిన్సిపాలుగారికి ఒక లేఖనిచ్చి, యెదుటనిలబడితిని. దానిని విప్పిచదివిరి.

గురువరేణ్యా! తమరు, యీనాల్గైదు సంవత్సరముల నుండి, నాయందు జూపెట్టిన వాత్సల్యమునకు, కృతజ్ఞుడను. నేను మీమతస్థుడను కాకున్నను, నాస్వమతస్థులచే బాధితుడనై, మీశరణు కోరినంతమాత్రమున, ధననష్టము, స్వసుఖ

నష్టమును లెక్కించక, మీరు నాకు విద్యాబుద్ధులు గరపిరి. ఏమహామహుని శిష్యత్వముబొంది, యీదేశమునకు సాంఘిక సేవజేయ తాము విచ్చేసిరో, ఆక్రీస్తుమహాశయుని చరిత్రను గూర్చి, బోధగూర్చి, నాకు గడుంగడు శ్రద్ధతో తెలియ జెప్పిరి. క్రైస్తువుపై నాకమిత ప్రేమ, గౌరవము, భక్తి కుదిరినది. క్రైస్థవమతస్థులు, ఆచార్యులు, అనేకులు, ప్రజాసేవను, ప్రశంసనీయముగా జేయుచున్నారు. క్రైస్థవమతాచార్యుల సేవవలననే, యిప్పటికింతవరకైనా, నాసంఘీయులు కొంత మంది, కళ్ళుతెరచి, తెప్పరిల్లి, ఆత్మగౌరవమన నేమియో తెలిసికొనగలుగుచున్నారు. క్రైస్తవమతము బుచ్చుకొనుట వలన, అనేకవేలమంది పంచములు, తమ దాస్యపుబుద్ధిని, విడనాడుచున్నారు. యిన్నివిషయములు తెలిసికొన్నప్పుడు, నేను క్రైస్తవుడనయ్యెదగదాయని, మీరనుకొనవచ్చు.

కాని, నాకు నాసంఘోద్ధరణయేగాక, జాతీయాభ్యుదయముగూడ వాంఛనీయము. నాసంఘీయులు, కొలదిమంది మాత్రము, దాస్యశృంఖలములదాటి బయటబడినంతమాత్రమున, సంఘము, సార్థత జెందనేరదు. పైగా, వారు పరమతావలంబకులగుటవలన, సంఘమునకే, ముప్పు వాటిల్లును. నాసంఘప్రాబల్యతకొరకే, నేను, నా సనాతనమతమును వీడరాదు.

క్రీస్తు మహాశయుడు నిర్ణయించి, ప్రచారమొనర్చిన, ప్రేమసూత్రమును, బౌద్ధమహాఋషియు, బోధించియున్నాడు.

క్రైస్తవులవలెనే, బౌద్ధులును, ప్రేమసూత్రానుసారముగ, తమ జీవితముననుగడుప ప్రయత్నించుచున్నారు. అట్టి బౌద్ధమత తత్వమునంతను గ్రహించిన హిందూసంఘము, క్రీస్తుమత రహస్యముల, గడుంగడు సంతసంబున పరిగ్రహించును. క్రీస్తు యొక్క ప్రేమ యాతిథ్యమొందుటకు, హిందువైనవాడెవడును, క్రీస్తుమతంబునఁజేర నవసరములేదని తలంతు.

క్రీస్తుమహాఋషికి ప్రియతమమైన, 'అహింసా' తత్త్వమును, యెన్నోశతాబ్దములనుండీ, పుణ్యభూమియగు భారతావనియందు, జైనులు, అనుభవపూర్వకముగా, క్రైస్తవులకంటెను, ప్రశంసనీయముగా, నవలంబించుచున్నారు. ఈకాలమునకు. భారతీయులయొక్క నాయకాగ్రేసరుడగు గాంధి మహాత్ముడును, "అహింసాపరమోధర్మః" అను ధర్మమును ప్రచారము చేయుచున్నాడు.

"దేవుడొక్కడె, రాళ్ళనురప్పలను కొల్చుటమానవలెను, భౌతికసుఖముల వెంబడించి, ఆధ్యాత్మికసంపదలో గొట్టికొనజనదు." అనిగదా క్రీస్తుసన్యాసి నిర్వచించినాడు. మావేమన్న మొదలగు తత్త్వవేత్తలనుండీ, భాగవతరచనా దురంధరుడగు పోతన్నవరకు, ఆంధ్రవైరాగ్యులుకూడను, అనేకమారులు, యిట్టి దివ్యమగు సూత్రముల నిర్వచించుటయెగాక, క్రీస్తువలెనె తమ జీవితముల, ప్రజోపయోగమునకై ధారవోసియుండిరి."

ఎన్నోలోపములు హిందూసంఘమునందుకలవు. ఏసంఘమునకు లోటుపాటులు లేవు ? హిందూ సాంప్రదాయము

లనేకము వినాశకరమైనవే? కులభేదములు, అనేకయిబ్బంది లను కల్గించుచున్నవి. పూర్వాచారములు తండోపతండంబులు. దురాచారముల కంతులేనట్లేయున్నది. అంటరానితనమేగాక, మరెన్ని యోసాంఘిక పిశాచములు పీడించుచున్నవి. వీనిజూచి భయపడి, నాసంఘమునువీడి, మతమును విడనాడి, నాసంఘ సూత్రములందు, మతబోధయందు, అత్యుత్తమమగు యేకొద్ది భాగమునకో సరిపోవు క్రైస్తవమతమందుజేరుట, స్వజన, స్వమత, స్వదేశవిఘాతమనిపించుచున్నది,

నాకెల్లప్పుడును, క్రీస్తు మహాత్ముడు, మాదేశపు, రాముడు, కృష్ణుడు, చైతన్యుడు, రామానుజులు, బసవేశ్వ రులు, ఆదిగాగల మహాపురులలో నొక్కరుగా కన్పడి, పూజ నీయుడై యుండును. నాదేశస్థులకు, క్రీస్తుయొక్క ప్రేమ తత్వము, అహింసాధర్మసారము, సంపూర్ణముగా పట్టువడు గాక !

తాము నాకొనరించిన సహాయమును యెప్పటికినిమరు వను. నా యుద్యోగమునకు, స్కాలరుషిప్పునకు యిదియే నారాజీనామాగా పరిగణింప ప్రార్థితులు."

ముత్తయ్య,

ఉత్తరమును సాంగముగా చదువుకొని, రెండునిముష ములు అట్టె కళ్ళుమూసుకొని, ధ్యానించి, లేచి, నాకరస్పర్శ మునుజేసి, ముత్తయ్యా! నీవు మామతసంఘ జేరదలంచ

నందులకు చాల విచారముగనున్నను, ఇంతధైర్యముతో, స్వార్థత్యాగమునకైనను యోర్చి, యిట్టి తీర్మానమునకు రాగలిగినందులకు, నిన్నభినందింపక తప్పదు, అనేసరికి నాకు గద్గదికమైనది. నేను సాష్టాంగనమస్కారమొనర్చి, నేను తనకు గల్గించిన యాశాభంగతకు క్షమించమని కోరితి. ఆయ నకు అపారమైన సంతోషముకల్గి, నీవు పేరునకు క్రైస్తవు డవు గాకున్నను, నడతయందు క్రైస్తవుడ వెప్పుడోయైతివి. నీకీసంవత్సరాంతమువరకు స్కాలరుషిప్పుయుండును, ఈసంవత్స రము ఎఫ్. ఏ. లో ప్యాసయ్యెదవనే నాకు నమ్మకము. వచ్చే సంవత్సరము, నీవు కాలేజీఫీజు చెల్లింపవలసిన యవసరముండ దనియేనమ్మెద. నీకు శుభమగుగాక, ఇక వెళ్లుము" అన్నాడు. విచారభారముతో హాస్టలునకు వెళ్ళి, నావస్తువుల నన్నిటిని మూటగట్టుకొని, జాజీయకళాల కారాత్రికే చేరితిని. నాల్గు నెలలైన పిమ్మట, అదృష్టమువలన పరీక్షలో నెగ్గితిని.

శ్రీరాంజీగారి పాఠశాలలో, నెలకు యిరవై రూపా యలమీద ఉపాధ్యాయుడుగాయుండి, భోజనమునకు, వస్త్ర ములకు, పుస్తకములకు, డబ్బును సంపాదించుచుంటి. హాస్టలు నందున్నప్పుడు ప్రిన్సిపాలుగారివద్ద నిల్వజేసుకున్న రు 300 లు అటులనే పోస్టలు సేవింగ్సుబ్యాంకునందుంచితి. వచ్చే జూను లోపల బి.ఏ. పట్టముపొందవలెనని, గంపెడాశతో యున్నాను.

అంకమ్మ

పెండ్లిచేసుకోదలచలేదా?

చుక్కయ్య

మనవాళ్ళందరికి పేరుతేవాలెనని ఆయన కష్టపడుతుంటే, పెండ్లికేమిటొందరవచ్చిందయ్యా ?

బసవలింగయ్య

నానా ! నాకెవరినైన వెనుకటి రోజులలో మొల్చుకొంటివా ?

గంగయ్య

నిన్ను క్రొత్తపేరుతో పిలవాలంటే నాకే సిగ్గవుతుంది. కొడుకుగదాయని స్వతంత్రించడానికి జంకుగాఉంది. చచ్చిపోయినవాడి పేరుననే నిన్నుపిల్చుకుంటా. నీకిష్టమేనా !

బసవలింగయ్య

ఆహా ! అంతకంటె కావలసినదేముంది నాయనా !

గంగయ్య

నీవు, వూరినుండి పారిపోకముందు, మీ మేనమామ, ఈఅంకమ్మగారి కూతురినిచ్చి, నీకు పెండ్లిచేదా మనుకున్నాను. నీవెన్నాళ్ళకూ రాకపోతే, బ్రతికి ఉన్నావో, లేవో, అని, మెసపటోమియా పోయివచ్చిన లింగన్నకిచ్చి, ఆ పిల్లకు పెండ్లి చేశాడు. ఇప్పుడింకా నేనెరుగున్న వాళ్లెవరున్నారు ?

బసవలింగయ్య

మంచిదే ! ఇప్పట్లో నాకా పెండ్లిహడావుడి వద్దులే ! అవసరమైతే మీకుచెప్పే, ఏర్పాటుచేసుకుందాము. భోజనపు వేళఅయింది, హోటలుకు పోదాము.



# హరిజన నాయకుడు.

## నాల్గవ ప్రకరణము.

సహాయనిరాకరణోద్యమం 1923 వ సంవత్సరం సగాన బడేవరకు, పూర్తిగాపడిపోయిందని చెప్పవచ్చు. కృష్ణాజిల్లాలో ఖద్దరు తయారుచేయించడం, జాతీయవాదమును ప్రచారము జేయడం, అంటరానితనమును నిర్మూలించు టావశ్యకమని ప్రజలకు నచ్చజెప్పటలో, కాంగ్రెసువాదులం దెక్కువమంది, నిమగ్నులై యున్నారు. అంటరానితనమును తీసివేయుటకు ధైర్యములేకున్నా, అంటరానితనము మంచిదికాదని, ఈడుపు గల్లు కమ్మారుకూడ, గ్రహించారు. మల్లుగుడ్డలు, పట్టంచు ఉత్తరీయాలు, వేయడంమాని, చాలామంది, ఖద్దరువేయ ప్రారంభించారు. బస్తీలకుపోయి, స్త్రీలకై, వస్త్రములకై, తదితరభోగములకై, ధనము వృథాపరచుటకు మారు, వ్యవసాయమును, హెచ్చు జాగ్రత్తగాచేయుటకు, కొందరు యువకులు పూనుకున్నారు. పెత్తందారులు, కొందరు రోడ్డు కిరుప్రక్కలనున్న మెట్టభూములందు, పండ్లచెట్ల తోటలువేసి, వ్యవసాయ వ్యవహారాలను, జాగ్రత్తగా నడుపుకొనుటకు, ఉత్సాహులవుతున్నారు. గాంధిమహాత్ముని ప్రభావము, కమ్మసంఘము యొక్క అన్ని యాచారాలలో, అలవాటులలోకూడను, కొద్దిగనో, గొప్పగనో, కానబడుతుంది.

చదువుకొన్న యువకులనేకులు, జాతీయోద్రేకముకల్గి, ఖద్దరుధరించి, ఆంధ్ర దినపత్రికను, జాగ్రత్తగా చదువుతూ, మహాత్ముని బోధనలను, జీర్ణించుకొంటూన్నారు. శ్రీకృష్ణ జన్మస్థానమున కెవ్వరు పోకపోయినను, యువకులందరు స్వేచ్ఛగా, జాతీయాభిప్రాయాలుకల్గి, తమశక్తికొలది, నిర్మాణ కార్యక్రమమును సాగించ ఉత్సాహులై యున్నారు.

బెజవాడనుండి, ఆదిమాంధ్రుల నాయకుడైన బసవ లింగయ్య, ఈడ్పుగల్లునకు జూలై మాసమునందువచ్చి, మాదిగవారి కులపెద్దయైన అంకమ్మతో, పంచముల పిల్లలను గ్రామంలోని పాఠశాలకు పంపించమని, వాళ్లను శూద్రులు, బ్రాహ్మణులు రానివ్వనిచో తనకు తెలియపరచవలసినదని, చెప్పిపోయాడు. జూలై 25-వ తేదీనాడు చుట్టుప్రక్కల యిరవై గ్రామాలలో, పంచములందరు, తమపిల్లల నందరిని ఆయా చోటులలో యున్న బోర్డు స్కూళ్ళు, గ్రాంటుస్కూళ్ళకు పంపించారు. అన్నియెడల, పై కులాలవారు, పంచముల పిల్లలను, లోనికి పోనివ్వరైరి. వెంటనే అంకమ్మ బెజవాడ వెళ్లాడు. ఇదేమో హడావుడి జరుగనున్నదని, ఈడుపుగల్లు రైతు, పెద్దలు, వేల్పూరు పెద్దరైతుగారితో ఆలోచించి, ముందేమిజరుగుతుందో చూదామని వేచియున్నారు.

తాలూకాబోర్డు ప్రెసిడెంటు, ఎడ్యుకేషనల్ కౌన్సిలు ప్రెసిడెంటు, కలెక్టరు, గవర్నమెంటు, అందరికి, ప్రజలందరి యుపయోగార్థమై, ప్రజలందరికి చెందిన ప్రభుత్వం, ప్రజాస్వామికమైన ధనమును వెచ్చించి, పాఠశాలలు నడుపు

తూఉంటే, కొందరు పెద్దకులస్థులు అంటరానివాళ్ళను, రాకుండ చేయడం న్యాయంకాదనీ, పోలీసువారి సహాయంతో నైనా, అన్నిసంఘముల పిల్లలు, పాఠశాలల్లో చదువుకునేవసతి కల్పించాలనీ బసవలింగయ్య ప్రార్థిస్తూ వ్రాశాడు. ఒక నెల జరిగిన పిమ్మట,యీపాఠశాలోపాధ్యాయులకు పంచముల పిల్లలను గూడ రానివ్వాలనీ, వారికి చదువు చెప్పమని తిరుగబడిన వాళ్ళ యుద్యోగాలు, వాళ్ళను లోనికి రానివ్వని పాఠశాలలకు ప్రభుత్వంవారిచ్చే గ్రాంటులు, నిల్పివేయబడునని, తాలూకాబోర్డు ప్రెసిడెంటున్నూ, ప్రభుత్వమున్నూ, ఆర్డరు చేశారు. ఆగస్టు 30_వ తేదీన బెజవాడఫిర్కా_యందున్న అన్నిపాఠశాలలకు, ఆయాగ్రామాల పంచముల బాలబాలికలను, తలితండ్రులు తప్పనిసరిగా పంపించవలసిందని, ఆదిమాంధ్రసంఘముతరఫున, బసవలింగయ్య తెలియపరచి, తన స్వసంఘీయసేవకులను గ్రామాలకు ప్రజల నుద్బోధించడానికై పంపించాడు. ఇరవైయేడవతేదీన, ఈడుపుగల్లునందే పంచమ తల్లిదండ్రులసభ జరుగుతుందని తెలియపరచారు. ఒకరోజు ముందుగానే, బసవలింగయ్య, ఈడుపుగల్లు, వేల్పూరు, పునాదిపాడు, పటమట, కోరంకి గ్రామాలకు జట్కా_బండిమీదవెళ్ళి, ఆయాగ్రామాలందుండె కమ్మనాయకులతోను, కాంగ్రెసు అభిమానులతోను, యువకులతోను, వినయంగా, భద్రంగా, సంప్రతించాడు. అందఱు 27-వ తేది వుదయం 8 గంటలకు, ఈడ్పుగల్లులో కలుసుకొని, తనకేదో యొక మాట చెప్పుతామన్నారు.

ఇరవై యేడో తేదీ వుదయం 7 గంటలకే, చుట్టు
ప్రక్కల కమ్మవారి నాయకులంతా, యీ ఈడుపుగల్లు పాఠ
శాలాభవనములో చేరారు. సాధారణమర్యాద లవసరము
లేకనే, వేల్పూరి పెద్దరైతునే పెత్తందారుగా, చేరినవారు
పరిగణించారు. తమతో బసవలింగయ్య మాట్లాడడానికి వచ్చి
నప్పుడు, తమతోబాటు, బెంచిమీద కూర్చోనబెట్టాలా ? లేక
మిగిలిన పంచములందరివలెనే, నిలబడమనవలెనా ? అని సందే
హముకలిగింది. ఎంతచదువుకున్నా, యిన్ని గ్రామాల పంచము
లందఱువచ్చి చేరియున్నప్పుడు వాళ్ళు చూస్తూయుండగానే,
వారికులస్థుడైన బపవలింగయ్యను కుర్చీమీదగాని, బెంచిమీద
గాని కూర్చోమంటె, తమ పేరుప్రతిష్ఠలిక యుండవేమో, తమ
కిక పంచములు మర్యాద జూపెట్టరేమోయని, చాలామంది
సంశయపడ్డారు. యువకులందనేకులు, యితరకులస్థులు ప్లీడర్లై,
యోగ్యులై, మనతో వ్యవహారం చేయడానికి వచ్చినప్పుడెట్లు
మర్యాదకర్హుడో,యటులనే,బసవలింగంగారుకూడా గౌరవార్హు
లన్నారు. కోర్టులచుట్టూ తిరుగుతూ, తన డబ్బునెకాక, యిత
రుల యాస్థులుకూడా పాడుచేయుటలో ప్రసిద్ధుడైన పర్వతనేని
జానకిరామయ్య, వేల్పూరి ముత్తడికి కుర్చీయిచ్చే వాడెవడో
నే చూస్తానుగా ! నీయాతస్సాదియ్యా ! అని మోడుచరిచాడు.
వ్యవహారం స్మృతిమించిరాగాన పడేటట్లుందని, కుర్చీలువద్దు,
బల్లలువద్దు, గాంధిగారు చెప్పినట్లు, మనసాంప్రదాయ సిద్ధంగా

వుండేటట్లు, చాపలు వేసి, వానిమీద అందఱం కూర్చుందాము, అని యీవిషయాన్ని తీర్మానించారు.

శ్రీ బసవలింగంగారువచ్చి, మాపిల్లలనందర్ని పాఠశాలల్లోకిరానివ్వవలసింది, పూర్వాచారాల్లో పెరిగి పెద్దవారైన మీకు, మావారినంటుకోవడం కష్టంగాబోలును కాని, అన్నెం పున్నెమెరుగని, పసిపిల్లలకుకూడా యీ "అంటరాని" పాపము కట్టడం యెందుకు, పాఠశాలలందైన, సాంఘికసమానత్వము కలిగించాలని, ప్రార్థించరాదా అన్నారు. అందుకు మనం కాదనడం అన్యాయమని పటమట జాతీయనాయకుడొకరు మాట్లాడారు. మొగలాజపురం నాయకుడు, "నిజమే, మనము తుదకీ రోజునయినా, వాళ్లు మంచిగా అడుగుతున్నప్పుడే, మర్యాదగా, బసవలింగయ్యంతటి విద్యావంతుడు సవ్యంగా కోరితే, మాట దక్కించుకుందామను ప్రతిష్ట పొందుదామన్నారు. ఈదినం బళ్లోకిరానిమ్మంటారు, దీనికి సరేనంటే, మరొకనాడు, మీబావులను, చెరువులను, దేవాలయాలను వుపయోగించుకో నిమ్మంటారు. ప్లీడరు వీళ్ళకు దొరికాడు. మనకాపులు, కమ్మారి గుట్టుమట్టు ఎఱిగినవాడాతడు. ఎదిరించే సత్తావుంటె మొదటనే మోదు చరవాలసి వుంది. నాకు మాత్రం యీ మాదిగవాళ్ళకు సలాం పెట్టడం యిష్టంలేదు" అని గంగూరు మునసబు తమ్ముడు గర్జించాడు. ఈ ప్రలాపమువలన రయితులలో కలవరము హెచ్చైంది. "ఆసంగతులన్నీ మనకిప్పుడెందుకు? ఆప్లీడరు వచ్చే

వేళయింది. మనగ్రామాల్లోవున్న పాఠశాలల్లోకి, పంచముల పిల్లలను చేరనిద్దామా? వద్దా? యేదోవొకవిధంగా తేల్చండి” అన్నాడు కిలారి రామకృష్ణయ్యా. అడుసుమిల్లివారి ముఠా దారుడు, మీసం మెలిబెట్టుతూ, యిప్పుడు మనం వాళ్ళపిల్ల లను రానీయకపోతే ముందు పోలీసులతో తంటావస్తుంది. స్కూళ్ళను తాలూకాబోర్డువారు మూయకపోయినా, గవర్న మెంటు మూయిస్తుంది. తుదకు మనపిల్లలకే చదువుకోడానికి వసతులుండవు. యేదో, మంచిగా, ప్లీడరు చెప్పినాడుగనుక మహాత్ముని శిష్యులు కోరాటగనుక, రయితులు మంచివాళ్లు గనుక, యిప్పటికీ యిబ్బందిలేకుండా పోయిందని అందరిచేత అనిపించుకుందామన్నాడు.

రమణయ్యా

ఏమయ్యా! అందరికి, యీ అడుసుమల్లి రాఘవయ్యా చెప్పే సలహానచ్చిందా? యింకా అభ్యంతరపెట్టేవాళ్లున్నారా? యెవ్వరు లేరట్లుందే! సరే, రాఘవయ్యాగారూ! ఆ ప్లీడరు కోసరం కబురంపండి.

పటమట నాయకుడు

పెదకాపుగారూ! యీ ప్లీడరు, వెనుకటిరోజుల్లో మీవద్ద కూలిజేసేవాడటనే? ప్లీడరయినతర్వాత, యెప్పు డయినా మీవద్దకు వచ్చాడా ?

రమణయ్యా

అవునయ్యా! యీ మధ్య తనతండ్రిని చూడవచ్చి

నప్పుడు, మాయింటికివచ్చి, నాకు సాష్టాంగనమస్కారంజేసి ముచ్చట్లాడాడు. నాకే సిగ్గుకలిగింది, అంతచదువరి నాముందు వంగితే.

హోరంకినాయకుడు అంకినీడు

అందరూ ఆయన వినయాన్ని, గౌరవాన్ని, గొప్పతనాన్ని, మెచ్చుకొనేవాళ్ళే! మన రయితులమీాద దండెత్తాలని వేల్పూరునుండి పారిపోయినా, యిప్పుడు రయితులమేలే, పంచములమేలని బోధిస్తూ ఉంటాడట. మహాత్ముడంటే యెంతో భక్తికలిగియుంటాడట. "పంచములు, భజనతో వస్తున్నారు, బసవలింగయ్యకూడా భజనచేస్తున్నాడు, యీామూాలే ఇకనడ్డం. ఒక్కనిముషములో యిచటికి వస్తారని" పరుగు పరుగున వచ్చి పిల్లలుచెప్పారు. రయితులందరు పాఠశాల్లోనుంచి బయటికివచ్చి, జువ్విచెట్టుక్రింద నిలబడియున్నారు. "ఏతీరుగ మము దయజూచెదవో, యినవంశోత్తమ రామా, మా తరమా భవ సాగరమీాదను నలినదళేక్షణ రామా" అనే పాటను గంభీరంగా, హృదయాలు కరిగించేటట్లు పాడుకుంటూ వచ్చి, రయితులకు యిరవై గజాల దూరములో వందలకొలది పంచములు నిలచారు. "జై రమారమణ గోవిందోహరి" యనే ధ్వనులు చెలరేగుతూ ఉండ, బసవలింగయ్య ముందుకు వచ్చి, వేల్పూరు పెద్దకాపునకు ముందుగా నమస్కారంచేసి, రయితులందరకు దణ్ణముపెట్టి, వ్యవహారం ప్రారంభిద్దామా? అని ప్రశ్నించాడు. రమణయ్యగారు, తన వికసితముఖారవిందము ప్రజలందరికి సంతసముప్పతిల్లేటట్లు చేస్తూఉండ,

బసవలింగయ్యగారూ! మీ కోరికప్రకారమే, మావా రంతా, మీవారిపిల్లలకు పాఠశాలల్లో చదువుకోడానికి, తగిన సదుపాయాలు కల్గించడానికి తీర్మానించారు, అన్నాడు. తన ఆనందాన్ని పట్టజాలక, బసవలింగయ్య, చప్పట్లుకొట్టడం ప్రారంభించాడు. "గోయిందాహరి, గోయిందా" అని రెండు నిమిషాలు పర్యాంతం, పంచములంతా చప్పట్లుకొట్టారు. రైతు లనేకులుకూడ, తమసంతోషాన్ని వెలువరించారు.

అంకినీడు

బసవలింగయ్యగారూ! లోపలికివస్తారా? నాల్గు నిమిషాలు మా యాతిథ్యం బుచ్చుకుందురుగాని.

బసవలింగయ్యతో, రైతులెల్లరు, పాఠశాలలోకి వచ్చారు. రమణయ్య, అంకినీడు, కిలారి రామకృష్ణయ్య, మిగతా పెత్తందారులందరొక ప్రక్కను, వారికెదురుగా మిగిలిన రైతులు, కూర్చున్నారు. అందరికి, అరటిపండ్లు, గోధుమ జావనిచ్చారు. తాంబూలా లందింపబడినాయి.

బసవలింగయ్య

రైతుమహాశయులారా! మీరీదినము నాకుజూపెట్టిన, ఆదరమునకు నేనెంతయు కృతజ్ఞుడను. నేను పంచమ జాతివాడనైనను, అసూయతగాని, అసహ్యతగాని బొందక, రైతు జాతికి సహజమగు సహనముతో, ధార్మికబుద్ధితో, ఉదార స్వభావముతో, నా కోరినకోర్కె నింత నిరభ్యంతరముగ చెల్లించినందులకు, నేనేకాక, నా సంఘీయులెల్లరు, బహు

కాలము మీయందు సుహృదయులై యుండగలరు. నాకు తండ్రులు, తాతలు, కాదగువారెందరో, మీయందిప్పుడు కలరు. వీరియందు, మన యిరు సంఘముల కెట్టి సాహచర్యము, సహాకారము, శ్రేయోదాయకమో, ప్రత్యేకించి నే చెప్పజూచుట, సాహసముకాగలదు. మాతాత ముత్తాతల నాటినుండి మాకు వేల్పూరు పెద్దకాపుగారే, తల్లియు, తండ్రియును. మీ బిడ్డలకెట్లు ప్రేమతో, ఉపయోగకరమగు శిక్షణనిచ్చెదరో, అవకాశముల కల్గింతురో, అటులనే, రైతాంగమును నమ్మి, భూమిపై, మీతో బాటు ఆధారపడియున్న, పంచముల కాపాడవలయునని, ప్రార్థించుచున్నాను. మనపాలకులు, మీ మా, మధ్య భేదములు కల్గించవలయుననియు, భేదసూత్రాధారమున, భారతదేశమునకు, రాచకీయ, ఆర్థిక, విముక్తికలుగనీయకుండ చేయవలెననియు, తంత్రిముల బన్నుచున్నారు. నాకు శక్తియున్నంతవరకు, రైతులకు, వారిపనివారికి, సఖ్యత కల్గించవలెననియే ప్రియత్నించెద. మీరును, అట్టి ప్రయత్నమే, చేయవలెనని నాప్రార్థన.

రమణయ్య

నాయనా! బసవలింగయ్యా! మాఫిర్కాలోని పంచములకు, నీవంటి యోగ్యుడు, సమర్థుడు, నాయకుడుగా దొరికినందులకు పరమసంతోషము. నీవలెనే, మీవారందరు, అణకువగలిగి, నమ్మకత్వముకలిగి, మర్యాదస్తులుగా యుండవలెననియే, వృద్ధులగు, నావంటివారికోరిక. ఈకాలపు బుద్ధ

లుకలిగి, అలవాటులకు లోనై, పనిపాటలులేక, బస్తీలవెంట తిరుగు, యే రయితుబిడ్డలో తప్ప, మాకాలపు రయితులెల్లరు, పంచములన్న, యెప్పుడూ, ఆదరముతోడనే జూచుచుండెడివారు. కరుఘవచ్చినా, కలరావచ్చినా, కష్టమొచ్చినా, కాలయముడొచ్చినా, మాపాలేరుల మేలే మాదని, వారి కష్టమే మాకష్టమని తలంచి, అన్నివిధముల సహాయము చేసెడివారము. మీనాయన గంగయ్యయే యిందుకుసాక్షి. ఐతే, కోపతాపాలు, మనుజులకు సహజముగదా! కష్టించికనే, ధనధాన్యముల బొందు మాకుర్రవాళ్ళనేకులు, మీవాళ్ళను, అమర్యాద, అచ్చటచ్చట చేయుచున్న మాటనిజమే! మన మట్టి కష్టకార్యములనే, యెప్పుడూ తలంచరాదు. గాంధి మహాత్ముని ధర్మసూత్రముల ప్రచారమెక్కుడగుచున్నకాలది, యువకులుగూడ, సాధులగుచున్నారు. పూర్వాచారపరాయణులుగూడ, ఉదారభావ సమన్వితులగుచున్నారు. అలవాటులేని కార్యము చేయవలెనన్న యెంతకష్టమో తెలిసినదేకదా! అటులనే, శూద్రజాతులవారందరు, మీవారితో, సాంఘిక గౌరవముల నిచ్చిపుచ్చుకొనుటలో, ఒకేమారు, అన్నివిధముల, ముందుకు రమ్మన్న సాధ్యముగాదు. సానుభూతితో విచారించిన, క్రమక్రమముగా, సాంఘిక సంఘర్షణ లేకయే, అన్నిపనులను చక్కబెట్టవచ్చునని, అనుభవజ్ఞుడవగు నీకే తెలిసివచ్చును.

"అయ్యా! తమకందరికి నమస్కారములు" అని బసవలింగయ్య బైటికివచ్చి, తనకై వేచియున్న పంచములజేరి, "సోదరులారా! రైతుమహాశయులు మనయందు కరుణించి, మన కోరికచొప్పున, మన పిల్లలనందరిని, పాఠశాలలకు రానిచ్చెదమని, సెలవిచ్చినారు. ఇప్పటినుండి, పదునాల్గు సంవత్సరాలకులోబడిన పిల్లలమధ్య "అంటరానితనమను" పిశాచము తలయెత్తలేదు. (కరతాళధ్వనులు). ఇంతటితో సంతోషపడిన లాభములేదు. మీరందరు, మీ మీ గ్రామములందున్న ప్రతి పంచమపిల్లను, పిల్లడిని, ప్రతిదినము, బడికిపంపించుటకు, సర్వాంతర్యామియగు భగవానుడీ జ్యోతియందు కన్పించుచున్నాడని నమ్మి, ప్రమాణముచేయుడు. (అందరు రమారమణ గోయిందో హరి అనిరి) మంచిది. రైతునాయకు లందరకు మ్రొక్కుడు. (అందరు నమస్కారములు పెట్టుదురు). రైతులయెడ ప్రేమకల్గి భూదేవియెడ గౌరవముకల్గి, మీరందరు, గౌరవముగా బ్రతుకవలెననియే, నాకోరిక. (సభనుముగించి, బసవలింగయ్య బెజవాడ వెళ్లిపోయెను. మరునాడు, ఆ ఫిర్కాలోని, అన్ని పాఠశాలల్లోకి, పంచముల పిల్లలు, చదువుకొనుటకు వెళ్లిరి.

# హరిజన నాయకుడు.



## ఐదవ ప్రకరణము.

వేల్పూరు పెద్దకాపుగారి కుమారుడు రామస్వామి బి. ఏ. (ఆనర్సు) తన భార్య సుశీలతో, శాంతినికేతనానికి వెళ్ళి రెండుమాసాలయింది. వారిద్దరు ఫ్రాన్సుదేశమునుండి వచ్చిన, ప్రొఫెసరు లెవీగారు, సంస్కృత సాహిత్యము, భారతీయ నాగరికత యను విషయముపై యిచ్చిన యుపన్యాసములను, నికేతనమునందుండగా విన్నారు. వానివలన, భారతదేశమందు, పన్నెండవ శతాబ్దమునకు పూర్వము, యిప్పటి వలె, జాతిభేదములు, తీవ్రతచెంది యుండలేదనియు, వేదకాలమందు, అంటరానితన మేమిటో తెలియరాదనియు, సూత్రకాలమున, విగ్రహారాధన ప్రారంభమైనదనియు, పురాణ యుగమందు, కులభేదములు తలసూపి క్రమముగా ఘనీభవించె ననియు, అంటరానితనమను మహాపిశాచము జన్మించినదనియు తెలిసికొనిరి. హిందువుల నాగరికత-స్త్రీలు అను శీర్షికపై బెంగాలీ ప్రొఫెసరొకరు, నాల్గు యుపన్యాసములనిచ్చిరి. తన్మూలమున, వేదకాలమందు, స్త్రీ పురుషులు, సమానస్థానమును, సంఘమునం దనుభవించుచుండిరనియు, పురాణ కాలము వచ్చుసరికి, యుద్ధము లగత్యమగుటవలనను, వ్యవ

సాయము వృద్ధియగుటవలనను, పురుషునిచే సృజింపబడి, పురుషునిపై ఆధారపడిన నాగరికత ప్రాప్తత జెందుటవలనను, స్త్రీలస్థానము క్రమక్రమముగా క్షీణించి పురుషుని యాధిక్యత హెచ్చయ్యెననియు, బౌద్ధయుగము బయలుదేరునప్పటికి స్త్రీలు అధోగతికి వచ్చిరనుటకు సందేహము లేదనియు వినిరి. బౌద్ధయుగమందు, కులభేదములు, ధనికులు, బీదలను వ్యత్యాసములు, స్త్రీ పురుషులమధ్య కల్గిన అంతరభేదములన్నియు నిర్మూలింపబడి, సర్వమానవ సౌభ్రాతృత యేర్పడినదనియు, యెరింగిరి. ఘోషాపద్ధతిగాని, బాల్యవివాహములుగాని, హిందూ సనాతనాచారములకు జెందినవి కావనియు, స్త్రీలు విజ్ఞానమునుబొంది, విదుషీమణులగుటకు, బ్రిటిషుయుగమే దారితీసినదనుకొనుట భ్రమయనియు, తెలిసికొనిరి.

రవీంద్రనాథఠాకూరుగారి పుస్తకములన్నిటి, జాగ్రత్తగా చదివి, తమలోతాము చర్చించుకొని, ఆ మహాకవి, తన భావ ప్రపంచమునందెట్లు స్త్రీపురుషులు, బలిష్ఠులై, ఉన్నతమగు, సుందర స్వరూపులై, ఆత్మగౌరవప్రేరితులై, సమానప్రతిపత్తితో, విజ్ఞానసముపార్జనయందు, సంఘసేవయందు, దేశసేవయందు, ఒకరితోనొకరు పోటీపడుచూ, దేశమునున్నత స్థానమునకు గొంపోవుట యుత్తమమని గ్రహించెనో, ఆవిధముగనే, అనుభవపూర్వకముగా, స్త్రీపురుషులు, గౌరవప్రదముగా, స్వేచ్ఛగా, జీవితమందునూ, సంచరింప వీలగునని,

శాంతినికేతన జీవితమందు జూపెట్టుచున్నాడని గ్రహించి, ఆనందమందిరి.

శాంతినికేతనమునుండి తిరిగివచ్చునప్పుడు, అహమ్మదాబాదునకుబోయి, మహాత్ముని, "సత్యాగ్రహాశ్రమమును" సందర్శించిరి. శాంతినికేతనముమధ్య, యీ జగద్విఖ్యాతిజెందిన "సబర్మతీ యాశ్రమము" మధ్యయున్న భేదముగాంచి, రామస్వామి, సుశీలలు నివ్వెరపడ్డారు. అదిశాంతికి, హృదయానందానికి, ప్రపంచసౌఖ్య సౌలభ్యతకు, భోగవిలాసములకు, యీహాప్రపంచ సౌకుమార్యమునకు, పేరెన్నిక గనుచున్నది. ఇదియో, దరిద్రనారాయణుని దుస్థితిగూర్చి విచారమ్నగులై యుండు, సేవికాసేవకులకు, దేశమును మలమల మాడ్చుచున్న, నిస్సారత, ఆశారహితత్వము, అభాగ్యత్వము, విసుగులేని గాడ్పులు, కరుణలేని అగ్నిజ్వాలలు. "దాహము, దాహము." అని యలమటించు భూమి, అన్నియు కపాలేశ్వరుని తలపింప జేస్తూ వున్నట్లుంది. అచ్చటి శుకపికారావాలు, పుష్పపుష్పాడి గంధం, యిగురు, చిగురుల జొంపములు, కళకళమంటూవుండే సేవికాసేవకుల కిచ్చట తావులేదా! యని, యరణ్యనియిసుక పరిలప్రక్కనున్న, యీ "సబర్మతీ ఆశ్రమం" సందేహం కల్గిస్తూఉంది. కొంచెమట్టె ప్రథమదర్శనమునవె బెదరక ఆలోచించినకొలది, యిన్ని శతాబ్దాలనుండి, దరిద్రదేవతచేత పీడింపబడుచున్నను, నిరాశాపిశాచముచే దహింపబడుచున్నప్పటికి, పరరాజ్యపరిపాలనచే నిస్సారులవుతున్నా, అధునిక

ప్రపంచపు భావదరిద్రతచే కలయింపబడుచున్నా, జీవముల బోగొట్టుకొనక, పట్టుదలవీడక, భూమిపై కాలిడియే, కర్రపై కన్నిడియే, మేడిపై చేయిడియే, అనాదిసిద్ధమగు సాలునందు, సీతమ్మను సంపాదించి, భగవానుడైన రాముని ప్రీత్యర్థం, సమర్పించవలెనను భావముపైననే, భారతీయులు హృదయమిడి యున్నారని ఋజువుచేయుచున్న, సబర్మతీయాశ్రమ రహస్యాన్ని, భార్యా, భర్తలిరువురు, కనిపెట్టారు.

ఈ సబర్మతీదేవియొక్క, సుస్నిగ్ధసలిలధారల దారుల కొకప్రక్క నిర్మించబడిన యీ యాశ్రమమునందు, ప్రపంచమునకు, నూతన ధర్మసూత్రముల ప్రసాదించుచూ, బీదసాదల పాలిటి, తల్లియు తండ్రియునై ప్రపంచమునందలి అనాథమానవకోటిసేవకై, తనజీవితాన్ని ధారవోస్తూవున్న, గాంధి మహాత్మునియొక్క దరిద్రనారాయణ స్వరూపముగాంచి, ఆత్మశాంతిని బొందారు. సబర్మతీ సలిలములద్వారా వ్యవసాయ విజృంభణం సాధ్యమనీ, రాట్నంద్వారా, నిరుద్యోగ నివారణ అవుతుందని, స్త్రీ పురుషులు, భూదేవిని సేవించుట శుభప్రదమనీ, విద్యాపీఠంద్వారా, జ్ఞానసముపార్జనం సాధ్యం, అవసరమని, సాంఘికసేవ, ఆశ్రమంద్వారా నేర్పనగునని, మహాత్ముడు, తన విజ్ఞాననేత్రంద్వారా జూపెట్టుచున్నట్లు, వీరు కనుగొన్నారు. జాతిమతభేదములుకాని, స్త్రీ పురుష సంకుచిత విభేదములుకాని, ధనధాన్య లాంఛనాల యావశ్యకతగాని, స్వ, స్వ, స్వ, యను స్వార్థపరత్వపు తంత్రముగాని యీ యాశ్రమమందెచ్చట కానరాదని గ్రహించారు.

సముద్రాసునందున్న, అడయారు భోగభూముల దర్శిం చినప్పుడు మన వధూవరులకు, శాంతినికేతనము తిరిగి కళ్ళకు గట్టినట్లైనది. ఆ గంభీరమగు, పురాతనమగు మఱ్ఱివృక్షము, ఆసేతుహిమాచలపర్యంతం వ్యాపించి, వేరులు, ఊడలు, నాటుకొని అనేకకష్టపరంపరల లెక్కగొనక, తనదారిని తాను విజృంభించుచున్న హిందూమహాసంఘమును మనస్సునకు దెచ్చింది. సంగీతమునం దోలలాడుతున్న, సముద్రానికి తోడు తాళమువేస్తూవున్న మొగలిదొారువులు, సరవితోపులు, జూచారు. అందందు శృంగారలక్ష్మీ స్వరూపములా, ఆనందదేవతలా, సుఖసల్లాపశిలావిగ్రహములా, యనిపిస్తూవున్న, సర్వాంగ సౌందర్య సాష్టతనొందిన సుందరీమణులు, విహంగములవలె కొంతసేపు, సరస్సు, సముద్రతరంగ తాండవమం దుదయించు నృత్యగీతికలవలె కొంతసేపు, హృదయము నుల్లాసపరచుచుండడం వీరికి యనుభవైకవేద్యమైనది. స్వరాజ్యము లభ్యమైనపిమ్మట, దరిద్రనారాయణునకు సెలవిచ్చిన తదుపరి, భావప్రపంచము చిద్విలాస సుఖచేష్టలతో ప్రజలందరియందు సాక్షాత్కరించినప్పుడు, యిట్టి యారామములు, వృక్షరాజములు, సౌధజాలములు, తీవలు, పొదరిండ్లు, సరస్సులు, సముద్రము, యెంతయుపయోగమగును" అని నిట్టూర్పును సూచింపుచూ, రామస్వామి పలుకసాగెను. మీాకెప్పుడూ, ముందు రానున్న సొంపు యింపులే హృదయమునకు తట్టును. నాకేమో సబర్మతీదేవియొక్క దిగంబరత్వము, మహా

త్మని కరుణార్ద్రమగు, ఆశాజనితమగు, విచారము, విద్యా పీఠముయొక్క విజ్ఞానదీపము, హృదయమున అద్దబడినప్పటి నుండి, యిట్టి ఆరామములకు, శాంతివిహారములకు, ఆటపాట లకు, హారములకు, మనస్సు ఆకర్షింపబడుటలేదు” అన్నది. ఆమెవంక తిరిగిచూచి, ఉత్సాహము నాపుకొనజాలక, భుజ ములపై కరంబులిడి, ఆమె నటునిటు, సంతసంబున నూగిం చుచూ, “సుశీ! నీకీ దరిద్రనారాయణునకు పట్టువస్త్రములు కట్టి, పాయసాన్నములబెట్టి, కస్తూరీతిలకమద్ది, అక్షతాభ్యా సముచేసి, వాయువిమానములపై ద్రిప్ప యుత్సాహము కల్గు చున్నదిగాదూ, నిజము చెప్పు? నీమాటలలోనే, నీసంజ్ఞలలోనే, నీముద్దులు, ముచ్చటలందే, నేనెప్పుడో గ్రహించాను. నీవు నాపాలిటి దేవతవమ్మా” అంటూ, మురిపెముజూపెట్టాడు.

1926 వ సంవత్సరం డిశంబరు మాసములో, అడయా రులో థియసాఫికలు సొసైటివారి యుత్సవములు జరుగునని తెలిసికొని, కొంతకాలము మద్రాసులోనే యుండదలంచి, రామస్వామి, సుశీలాదేవిగార్లు, మైసూరు మాడరనుహోందూ హోటలునందు మకాంచేశారు. వై. యం. సి. ఏ. యందు, “దీనులు నిరుద్యోగము” అను విషయమునుగురించి, సాంఘిక సేవకులు. ఉపన్యాసము లిచ్చుచున్నారని తెలుసుకొని, ఆమీటింగులకు, వీరిద్దరు పోవనిశ్చయించుకొన్నారు. మొదటి దినం, “ పట్టణములందలి బీదవారి గృహముల ” గురించి యొకరుపన్యసించిరి. పల్లెలనుండివచ్చి, ఉండుటకు దిక్కుదివా ణములేక, చెట్లక్రింద, రోడ్లప్రక్క, పాపులగవిడిముందు,

వందలకొలది యనాథలు నివసింపుచూ, సంసారముల నడుపు చున్నారో తెలుసుకున్నారు. సంపాదించు కూలియందు, నెలకు రూపాయ, లేక రెండురూపాయల చొప్పున అద్దె యిచ్చి, దుర్గంధభూయిష్ఠమగు, వాయుప్రచారమున కేమా త్రము యెడమివ్వని యిరుకుగానుండు, ఒక్కొక్కగదిలో, రెండుమూడు కుటుంబాలవారెట్లు తలదాచుకొనుచున్నారో, ఉపన్యాసకులు తెల్పిరి. తమ ఆలాపముల వినువారులేక, మరు గుదొడ్లుగానక, స్నానపువసతులు లేక, శుభ్రమగు వస్త్రము లకుగాని, గుడ్డలనుతుకుకొను వసతులకుగాని, నోచుకొనక, జబ్బులుపడినప్పుడు వైద్యసహాయమును పొందజాలక, బస్తీ యలవాటులకు తగక, అలమటించువారు వేలకొలది యీ బస్తీలో కలరని,'' ఆ యుపన్యాసకుడు తెల్పినప్పుడు, సుశీలకు కండ్ల వెంటనీరు రా ప్రారంభించెను. రెండవ యుపన్యాసకుడు, "నిరుద్యోగ సమస్య — నివారణోపాయములు.'' అను విష యముగూర్చి మాట్లాడెను. ఉపన్యాసకుడు హైకోర్టు వకీలు," చదువుకున్నవారెందరో నిరుద్యోగులై బాధపడుచున్నారు. బి. ఏ. పట్టముల బొందుటకంటె, ఉద్యోగము సంపాదించుట కష్టమగుచున్నది. కులముల ప్రాధాన్యతననుసరించి, బంధువర్గ ప్రాబల్యతననుసరించి, యేకొంతమందికో యుద్యోగప్రాప్తి యగుచున్నది. మిగిలినవారు, ఒకరిపైనొకరుపడి, ఉక్కిరి బిక్కిరై, త్రొక్కుకొనుచు, నానాటికి బి. యే. వారికివ్వదగు జీతపరిమితిని తగ్గింపుచూ, ఉద్యోగములందున్నవారికి అస్వ తంత్రత, నిరుద్యోగులైనవారికి నిరాశ, హెచ్చుచేయుచు

న్నారు. ఏదిక్కు లేక, లా కాలేజీకి, ఇంజనీయరింగు, మెడికల్ కాలేజీలకు మరలుచు, మరికొంత ధనమును వృధాచేయుచున్నారు. ఈ నిరుద్యోగసమస్యను రూపుమాపుట, ప్రభుత్వపు ధర్మమైనను, బ్రిటిషు యధికారులకు, మన మేలుగూర్చి తగు శ్రద్ధలేదు. ఈమధ్య మధురజిల్లా కలెక్టరుగారు చెప్పినట్లు, విద్యార్థికులై, నిరుద్యోగ బాధ జెందినవారు, గ్రామములకు వెళ్లి, సాంఘిక సేవ జేయుట శ్రేయోదాయకమని, నాకును తోచుచున్నది. వీలున్నప్పుడెల్ల, తలకొకపదో, లేక పదునైదు యకరాలభూమిని ప్రభుత్వమునుండి, కొలునకుతీసుకొని క్రొత్త పద్ధతుల ననుసరించి వ్యవసాయంచేస్తూ, తమకు జీవనోపాధి కల్పించుకుంటూ, తమతోడి రయితులకు వృద్ధికారకమగు విధానముల జూపెట్టుట దేశోపయోగకరము. అని యేమేమో చెప్పెను. ఉపన్యాసానంతరం కొందరు ప్రశ్నలువేసి, సమాధానముల బడసిరి. మన రామస్వామిగారులేచి "అయ్యా! నిరుద్యోగసమస్యగూర్చి, మీరుపన్యసింపుచూ, విద్యార్థికుల యందు ప్రబలియున్న యిబ్బందులగూర్చి మాట్లాడుటబట్టి, తదితర ప్రజాసమూహములందు, నిరుద్యోగబాధ లేదనుధ్వని వచ్చుచున్నది. మీయభిప్రాయమేమో సెలవిచ్చెదరా?" అనెను. అంత యుపన్యాసకుడు తదితరప్రజలందు, నిరుద్యోగ బాధ, అంతగాలేదు, కాని విద్యార్థికులందు చాల హెచ్చుగా ప్రబలియున్నది" అని సమాధాన మిచ్చెను. రామస్వామి తిరిగి లేచి, తాము సెలవిచ్చిన హంశమును, కాదనవలసి వచ్చినందులకు విచారించుచున్నాను. వాస్తవముగా, నిరు

ద్యోగసమస్య, బహుతీవ్రతరముగా, మన దేశమందు ప్రబలి యున్నది. ఐతే, ఆ బాధను, గ్రామస్థులందు, అందునూ, వ్యవసాయికులందున్నంత తీవ్రతరముగా, ఈ నిరుద్యోగపిశాచము తదితర సంఘములందు లేదని, నేను స్వానుభవముద్వారా చెప్పగలను. తుదకీబ స్త్రీయందుకూడను, సాధారణకూలీలకు కలుగుచున్నంత కష్టము, నష్టము, నిరుద్యోగపీడ, మీావిద్యాధికులకు కల్గుటలేదని చెప్పిన క్షమింతురుగాత! చదువుకొని, నోరుకలిగి, పత్రికలకు వ్రాయకల్గి, ఉపన్యాసములు చేయగలరు గనుక, వారికి కలుగుచున్న నిరుద్యోగబాధగూర్చియే, మీారువినుచున్నారు, మాట్లాడుచున్నారు. మనవారు బాగుపడవలెనన్న, మనప్రజలకు కలుగుచున్న నిరుద్యోగబాధ పోవలయునన్న, తమతమ కష్టములనే, కొండంతలుగాచేసి చెప్పుకొని, స్వలాభము పొందదలచుటకుమారు, మన విద్యాధికులందరు, గ్రామములకుమరలి, ప్రజాసామాన్యమునకు సేవ జేయ నిశ్చయించుట మేలు.

ఉపన్యాసానంతరము, ఉపన్యాసకుడు, వై. యం. సి. యే. శక్రటరీ, కొందరుప్రేక్షకులు, రామస్వామిగారి నభినందించి, ఆయనచుట్టు జేరి, సాంఘికసమస్యలను, ఒకకాలగంటసేపు చర్చించిరి. సుశీలాదేవిని వారికందరికి, రామస్వామి తెలియపరచెను. శెకరిటరీగారు,వచ్చేయుపన్యాసమును, బెజవాడయందు న్యాయవాదియు, సుప్రసిద్ధ సాంఘికసేవకుడగు, బసవలింగయ్యగారిచ్చెదరు గనుక, శ్రీరామస్వామి దంపతులు వచ్చుట, తన కెంతయు మోదము కల్గించుననియు, తెల్పెను. "బసవలింగయ్య

గారు పంచమోద్ధరణకై కంకణము గట్టిరిగదా! యని'' సుశీల యడిగెను. "అవునండి! ఆయన మా సంఘమునందు, అప్పు డప్పుడు, సాంఘికసేవగూర్చి యుపన్యాసము లివ్వ దయతో నంగీకరించినారు." అని శక్రటరీగారు చెప్పిరి. ఆనందమయ హృదయములతో, రామస్వామి, సుశీలయు, "నియోకోమల విలాస్'' నందు భోజనంచేసి, సినీమాకు వెళ్లారు.

మరునాడు, మన వధూవరులు, అడయారునందు జరుగు వుత్సవముల దర్శించుటకై వెళ్ళి, దినమంతయు అచ్చటనే గడ పిరి. వివిధభాగములనుండి వచ్చిన థియసాఫికలు సంఘసభ్యులు, మద్రాసు కాలేజీలందు జదువుకొనుచున్న, యువకులు, యువ తీమణులు, వందలుకొలదిగవచ్చి, యుత్సవములందు పాల్గొనిరి. ఆనిబిసెంటమ్మగారి యుపన్యాసము, జినరాజుదాసుగారి యుద్బోధనము, జిడ్డు కృష్ణమూర్తిగారి మతచర్చలందు, రామ స్వామి, సుశీల, పాల్గొనిరి. ఎగ్మూరువీధులందు షికారుచేసి వచ్చినపిమ్మట, హొటలులో తమ గదియందు గూర్చొని, మరునాటి, బసవలింగయ్య యుపన్యాసముగూర్చి విచారించు చున్నారు.

సు శీ ల

ఏమండీ! మన బసవలింగయ్యగారు, మద్రాసునందు గూడ పేరుపొందినారే! ఆయన చాలయోగ్యుడు. పైగా, చాలా యుత్సాహముకలిగి, తన సంఘోద్ధరణను జాగ్రత్తగా జేస్తున్నాడు.

రామస్వామి

అవును, సుశీ! బసవలింగంవద్దనున్న విశేషమేమంటే, మనవారితో, అనవసరంగా పోట్లాటపెట్టుకొనక, రైతుమేలే తనవారి శుభమను పరమరహస్యాన్ని గమనించి, దేశారిష్టము కల్గించక, స్వసంఘీయుల నభివృద్ధికి దెస్తున్నాడు.

సు శీ ల

కౌన్సిలునకు, ప్రభుత్వం, మెంబరుగా నామినేటు చేస్తామంటే, అంగీకరించలేదట నిజమేనా?

రామస్వామి

ఇప్పుడీ యవకాశమును పోగొట్టుకొనవద్దని నేనెంతగానో చెప్పినప్పటికి,మావారందరికి వోటులువచ్చిన తరువాత, అన్నికులముల వారందరిచేత మెప్పునొంది, యెన్నుకోబడే వరకు, నాకులస్థుడు సభ్యుడు కాకుండుట ఆత్మగౌరవకరమని చెప్పాడు.

సుశీల

చాలా దూరదర్శిసుమా! ఆయన సభ్యుడయినప్పటికంటె, సభ్యత్వము నిరాకరించినందువలననే, ఆయనయెడ ప్రజలకు, ప్రభుత్వానికి, గౌరవం యినుడించింది. సభ్యుడైనట్లయితే, ప్రజలచే యెన్నుకోబడినవారు, ఆయనను, నామినేటెడు మెంబరని తృణీకరించేవారు. ఇప్పుడో, దేశాభిమానియని ప్రత్యేకముగా గణనీయుడైనాడు.

రామస్వామి

సుశీ! నీకీరాచకీయ పరిజ్ఞానము, పుట్టుకతోనేకలిగినదా యేమి?

సుశీల

(సిగ్గుపడి) లేదండీ! మన యల్లమంద శిష్యత్వముకదా!

రామస్వామి

చూశావా? మనక్రింద పాలేరులుగానున్నవారు నాకంటె యెంతమేధావంతులో!

సుశీల

అట్లనకండి. మీకున్న యుదారత్వము, కుశాగ్రబుద్ధి దూరదర్శికత్వము, దేశాభిమానం, వారికికలదా? మీసహాయమువలననేకదా వారికిట్టి యవకాశములు కలుగుచున్నవి. మీరెన్నైన చెప్పండి, నాకు మీవంటివారు మరొకరు కన్పించడంలేదు, అని ముసిముసినవ్వు నవ్వింది. డిశంబరు 30 తేదీ సాయంత్రం నాలుగు గంటలకు, వై. యం. సి. యే. ఆడిటోరియంనందు, వందలకొలది ప్రేక్షకులు వచ్చి కూర్చున్నారు. రామస్వామి, సుశీల, ప్రథమవరుసయందే ఆసీనులయ్యారు. అధ్యక్షులు, ప్రధాన న్యాయమూర్తి, బసవలింగయ్య, ఐదారుగురు కౌన్సిలుసభ్యులు, మంత్రులిద్దరు, పట్టణమందలి సాంఘికసేవకులు పదిమంది, వచ్చారు. నాలుగున్నర గంట కొట్టడంతోనే అధ్యక్షులు లేచి, సభవారికి, ఉప

న్యాసకుని మెరుకపర్చారు. అంతట బసవలింగయ్య లేచి, రామస్వామి, సుశీలలకు నమస్కరించి, యిచ్చిన యుపన్యాసమునం దీక్రిందిభాగాలు, మన వధూవరుల నాకర్షించాయి.

“ఇంతవరకు, తమకు, బెజవాడ ఫిర్కాయందున్న పాఠశాలలన్నిటిలోకి, పంచమ విద్యార్థుల నెట్లు చేర్చామో, చెప్పాను. దేవాలయాలు, భావులను, చెరువులనుగూడ, యెటుల నందరికుపయోగపరచునట్లు చేయడం సాధ్యమయిందో నివేదిస్తాను. ఎప్పుడైతే తమ బాలురు పాఠశాలలందు జదువుకొను స్వత్వమును బొందారో, అప్పటినుండి, పంచములయందొక నూత్నవికాసం కల్గింది. ప్రజాసామాన్యానికంతకు, నుపయోగకరమగు చెరువులు, భావులు, దేవాలయాలు, తమకుగూడ నుపయోగపడాలని వారికి తోచింది. వారి పెద్దలంతాచేరి, యీవిషయమై ఆలోచించుకొని, నా వద్దకు, సలహాకై వచ్చారు. “మీరీ హక్కులను బొందటానికి గాను అర్హత బడయవలసిఉంది. మనకంటె దీనావస్థయందున్న శూద్రజాతులవా రనేకులు (ఎఱుకల, యానాది, ఉప్పర, వడ్డెవారు) యిప్పటికే యీహక్కులను పొందియున్నారు గనుక, వారు మనకంటె అపరిశుభ్రంగా, అసహ్యంగా, ప్రవర్తించుకుంటున్నా, పైకులాలవారు, వారికేయభ్యంతరాలు కలిగించడంలేదు. మనవిషయంలో, సహజంగానే, సంశయాస్పదులవుతారు. కనుక యీదినంనుండి రెండు నెలల వరకు, మీరు, మీపల్లెలయందున్న మురుగుకుండ్లను పూడ్చి,

వీధుల ప్రతిదినం శుభ్రపరుస్తూ, ముగ్గులుపెట్టుతూ, ప్రతిరాత్రి భజనచేస్తూ, బూతుకూతలమాని, ఒకరినొకరు మర్యాదగా సంభోదించుకొంటూ, స్త్రీలమధ్య గల్లు జగడాలనాపి, త్రాగుబోతులకు సన్మార్గాలజూపి, సంఘసంస్కార మొనర్చండి. అనుదినం, భజనతో, గ్రామదేవాలయంవరకు వెళ్ళి, "మేము దేవుని ప్రసాదమునకై, శిక్షణ నొందుతున్నాము." అను ప్రకటనా పత్రాన్ని ముందిడుకొని, పై కులాలవారిముందు, ప్రదర్శనంచేసి రావాలి. కార్తీక, శుద్ధ పౌర్ణమినాడు, మీకోర్కెలన్నీ, సఫలమయ్యేటట్లు వాగ్దానమిస్తాను, అని వారికి చెప్పాను. వారిల్లే, ఆ మూడు నెలలు, తదేకధ్యానంతో, తమ అనుదినచర్యల నడపుటకు తోడుగా, యీ సాంఘికపరిశుభ్రతాచారాన్ని నడుపుతూ ఉన్నారు. నేనీవ్యవధియందే, ప్రభుత్వానికి, గాంధిమహాత్మునకు, కాంగ్రెసువారికి, అయా గ్రామ పెద్దలకు, జాబులువ్రాసి, వారివారి సానుభూతి, ఆదరణ, సహాయముల బొందుతూ ఉన్నాను. ఆయా గ్రామాల నాయకులతో ముచ్చటించాను. పై కులాలవారికున్న సందేహాలు తీర్చాను. నేచేసిన ప్రయత్నాలన్నిటికంటె, పంచముల, అనుదిన ఆచారనిష్ఠయే, పై కులాలవారి సానుభూతిని, సహకారమును, సంపాదించింది. మహాత్ముని శిష్యు లనేకులు, మా పల్లెలకు వచ్చి, "గురుకులాలుగాని, యివి మాలమాదిగపల్లెలు కావని" అచ్చెరువందారు. కార్తీకమాస శుద్ధ దశమినాడు, శివాలయమం దభిషేకంచేసిన పిమ్మట, శంకరమంచివారిని

పిలిపించి, రయితుల నాయకులందరు సభదీర్చి, పంచముల ప్రార్థన నెట్లా తీర్చడమూయని విచారింప దొడంగిరి.

అర్చకులు మాత్రము, ప్రప్రథమమున; పంచములు వచ్చుచో, తాము దేవుని నౌకరిచేయజాలమని గట్టిగాచెప్పిరి. రమణయ్యగారు, వారిని సమదాయించి, పంచములు దేవుని సాన్నిధ్యమునకు వచ్చినప్పుడు మాత్రము, అర్చకులు బయటికి వెళ్లి, పిమ్మట తిరిగివచ్చి, మంత్రోచ్చారణద్వారా, దేవునికొక వేళ యేమైన మైల గలిగినచో, దానిని తీసివేయరాదాయని, సలహానిచ్చాడు. "బాగు బాగు" అని అందరన్నారుకాని, పూర్వాచార పరాయణులు, మోకరించారు. జాతీయవాదుల నాయకుడును, యువకుడునగు, పర్వతనేని మధుసూధనరావు గారులేచి, "అయ్యా! మీరందరు పెద్దలు, మీమాటకు అడ్డం వచ్చానని తలంపవద్దు, మనమీపట్టుదల జూపడం, నాకేమో వ్యర్థమనిపిస్తూఉంది. వచ్చే శివరాత్రినాడు, మనం, ఉత్సవం జరపినప్పుడు, యిచ్చటగాని, కల్లేపల్లియందుగాని, కోటప్ప కొండయందుగాని, దేవుని దర్శనార్థమై, యే, యే, కులస్థులు వచ్చినారో, వీరు పంచములు, వారుపూజసేయనర్హులని, ప్రజ లను, భక్తులను, విభజించి, పరీక్షించుచున్నామా? మీలో యెందరు పంచముల నంటుకొనకయే, తిరునాళ్ళయందు, జాత రులందు, దేవుని దర్శించిరో, ప్రమాణముచేసి చెప్పగలరు? వాస్తవముగా, మనమందరము, దేవుని యారాధించుటలో, పంచములను, పట్టింపులేకనే, జరుపుకొనుచున్నారము. ఊరు

మ్మడిగా యున్నప్పుడేగాక, అందరితోఁబాటు, మర్యాదగా, యోగ్యతగా, తమ్ముకూడ, దేవుని దర్శనార్థమై రానిమ్మని, మనసోదరులు కోరుచో, మూడు మాసములనుండి, వినయముగా, సహనముతో, తపస్సు చేయుచున్నప్పుడు, మనము, వారిని దేవునికి దూరముచేయుట న్యాయమా ! దేవునివద్దకు, భక్తుని పోనివ్వనివాని కెంతపాపమో గమనించితిరా ? మన పెద్దలైననూ, అంటరానివాళ్లకు, దేవుడవసరము లేదనగలరా? ఓపికతో, కోపమందక, మీరాలోచించుచో, మహాత్ముడు సెలవిచ్చినట్లు, పంచములను, అంటరానివారుగా గమనించుట, శాస్త్రవిరుద్ధ మగుటయేగాక, అమానుషము, అన్యాయము, గాదా ! మనవారిలో నెంతమందో, దేవుని సాన్నిధ్యమునకు పోదగనివా రున్ననూ, వారిని దేవునికి దూరముచేయుచుంటిమా? పరిశుభ్రతజెంది, ఆచారములపాటించి, సహనము జూపి, నాగరికతజెంది, శిక్షణకులోనైన, యీ పంచమ భక్తుల, మన మందరము, శ్లాఘించి, దేవునికి, ప్రీతిపాత్రుల మయ్యెదముగాక!" అని అసాధారణ వక్తృత్వముతో నుపన్యసించిరి.

గంగూరు మునసబుగారి తమ్ముడు రామచంద్రయ్య, తన బలగమును వెనుక వేసుకొని, తెచ్చుకున్న కోపముతో, "నే నప్పుడు వద్దన్నకొలది, మాలపొత్తును, పాఠశాలల్లో తెచ్చి పెట్టితిరి. ఒక్కవిషయములో లొంగితిమా, యీ అలగావాళ్ళ కోరికలకు, అంతుండదని అప్పుడే నేజెప్పితిని. వినేవాళ్లుంటేగా! ఈగాంధి శిష్యులు వచ్చారు, మనకులగోత్రాలన్ని యెగురవే

స్తున్నారు. ఏమండోయి! పూజార్లూ! మీరుమాత్రం, యీ మాలమాదిగలను, దేవాలయములోనికి రానిచ్చితిరా - మీ బుర్రలు పగులకొట్టుతాము.” అని కూర్చున్నారు.

పోరంకి అంకినీడుగారులేచి, మనమీవిధముగా, అంతు లేకుండా, పోట్లాడుకుంటూ, అవకాశము పోగొట్టుకుంటే లాభంలేదు. మన కమ్మారితరపున మధుసూధనరావుగారు మాట్లాడారు. రెడ్లతరపున యల్లమందగారు మాట్లాడాలని నాకోరిక, యీ సభకు పునాదిపాడునుండి, కాపుల నాయకుడు, వెంకయ్యగారుకూడ వచ్చియుండుట, అదృష్టమన్నారు.

యల్లమంద

సభవారు, బీదయు, పాలేరునగు నన్ను మాట్లాడ మన్నందులకు, వందనము లాచరిస్తున్నాను. గంగూరు రామస్వామిగారు చెప్పినట్లు, మనమీ పంచమసమస్యను, అటో యిటో, ఒకేమారు పూర్తిగా పరిష్కారం చేసుకొనడం మంచిదని నాయభిప్రాయం. తెలిసీ తెలియకగాని, చూచి చూడనట్లుగాని, యిప్పటికే, మనమందరం, పంచములు, మన దేవాలయములందు సేవజేయుచుండ, ఒప్పుకొంటున్నాము. ఇప్పుడు, బహిరంగముగా, వాళ్ళను రానిచ్చుటగూర్చి, మన మింత హడావుడిపడుట, భావ్యముకాదని నాతలంపు. మధుసూధనరావుగారు చెప్పిన విషయా లన్నిటితో, నేనేకీభవించుచున్నాను. మనమిప్పుడు వల్లకాదందుమా! జాతీయనాయకుల వలన చీవాట్లు తప్పవు, ప్రభుత్వపు సానుభూతి పోగొట్టు

కొంటాము. తుదకు, యెట్లులైనను, జయలక్ష్మి పంచములనే వరిస్తుంది. దేవుడు, అనాథలపక్షముననే, ఉంటాడని, మన భాగవతమే వాకొంటున్నదిగదా! మనంతట మనమే, పంచములయెడ, ఆదరముజూపెట్టి, వారి కృతజ్ఞతకు పాత్రులగుట శుభప్రదము. ఇక చెరువుల, భావుల, విషయముగూర్చికూడ, మనము, వారికి సంపూర్ణమగు హక్కుల ప్రసాదించుటయే న్యాయము.

వెంకన్న

అయ్యా! నాకుపన్యాసము లిచ్చుట అలవాటులేదు. పొలము సాగుచేసుకొనుటే, నాకు చేతనయిన వ్యవహారము. పొలములో, పనిజేసుకొనే, నాబోటి బీదవాళ్ళకు, అంటరానితనమనేది లేదు. ధనవంతులగు కమ్మవారు, నీడనుకూర్చుండి, మాలవాళ్లు వీరు, శూద్రులు వారు, అను భేదమును కనుగొనగలరు గాని, కాయకష్టమొనర్చు. కమ్మ, రెడ్డి, తెలగవారికి మాత్రం, చూచీ చూడనట్లు, పంచముల నంటుకొననిది, యే పనియు జరుగదు. దేవాలయాలలోనికి పంచముల రానిచ్చుటకు, మనమెవ్వరము? దేవుడేరానిస్తున్నాడు. కాల్వలలోను, రేవులలోను, వాళ్లు, మనమూ, ఒకేమారు, దాహము తీర్చుకొనడంలేదా? చెరువులలో, ఒకవైపున వాళ్లు, మరొకవైపున మనమూ, గుడ్డలుతుకుకొనడంలేదా! చేలలో నాట్లువేసేటప్పుడు, కలుపులు తీసేటప్పుడు, అందరము, ఒకేమారు, ఒకే మడిలో, నీళ్ళయందు పనిచేయుటలేదా? అయ్యా! దేశము

పూరుచున్నది. ఏదేండ్లక్రితము, యిట్టిసభలు జరిగినవా? పాలే రులగు నాబోటివాళ్లు, మీలాంటి పెద్దలమధ్య సాహసించి, మాట్లాడినారా? మాకింతమాత్రం గౌరవము, మీరు చూపె ట్టినంతమాత్రాన, మేము మీతలపై కెక్కుతిమా? అటులనే, పంచములుకూడ, మనమీహక్కులను వాళ్ళకిచ్చినప్పటికీ, మితిమించి, విపరీతపు పనులేమియు చేయకయే, న్యాయముగా గౌరవప్రదంగా, ప్రవర్తిస్తారని నానమ్మకం.

రమణయ్య

ఏమయ్యా! అందరిమాటలు విన్నారుగదా! ఇప్పుడు జరుగుతూఉన్న వ్యవహారాలగురించే, యీ కాలమును బట్టి, మన మాలమాదిగలు, యిప్పుడు, ఉండీ ఉండనట్లున్న ఆచా రాలను, తమకుండదగు హక్కులుగా, ఒప్పుకోవలసిందని మనల కోరుతున్నారు. ఇదివరకే, యిట్టి అలవాటు లున్నవిగనుక, యికముందుగూడ, అందరి కిష్టముగానే, వానిని జరుపుకోన వచ్చునని, మనము, వాళ్ళకు తెలియచేద్దాం. ఇందుల కెవరి కభ్యంతర ముండదనుకుంటా!

గంగూరు రామస్వామి

రాకరాక, వచ్చిందిగదాయని, ప్రతిదినం, వాళ్ళు గుంపులు, గుంపులుగావచ్చి, మనచెరువులు, భావులు, చుట్టూ జేరి, మనకు, ఊపిరాడనీయకపోతే, యేమిచేస్తాం? రోజూ, తిరునాళ్ళలోవలె, రొప్పుతూ, రోస్తూ, దేవునిగంట కొట్టవల

యునాయేమి? రమణయ్యగారూ! మీరుకూడా యీ పిల్లల
మాటలువింటే యెట్లాగనండీ?

రమణయ్య

నేనేమిచేసేది నాయనా! నాకాలము దగ్గరకువచ్చింది. ఇక పెత్తనమంతా మీవంటి కుర్రవాళ్లదే, ఆయన దిగంబర స్వామి, గాంధిమహాత్ముడు వచ్చినప్పటినుండి, మనవాళ్లందరికి, దేవుడిపిచ్చి పట్టింది. ఏమో అనుకుంటాము గాని, మనము మాత్రం, రోజూ, భావులు వట్టిపోవునట్లు తోడుకుంటున్నామా? దేవుని దర్శించుచున్నామా? వాళ్ళుకూడా, మొదటి పది రోజులు, క్రొత్తవింతవల్ల, ఆదేపనిగావస్తారు. ఆ తరువాత, మనందరిమాదిరిగానే, అజీర్ణములేకుండా, ప్రార్థనలు చేసుకుంటారు. ఐతే, పౌర్ణమినాడు, పూరందరితరపున, అభిషేకం, అన్నిచోట్ల చేయిద్దామా? రామస్వామీ! మనకెందుకూ; మనం కళ్ళుమూసుకుందాము: అందరికిష్టమేగదా! అన్నాడు. కరతాళధ్వనులు చెలరేగినాయి.

ఈయుదంతము జరిగిన మరునాడే, నాకుకబురువచ్చింది. నేను వెంటనే యీడుపుగల్లునకు వెళ్ళి, నాయకులందరికి, నాకృతజ్ఞతాభివందనాలు తెలియపర్చాను. కార్తీకపౌర్ణమినాడు, యిక మాపల్లెలో విజృంభించిన, సంతోషానికి ఆనందానికి ఉత్సాహానికి, మేరలేదు.

అయ్యా! యీ విధంగా, మహాత్ముని దివ్యప్రభావ ప్రేరితులై, అగ్రికులాలవారంతా, మాపంచములకు, హక్కులను, క్రమక్రమముగా, ప్రసాదిస్తున్నారు. దౌర్జన్య మేమాత్రం లేకనే, ద్వేషపూరిత ఆందోళన మక్కరలేకనే, వైకంసత్యాగ్రహోద్యమంద్వారా - బొందిన జయముకంటె, మిన్నయగు, ప్రతిభ, మా పంచములు, సాధుసంగతమగు, దైవప్రార్థనవలన బడయగల్గిరి.

పంచములు హిందువులు కారనువారిమాటలు నమ్మకుడు. మీకు యేహక్కులు కావాలి, అనియే, పంచముని యడిగినను, ఆతడు, తవ్వుడుకొనకుండనే, రామునిజూచు యధికారము కావాలని చెపుతాడు. ప్రతిపంచముని హృదయమందు, హిందూమత, సాంఘిక, సాంప్రదాయజ్ఞానం, జీర్ణించి ఉంది. పంచములను, వృద్ధికితేవాలంటే, వారిమతముద్వారానే, వారికి జ్ఞానధనమును, ప్రసాదించవలసి ఉంది.

ఉపన్యాసమైనపిమ్మట, ఒకరు, పంచములకు, యెంతవరకు, ఖద్దరుత్పత్తి యుపయోగమని, ప్రశ్నించారు. అందులకు ఖద్దరుత్పత్తియేగాక, నేతపనిగూడ, పంచముల కత్యంతోపకారి. వారికి వర్షాకాలమందు, యెండాకాలమందు, సంప్రాప్తించు నిరుద్యోగ నివారణకు, ఆయవకాశాలవసరం, అని సమాధానమిచ్చాడు. పంచములకు, ప్రస్తుతపు ప్రభుత్వపద్ధతి యిష్టమా? స్వరాజ్యమిష్టమా! అని యొక మిషనరీగారడి

గాదు. స్వరాజ్యమునే వారంతా కోరెదరు. సక్రమమగు విధాన, తమకోర్కెలగూర్చి, యాందోళన జేయుచో, స్వరాజ్యపు, భారతదేశమందే, వారికి హెచ్చు శ్రేయముకలుగునని నాధృఢనమ్మకం. ఇన్నివత్సరాలనుండి, బ్రిటిషుప్రభుత్వం, అంటరానితనాన్ని తొలగించిందా? మూడు వత్సరాలలో, మహాత్ముని శిష్యులు, తమంతట తామే, మావారికన్నిహక్కులను, ప్రసాదించారు. నాముందు కూర్చున్న, యీ మహా మహుడు, ఆయన సతీమణి సుశీలాదేవిగారలే, బ్రిటిషువారికంటె, హెచ్చుప్రేమ, ఆదరము, సహాయము, నాకూ, నావారికి, జూపెట్టారు. వేల్పూరు పెద్దకాపుగారి కుమారులే వీరు. నాకంటె వీరే, సాంఘికసమస్యలగూర్చి, యుపన్యశింప సమర్ధులు. అనేసరికి, సుశీల సిగ్గుపడి తలవంచుకుంది. రామస్వామి తడబడ్డాడు. సభ్యులందరు, వారివంకజూస్తూ, నివ్వెరపడ్డారు. సభానంతరం, మంత్రులు, కౌన్సిలుసభ్యులు, వారితో ముచ్చటించారు.

# హరిజన నాయకుడు.

## ఆరవ ప్రకరణము.

సభానంతరం, రామస్వామిగారి కోరికపై, యల్లమంద, ఆరాత్రి ఎగ్మూరు హొటలుకు వెళ్లడానికి సమ్మతించాడు. వై. యం. సి. యే. శక్రిటరీగారు, మన వధూవరులు, బసవలింగయ్య, ఆయనస్నేహితురాలు అరుంధతీదేవి, చెల్లిసుందరి, నియోకోమలవిలాస్‌నందు, భోజనంజేశారు. శక్రిటరీగారు, యింటివద్ద పనియున్నందున, అరుంధతీదేవితో, సెలవుతీసుకొని వెళ్లారు. భోజనానంతరం, తాంబూలము వేసుకుంటూ, యెలక్ట్రిక్‌ఫానుక్రింద కూర్చొని, ముచ్చటలాడ ప్రారంభించారు.

సుశీల

బసవలింగయ్యగారూ ! మీ యుపన్యాసం నాకెంతో యానందం కల్గించింది. రైతులయెడ మీకున్న ప్రేమ, నాకెంతయు ముదముగూర్చింది.

బసవలింగయ్య

అమ్మా ! నన్ను "బసవన్నయ్య" అంటేనేకాని, నీతో మాట్లాడను. నీచేతిభోజనం చేయవలసినవాడను, నేను, యిట్టి మర్యాదలకు లొంగడం భావ్యంకాదు.

సుందరి

అన్నయ్యా! మనసుశీలమ్మ నన్ను, యేమమ్మా! అని పిల్చి, యెగతాళిచేస్తున్నది గమనించావా?

సుశీల

మీరు, పట్టినపట్టు వదలరుగదా! సరే, బసవన్నయ్యగారూ! దయచేసి, మీకు యీ అరుంధతీదేవిగా రేమికావాలో చెప్పుతారా?

రామస్వామి

నీకంటె పంతముగలవారెవ్వరు? సుశీ! ఈమె మన బసవలింగయ్యను పెండ్లి చేసుకుంటుందని, శక్రటరీగారు చెప్పారు.

బసవలింగయ్య

ఓహెూ! నాకు చాలా తంటా తెచ్చిపెట్టినారే! బీదవాడికి నాకెందుకండి పెండ్లి? పైగా, అరుంధతీదేవిగారు నన్ను పెండ్లిచేసుకుంటుందా? బి. యే. ప్యాసై, వెస్లీ యను హైస్కూలులో, నెలకు యనభైరూపాయలమీద యుద్యోగము చేస్తున్నది. ఆమెకు, భోగములు, భాగ్యము, అత్యంతప్రీతికరము. ఇప్పటికి, ఆరుమాసాలయింది, ఆమెసాంగత్యము నాకుగల్గి. దాదాపు పదిమారులుకలుసుకున్నాము. శక్రటరీగారుమాత్రం ఆమెను పెండ్లిచేసుకోవలసిందని, యిప్పటికి రెండుమారులు హెచ్చరించారు. నాకుమాత్రం, ప్రపంచవాసన గలవారితో, సంబంధం పెట్టుకోవడానికి మనస్కరించడంలేదు.

సుందరి

మామయ్యగారూ! మీరు, మాఅక్కయ్యగారూ, సాంఘిక సేవలోనికే దిగినారు. మమ్మిన్నినాళ్లు మీరు పోషిస్తూ వున్నారు. మాఅన్నయ్య ఐనా, నాల్గు కాసులు సంపాదించక పోతే, నాచదువెట్లా పూర్తి అవుతుంది? మాతమ్ము లిద్దరికి చదువు చెప్పించేవారెవ్వరు? మాచెల్లికి పెండ్లి యెట్లాజరుగుతుంది. మానాయన కునికిపాట్లు పడుతున్నాడు. రేపో, మాపో, సెలవుతీసుకుంటాడు. ఎన్నాళ్లని మీరు మమ్ము కాపాడగలరు.

సుశీల

అమ్మాయీ! నీకెందుకింతభయం? మనకందరకు సరిపోయే, ఆస్థియే వుందిలే! మేముమాత్రం, పెద్దజమీందారుల వలె, జీవించాలని, యున్నదను కుంటున్నావా! మేమున్నా, దరిద్రనారాయణుని సేవనే పరమావధిగా గణించబోతున్నాం.

బసవలింగయ్య

మాసుందరికి, అరుంధతీదేవికంటె, భౌతికభోగాలపై హెచ్చు ఆశవుంది. పెద్దకాపుగారి పెద్దమాదిగ కుమార్తె నన్ను సంగతి మరచింది. నాకీ పెత్తనాలు రాకపోతే, వేల్పూరు మాదిగపల్లిలో, యేవేషాలు వేస్తుండేదో నాకు తెలియదు. ఎందుకు దీనిని నేను ఫ్యూరినుండ బయటికితీసి, బడికిపంపితినా యని, విచారము కల్గుతూవుంది. సుందరిమొగ మెర్రనైంది. కండ్లల్లో నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి.

సుశీల

అన్నయ్యా! చూడు? సుందరికి కష్టంకలిగిస్తున్నావు. చిన్నపిల్లకనుక, సొమ్ములుకావాలని, కోకలుకావాలని, ఆశలు పడుతుంది పాపం. బీదవారింటిపిల్లనని జ్ఞాపకంపెట్టుకోదు. ఇంతమాత్రానికే, యిట్లా కోపపడవచ్చునా ?

రామస్వామి

అమ్మాయీ ! సుందరీ! నీకీ కోరికలుకూడదమ్మా! మాదిగవారిపిల్లనని మరువరాదమ్మా! బీదవారి కూతురునని జ్ఞప్తియందుంచుకోవాల. చదువుకొని, యెంతగొప్పస్థానానికి వచ్చినా, మీసంఘీయులను మరువరాదమ్మా!

సుందరి

బావయ్యగారూ! యిలాచెప్పడం చాలా సులభం. నావలెనే, సుశీలమ్మగారుకూడ, బీదవాళ్ళబిడ్డయైపుట్టి, యీ దేశాలన్నీ తిరగాలంటే, సాధ్యమయ్యేడిదేనా? నేనెంత, మాదిగ గంగయ్య కూతురునయినా, మానాయన, మాకులస్థులంద రికిపెద్ద. ఇంతకూ, నన్నా మాదిగపల్లెనుండి, బయటికి తీసుకు రమ్మని యేడ్చినానా? నాతోటి పిల్లలవలెనే, నాకును, గుడ్డలు లేకపోతే, నాకేమో, తలగొట్టినట్లుంటుంది. తిరిగి, ఆమాదిగ పల్లెలోకిపోయి. ఆబూతులుతో, మాటలు నంజుకుంటూ, చుట్టలుత్రాగుతూ, కూర్చున్నచోటులందే వుమ్మి వూస్తూఉండే అగుంపుమధ్యకు పోవాలంటే, నాకిష్టంగాలేదు. ఆకోళ్లు,

పందులు, ఈగలు, దోమలతో నిండియుండే, ఆ గూడెంలో నేనుండలేనండీ. మా అన్నయ్య, యేమన్నా సరే, నేను చావ నన్నా చస్తాగాని, నేనా దుర్గంధభూయిష్టమగు గూడెములో మాత్రం, బ్రతుకలేను. అని కళ్ళనీళ్లు పెట్టుకుంది.

సుశీల

అన్నయ్యా! చెల్లికి రోషంవచ్చింది. తరువాత మాట్లా డుకుందాం లెండి. నిద్రకు వేళయింది. సుందరి అలసిపోయింది. ఏమండీ పోదామా! అంటూ లేచింది. బిల్లు చెల్లించి, రామ స్వామిగారు లేచారు. బస్సు యెక్కి, హోటలుకు, నలు గురూ వెళ్ళారు. అన్నా చెల్లెలుకు, ఒకగది నిప్పించారు. సుందరిని పండుకోనబెట్టి, బసవలింగయ్య, రామస్వామి గదికి వచ్చి, విచారగ్రస్తమైన మోముతో, కూర్చున్నాడు.

రామస్వామి

బసవయ్యా! నీవాచిన్నదానిని వేధించుతా వెందుకూ?

బసవలింగయ్య

రామస్వామిగారూ! మీరట్లు దానికి ఉత్సాహం కలి గించవద్దని నా ప్రార్థన. నాకు, దానిమాట తలచుకొంటేనే యెంతో విచారం కలుగుతూవుంది. మాదిగపల్లెలో పుట్టి, మాదిగపిల్లయైయుండి, మాదిగలంటే, అంత యసహ్యించు కుంటే, నా హృదయము, దగ్ధమైపోతూవుంటుంది. పైకులాల వారికే, మాయందున్న అసహ్యత తగ్గుతూవుంటే, దీనికే

దుర్బుద్ధి యెట్లాకలిగిందాయని, నాకు సందియం కలుగుతూ వుంది.

సుశీల

అన్నయ్యా! ఆపిల్లకు, ఆటపాటలు, వేషభాషలు, వస్తు థాయిష్టం. మనపల్లెయందే యున్నట్లైతే, సంసారుల పిల్లలతో సరసాలాడుతూ, మొగుణ్ణి ఆటలాడిస్తూ, తన మునుమును అందరికంటెముందుగా నాటుతూ, అందరికంటె సోయగముగా సొంపుగా, పాటలుపాడుతూ కాలంగడపేది. దానికే గనుక, మాసుబ్బమ్మక్కయ్యకు, నాకు; కల్గినయవకాశంగల్గి, ఆ పల్లె టూరి పాఠశాలయందే చదువు చెప్పించినట్లైతే, నీకుతోడుగా యుండి, యిప్పటికీ దీనజనసేవయందు, సహాయకారిగావుండేది. పల్లెటూరునుండి పెకలించి, బందరు తీసుకొనివెళ్ళి, ఆమిషనరీ పిల్లలమధ్య యెప్పుడైతే, పెట్టావో, అప్పుడే దానికి తలదిరిగి పోయింది. తాను మాదిగపిల్లయని, జ్ఞప్తియం దుంచుకో మంటే, యెట్లాసాధ్యమవుతుంది !

బసవలింగయ్య

రామస్వామిగారూ ! యెంతటి కుశాగ్రబుద్ధియున్నదో చూశావా, మన సుశీలాదేవికి ? అమ్మాయీ ! నీవు సుందరిని గురించి చెప్పిందంతా నిజమే; కాని, యిప్పుడేమి చెయ్యాలో నాకు తోచడంలేదు. మానానగారు, మామేనమామ కుమారుడు సుబ్బయ్యనిచ్చి, దీనికి పెండ్లి చేయాలని తీర్మానించు

కున్నాడు. మా మామ, బుర్రి అంకమ్మను, మీ రెరుగుదురు కదండీ! ఆయన కుమార్తెను నేను చేసుకోవలసింది. నాకీ కర్మము పట్టబట్టి, ఆపిల్లను మరొకరికిచ్చారు. ఇప్పుడీ మనువైన కుదర్చకపోతే, మాతండ్రికి, అవసానకాలంలో, అపారమగు, విచారం కల్గుతుందిగదా! మా మేనమామతో, యిక సంబంధమే తెగిపోతుందని, భీతికల్గుతూవుంది.

సు శీ ల

అన్నయ్యా! యిప్పటికాలపు లాభాలన్నీ, పంచములకు కావాలంటావే! సుందరి కిష్టంవచ్చినవారి నెవ్వరినో చేసుకోనీయక, మీనాయన కిష్టమువచ్చినవాడినే చేస్తానంటే యెట్లా? నీవునిజంగా పూర్వాచార పరాయణుడవే!

బసవలింగయ్య

అమ్మా! నీవన్నట్లు నాకు పూర్వాచారాలన్నీ వదలివేయడం యిష్టంలేదు. ఈ చదువంతా చదివింది, యీ పెత్తనాలన్నీ చేస్తున్నది, ఆగూడెములను, ఋషికుల్యముల జేయుటకేగదా! చదువుకున్నందులకు ఫలితం, నేనూ, నాకుటుంబమూ, మాగూడెముల వదలివేసి, వేరులవరకు పెకలిందుకొని బస్తీలకు వెళ్ళితే, యీ క్రీస్తియను యుద్యోగులకు, నాకూ, భేదమేముంది? సుందరికి స్వయంవరం చేసుకొనే యధికారం కల్గించామా, యేక్రిస్తియను షోకిలానో వరిస్తుంది. దానివల్ల పుణ్యమా! పురుషార్థమా! మాకులస్థులకు చెడ్డదారి చూపెట్టినవాడను కానా?

రామస్వామి

అంకమ్మకొడుకునేనా, బందరులో, నీవుచదివిస్తూవుంది.

సుశీల

ఆ! నేనెరుగుదును, ఆ పిల్లవాడిని - ఇరవై సంవత్సరాలున్నాయి గదూ! చాలా మెత్తనివాడు, అందమైనవాడు కూడా! అంతా, తల్లి పుల్లమ్మ పుటకే! మీనాయన కళ్ళు వచ్చినవి.

బసవలింగయ్య

అవును, చెల్లీ! వాడెంత మెత్తనివాడో, యీపిల్ల, అంతగడుసరి. వానికి, సెలవులెప్పుడువస్తాయా! యెప్పుడు, యీడ్పుగల్లు మాదిగపల్లెకు పోదునాయని, యాతురత ఉంటుంది. దీనికో, యెప్పుడు ఆదివారంవస్తుందా! వేషంవేసుకుని, క్రీస్తియను, పిల్లలతో చర్చికిపోదామాయని ఉంటుంది. వీళ్ళిద్దరికి, జతకుదిరేటట్లులేదు. దసరా సెలవులలో, నేను వానిని పిలిపించి, సుందరిని పెండ్లి చేసుకుంటూవా యని అడిగాను. "బావయ్యగారూ! అది ధనవంతుల యింటికి పోవాలని కోరేపిల్ల, నన్ను జేసుకుంటుందా? అన్నాడు. ఏమి చేయమంటారు, రామస్వామిగారూ?

రామస్వామి

ఇప్పటికి చాలాప్రొద్దుపోయింది, రేపుప్రొద్దున మాట్లాడుకుందాములే. ఇకనీవుపోయి పండుకో, పాపము, రాత్రంతా రయిలులో నిదురలేదు. అలసిపోయినావు.

బసవలింగయ్యా వెళ్ళినతరువాత, సుశీల, కొప్పులోని, పిన్నులతీస్తూ, ప్రక్కపై పరున్న భర్తనుద్దేసించి, "చూశారా! ప్రపంచమెట్టిదో; పెద్దకులములోపుట్టి, తక్కువవారిని పైకి దీయ, మనకు ఆతురతగాయుంటే, తక్కువకులంలో జన్మించి, సుందరికి పైవారికోరిక ననుకరింప కోరిక పుట్టింది," అన్నది. ఔనమ్మా! మాటలు చెప్పడానికి మీ స్త్రీలందరు జాణలే! అందమయినపిల్ల, తెలివితేటలకు లోటులేదు. మూడోఫారం వరకు, చదువుకున్నది. ఇతరకులస్థు లందరితో, సరిసమాన ముగా, తిరగడంనేర్చుకున్నది. పాపము, క్రొత్తగా నేర్చు కొన్న, తెచ్చుకొన్న, అలవాటుల మరలమాని, యెప్పటియట్లె బురదలో పొర్లాడమంటె, యెలాసాధ్యమవుతుంది." అన్నాడు. "మీరెప్పుడిట్లే మాట్లాడతారు. చదువుకున్న పురుషులు, స్త్రీలు, అందరూ, గూడెములువదలి, తమతమలాభాలు, సుఖ ముల గూర్చియే ప్రాకులాడుతుంటే, యిక గూడెంలోనివారిని రక్షించేవారెవరు? తెలివిగలవారంతా, గూడెములరోసితే, తెలివితక్కువవారు, దుర్మార్గులు, దొంగలు, మాత్రం మిగిలి పోతారుగదా! వాళ్ళను పెట్టుకొని, రయితులెట్లావ్యవసాయం చేస్తారు?" అన్నది. ఇక పండుకొందామబ్బా! నీకెల్లప్పుడూ యీగోలయేనా? నీకళ్లుచూచుకో, యెంత అలసిసొలసియు న్నావో? అమ్మాయీ! సుశీలా! నీఆలోచన లన్నిటియందు, రయితు బాగోగులగూర్చియే, శ్రద్ధజూపెట్టుచుందువుసుమా! నీవు, అసలు మానాయననోట్లోనుండివూడిపడవలసినదానవు" అన్నాడు. ప్రక్కమీదవాలుతూ, యేమండోవు! మీరేనా!

రమణయ్యగారినోట్లోనుండి రాలిపడింది. మా అమ్మకు మీ నాయనకు, ఒకటే రక్తముగాదా! రమణయ్య మామగారి రయితురక్తము, రయితుతత్వము నాకుమాత్రం లేదా! ఎంత రయితుబిడ్డవయినా, వెంకయ్యగారి వ్యాపారవాసన లేకపో లేదులే! చలిగాఉంది, నాకు శాలువాకప్పు, చక్కలగిలిపెట్ట వాకు అంటూ, నవ్వుకొంటూ, యిద్దరు, బాహువల్లరులందు, శిరంబులుంచుకొని, నిద్రపోయారు.

కొంచెము చీకటియుండగానే, సుశీల లేచి, బసవలింగయ్య గదికివెళ్ళి, సుందరినిలేపి, తనతో కొంతసేపు షికారు నకై రావలసిందని, బయటికి తీసుకొనివెళ్ళింది. సుందరికి పదునేడో సంవత్సరం. పొట్టికురచయైనపిల్ల, ధృఢకాయురాలు, మొగము, అతిచక్కనిది కాకపోయినా, కళాయుతమై యుంటుంది. పెదవులు కొంచెం పల్చనివి. కన్నులు లోతుగా యుండి, కఠినమగుచూపులు వెలువరిస్తూవుంటాయి. నవ్వుమాత్రం, సుస్మితమై, దయనొలుకుతుంటుంది. వయస్సు వచ్చింది. అంగుపొంగులు, విజృంభించినాయి. పురుషుల జూచుటవుం దానందము, పురుషులతో మాట్లాడుట కుతూహలం, కలదు. పెద్దపెద్ద, యంగలువేస్తూ, నిర్భయంగా పెత్తనము జేయడానికే, పుట్టినపిల్లవలె నడుస్తుంది. సుశీలకెందుకో, సుందరిని, యెనిమిది సంవత్సరాలక్రితము, గంగయ్యతో వస్తూవున్నప్పుడు, జూచినప్పటినుండి, యొకవిధమయిన ప్రేమ కలిగింది. ఈనాడు, నంగంబాకం రోడ్డువెంబడి, ఒకమైలు

వరకు తీసుకొనిపోయింది. మార్గమధ్యమున, సుశీల, చల్లగా నిన్నటి సంభాషణ తిరిగి ప్రారంభించింది.

సు శీ ల

సుందరీ ! నీవు మీ అన్నయ్య అభిప్రాయాల నర్థంజేసు కోకుండా, రాత్రి కోపపడ్డావు. నీవిట్లు పంతగించి, ధనవంతుల వలె వేషాలు వేయడానికి పూనుకుంటే, విసుగుబొంది, మీ అన్నయ్య, ప్రాక్టీసుమాని, మీ గూడెమునకు వెళ్ళుతాడు. ఆయన చదువుకోబట్టియే కదా ! నీకింత మాత్రమైన చదువు వచ్చింది.

సు ం ద రి

అవును అక్కయ్యా ! నేను మాత్రము కాదంటానా ? నాకేమిటో చిన్నప్పటినుండి, మంచి, మంచి, గుడ్డలంటే, పూలంటే, బంతులంటే, యిష్టముగా యుండేది. బందరులో, మాఅన్నయ్య, నన్ను పెట్టిన తరువాత, మిగిలిన పిల్లలకే డ్రెస్సువుండేదో, అదికావాలని నాకు కోరికగాయుండేది. ఆరోజుల్లో, నేనుకోరినదెల్ల, మాఅన్నయ్య యిస్తుండేవాడు. నిరుటినుండి, యెందులకో మారిపోయాడు. నిన్న చూశావే, ఆపిల్ల స్నేహితము జేసినప్పటినుండి, వెనుకటివలె, నామీద ప్రేమగాయుండడంలేదు.

సుశీల

ఎంత పిచ్చిపిల్లవే? మీఅన్నకు, ఆపిల్లగాని, మరొక

పిల్లగాని, ప్రత్యేకంగా, యిష్టమనుకుంటున్నావా ? నీకు, మీ గూడెముమీద, అయిష్టతకల్గుట తెలుసుకొన్నప్పటినుండి, ఆయనకు దిగులుగాఉంది. నిన్ను, ఈడుపుగల్లు బాలికాపాఠశాలలో, మిస్ట్రెస్‌గా యుంచడానికై, చదువు చెప్పించాడు. ఎల్లప్పుడూ పల్లెటూరులందుండవలసిన పిల్లవుగదా ! నీకీ పరికిణాలు, జాకెట్టు లెందుకు చెప్పు? నేనివియన్ని, యెప్పుడో తీసివేసినానే !

సుందరి

మీకేమండీ ? మీ రేగుడ్డలు వేసుకున్నా, పెద్దకాపుగారి కోడలేనంటారు. నాకు యీగుడ్డలైనా లేకపోతే, "ఛీ, మాదిగపిల్ల," అని అందరసహ్యించుకోరా ?

సుశీల

నీకీ యాలోచనలు, యెవ్వరు నెత్తిలోపెట్టారు ? మీ అన్నకు, లక్షలున్నయ్యా ! కోటులు, బెత్తాలు, కారులున్నాయనా, నిన్న మంత్రిలతో సహావచ్చి గౌరవించారు. మీ అన్నయ్య, మాదిగకులస్థుడని, మాకు తెలియదూ? ఐనప్పటికి, మాయందరితోబాటు, గౌరవింబడుటలేదా ?

సుందరి

ఐతే, నన్నేమిచేయమంటారు? ఆ యీడుపుగల్లుబళ్లో పంతులమ్మగా యుండమంటారా? ఆగూడెంలో, యెట్లావుండేదండీ? ఈపరికిణా, మోకాలివరకు, యెత్తుకొని, తిరగాలనే !

ఆదోమలలో యెట్లాబ్రతికేదండీ? నేనా బురదకూపములో యుంటే, మీకుమాత్రం, నన్ను వచ్చిచూడడానికి, రోతగా వుండదా?

సుశీల

వెర్రిపిల్లవే నీవు! అందులో కాదటే నీవుపుట్టింది? నీమాదిరి చదువుకున్నవాళ్లు, ఆగూడెములలో నివసించితేనే గాని, అవి బాగుపడవు. నీవు, నీతోడి యువతులకు చెప్పి, ప్రతి దినం, వీధులన్నిటిని వూడ్పించి, మడుగు లెక్కడను లేకుండాచేసి, నేలమట్టమును, యెత్తుగాచేయించితే, గూడెములుమాత్రం, బాగుపడవా? మీవాళ్ళందరితోబాటు, నీవుకూడ, తొడవరకు కోకయెత్తి, మట్టగోచిపెట్టి, మోకాటివరకు బురదలోదిగి, నారు, నాటవలసినదానివే! అ యిబ్బందులేమి లేకుండా, బాగా చదువు చెప్పించి, ఉద్యోగమిప్పించినప్పుడు, సంతోషించి, మీకులస్తుల నందరిని పైకి తీసి, విద్యావంతుల జేసి, బాగుచేయవలెనని కోరికపడవద్దటే!

సుందరి

అంతా బాగున్నది. కాని, ఒక రహస్యంమాత్రముంది. నాకుమాత్రం, ఆపాగాకునమిలే, కల్లుత్రాగే, బూతులుతిట్టే, మాదిగవాడెవడూవద్దు.

సుశీల

మేముమాత్రం, అంతవెర్రివారమటే! డబ్బుకలవాడు మాత్రం, మీమాదిగలలో దొరకడు.

సుందరి

డబ్బులేకపోతే ఫరవాలేదు. నాకువచ్చే జీతముచాలు. కాని, చదువుకున్నవాడు కావాలమ్మా!

సుశీల

మీ మేనమామ కొడుకును, చేసుకుంటావా ?

సుందరి

ఆయన, నన్ను చేసుకోడు. నేనంటేనే, అసహ్యించుకుంటాడు. మా అన్నయ్యకంటే, అన్యాయం. పైగా, ఆయనపేరు నాకు బాగాలేదు. అక్కయ్యగారూ! ఏమనుకోకండి. ఆయన, నేనూ, బందరుకు, చదువుకోడానికి పోయేటప్పుడు, మా అన్నయ్య, మాయిద్దరిని, రైలుబండిలోపెట్టి, బెజవాడ, గుడివాడ, స్టేషన్లలో, షికారుచేసే సమయంలో, మేమొకరినొకరము, పెండ్లిచేసుకుందామని చెప్పుకున్నాం, కాని, క్రిందటి రెండు సంవత్సరాలనుండి, ఆయన నాతో మాట్లాడడమేలేదు. నేనేనా, అంతీసివేసినదానినని, కాలేజీలో చదువుకొంటున్న, మల్లికార్జునరావుగారితో, స్నేహితం జేసుకున్నా.

సుశీల

ఆ స్నేహితం, యెంతవరకు పోయింది ?

సుందరి

అలా అంటారేమిటి ? మేము, మీవాళ్ల మాదిరి, సిగ్గుపడి, ఒకరితోనొకరు, మాట్లాడుకోవడమే, ఆలస్యంగా,

వెర్రిపనులు, చేయాలనుకుంటామా ! యేమిటి ? మాకులాల వాళ్లు, స్త్రీపురుషులు, బాగా, సరసాలాడుకుంటారు. ఒకరి కొకరు, దూరంగానే, యుంటారు. ఆటపాటలందు పాల్గొం టారు. తలతిరిగి పడిపోకుండానే, నడుచుకుంటారు.

సుశీల

ఇంతకు, మీరిద్దరు, పెండ్లి జేసుకుందామనుకో లేదుగదా?

సుందరి

అయ్యో ! మాసుబ్బయ్యబావే, ఆశకల్పించనట్లైతే, యింకొకరిని, పెండ్లి జేసుకోవాలనే, ఆలోచనకూడా కల్గు తుందా ? ఆయన్ని వేధించడానికి, కల్పించిన, స్నేహితుడేకాని, యీయన, మరేమిలేదులెండి.

సుశీల

ఐతే ! నిన్ను చేసుకుంటానంటే, నీవు, సుబ్బయ్యను చేసుకుంటావా ?

సుందరి

కళ్లకద్దుకొని, మాబావకేమితక్కువండి ? తామరాకు లాంటికండ్లు, గొప్పనెన్నుదురు, దయనువొలికించే మోము, పుష్పాలనండలవలెనుండే చేతులు, ఆయన, మాబావ రామ స్వామిగారివలెనే, యుంటాడు. వారిద్దరికి, చాలాపోలికలు న్నాయి. "సుబ్బారావు" అనే పేరు మార్చుకోవాల సుమా! ఐతే, ఆయనకెక్కడ యుద్యోగము ?

సుశీల

ఉద్యోగమందరికి, అంత సులభంగా దొరుకుతుందను కున్నావాయేమి ? యల్లమంద, మీబావగారు, అన్నయ్యా, అందరు, మీరు పంచములనే కారణమున, తాలూకాబోర్డు వారిని ప్రార్థిస్తేనేకాని, ఉపాధ్యాయులుగా, మిమ్మల నియమించడానికి వీలులేదు. ఎన్నివందలమందో, ఉద్యోగాలులేక, ఆకలిచేత, అలమటిస్తున్నారు. మీయిద్దరికి, యీడుపుగల్లు లోనే, ఉద్యోగాలిప్పించడానికి, ప్రయత్నిస్తాములే, సుబ్బయ్యా, ఓహో ! మరచితి. నీవు సుబ్బారావును, చేసుకుంటావని, మీఅన్నయ్యకు చెప్పేదా ! నీవు, గడుసైనపిల్లవే, నీవంటే, నాకెందుకో, జాలిగాయుంటుంది, అనేసరికి, తిరిగి, హోటలుకు వచ్చారు. కాఫీ తీసుకునే, వేళైనప్పటికి, వీరికొరకు, బసవ లింగయ్యా, రామస్వామి, వేచియున్నారు. వీరు వచ్చుటతోడనే "బసవలింగయ్యా ! కాఫీపొయ్యి," అన్నాడు రామస్వామి. " అన్నయ్యా ! అక్కయ్యా, అన్ని సంగతులు, చెప్పింది. నాకు యీడుపుగల్లులోనే, కాపురం యేర్పాటుచేస్తే, బస్తీవేషాలు, వదలివేస్తా " అన్నది.

బసవలింగయ్యా

ఎంతటి యాశ్చర్యం ? ఒక్కపూటలోనే మారిపోయి నావేమే! ఇదంతాచూస్తే, సుశీలాదేవి మహాత్మ్యములాగుందే!

రామస్వామి

నేను చెప్పలా ! "సుశీకున్న వ్యవహారజ్ఞానం మన కెవ్వరికిలేదని."

సుశీల

నేనుచేసిందేముంది? తానెంతకాదన్నా, సుందరీ గంగయ్యకూతురే! సాంప్రదాయములు, బలముగా వేరులు నాటుకొనియున్నంతవరకు, సకాలమున, మలయమారుతము, వీచుటతోడనే, మనస్సు, యింటిదిక్కు, మరలుతూవుంటుంది. నేను వీరిని, పెండ్లిచేసుకుంటానని, తెలుసుకోవడానికి, మావారికెంత్తో కష్టమైనది. అప్పటికి "మా అమ్మ, యెంతటిపిల్లవే! మొగుణ్ణి, నిర్ణయించుకునే వచ్చావు" అని చెప్పింది. ఈ పొద్దున, అరమరలేకుండా, సందేహ మిసుమంతలేకుండా, సుందరి, తన వివాహరహస్యాలన్నీ, ఒక్కనిమిషంలో చెప్పివేసింది. నాకే సిగ్గుకలిగింది.

బసవలింగయ్య

కొంపతీసి, పెండ్లికాలేదుగదా? దీని వేషాలన్నీ, నాకు, ఆశ్చర్యమేకలిగిస్తుంటాయి.

సుందరి

ఎంతపిచ్చివాడవు? అన్నయ్యా! నీవు. మేనమామకొడుకును, చేసుకుంటానని చెప్పడానికికూడ,సిగ్గుపడాలనా యేమిటి? ఎవ్వరికి చెప్పకుండా, మనగూడెములో పిల్లలు, యెంతమంది పెండ్లిండ్లు, చేసుకోలేదు?

బసవలింగయ్య—ఎంతసిగ్గులేనిదానవే?

సుశీల

(నవ్వుతూ) రహస్యం, బట్టబయలైన తరువాత, సిగ్గెందుకన్నయ్యా?

రామస్వామి

సుశీలా! మనము, రేపటిరాత్రి బయలుదేరి, మనవూరు పోదాం. వీరుకూడవస్తారు. సుందరికేమైన, గుడ్డలు కొందామా, యీనాడు?

సుందరి

బావగారూ! నేనీ బస్తీ గుడ్డలిక కట్టను. చిన్నకోక, చిన్న రవిక చాలును.

బసవలింగయ్య

ఇంతకాలానికి, నీకు, బుద్ధికల్గి, మాదిగవారిపిల్లనేన విషయం, జ్ఞప్తికివచ్చినందులకు సంతోషమే!

సుందరి

మా అన్నయ్యగా, నీకెంతకష్టము గల్గించితినోగదా! "క్షమింపుము" అని కండ్లనీళ్లు పెట్టుకుంటూ, అన్నను, కౌగిలించుకుంది.

---

# హరిజన నాయకుడు.

ఏడవ ప్రకరణము.

బెజవాడకు ఐదుమైళ్లదూరాన బెజవాడ నందిగామ రోడ్డుకు సమీపమున గొల్లపూడి యను గ్రామం కలదు. ఈ గ్రామమునందు రయితులం దెక్కువమంది కమ్మవారు. ఈ యూరియందు స్త్రీలు మాగాణిప్రాంత్యములందువలెగాక పొలముపోవుటకుగాని, పురుషులతో వ్యవసాయమందుగాని, పెత్తనమందుగాని సహకారము చేయడానికి సందేహింపక రైతాంగాభివృద్ధికి తోడ్పడుతూవుంటారు. బస్తీకి దగ్గరలో నున్నారుగనుక పాలు, పెరుగు, మజ్జిగలను యాదవస్త్రీల ద్వారా అమ్మించి తలానాల్గు డబ్బులు సంపాదించుకొనడములో తరిబీతైనారు. మాగాణివసతులు లేకున్నా కష్టించి భూమిని ప్రేమించి సాలునునమ్మి భాగ్యభోగ్యములకేమి కొదువలేకుండా జీవితాన్ని గుప్తముగా క్లుప్తముగా జరుపుకొంటూ కొంతకాలమట్టె మిడిసిపడి మరికొంతకాలము క్రిందపడక క్రమక్రమాభివృద్ధిని బొందుచున్నారీరైతులు. యుద్ధకాలమందు పొగాకు, మిరపకాయలు, ధనియాలకు ధరలు అపరిమితముగా హెచ్చిపోయినప్పు డెందరో రయితులు తమకున్న అప్పులను తీర్చికొని కొంతధనము సేకరించి పూరిండ్లను పడ

గొట్టె పెంకుటిండ్లు కట్టించుకొని స్త్రీలకు సొమ్ములు చేయించు కొని సాధ్యమయినంతవరకు భూవసతిని హెచ్చుచేసుకొని వృద్ధిబొందారు.

ఇన్నియున్నను, మాగాణిప్రాంత్యముల రైతులకు, వీరు- విద్యాభివృద్ధియందు, దేశీయవ్యవహార పరిజ్ఞానమందు, జాతీ యాభిమానమందును చాల లోపించియున్నారు. తాలూకా బోర్డువారి యెలిమెంటరీస్కూలు భవనమును కట్టించుటయందు గ్రామస్థులు సనాతనాచారము ననుసరించి, పరస్పరసహకా రంతో హెచ్చు శ్రద్ధ జేసినప్పటికి, తమ బిడ్డలను బడికిపంపించ డంలోమాత్రం, అత్యంత అశ్రద్ధచేస్తున్నారు. కాంగ్రెసు సంఘంపెట్టాలని రైతుల కేరికి తట్టనేలేదు. బస్తీలందు పై పెత్తనంచేసేవారే వీరికినాయకులు. సాంఘిక కట్టుబాటులందు పూర్వాచారపరాయణులై, అలగా జాతులవారియందు సాను భూతిరహితులై యున్నారీ రైతులు. ఈచుట్టుపట్లగల షాహు కార్లకు సాంఘికసంస్కార నాయకులయెడ ఆదరమేమాత్ర మూలేదని బెజవాడలో చెప్పుకుంటుండేవారు. కాని 1926 వ సంవత్సరమందు, ఇంగ్లీషు చదువుకొంటున్న రయితుబిడ్డలు కొంతమంది గండికోట భవనంలోనివసిస్తూ, తమపెద్దలుగూడ తమపూర్వపు చారిత్రమును, నడతను మార్చుకొన్నారనీ తమ యూరియందుగూడ విద్యాభివృద్ధి కలుగుచున్నదని ఖద్దరు వేసే వారు హెచ్చవుతున్నారని వాదిస్తూవున్నారు.

మెట్టప్రాంతాలనుండి వచ్చే రయితుబిడ్డలకు, మాగాణి ప్రాంతముల రయితు యువకులకు అప్పుడప్పుడు గండికోట

భవనమునందు పోటాపోటీలు సరససల్లాపాలు జరుగుతూ వుంటాయి. అట్టి సమయములందు గొల్లపూడినుండివచ్చిన సోదరయువకులిద్దరు తమవారిని సమర్థించడమేగాక మాగాణి రయితులు మెట్టప్రాంతపు రయితులకంటె అనేకవిషయాలలో వెనుకబడియున్నారని సవాలుచేస్తూ వుండేవాళ్ళు. ఒకనాడు పదిమందివిద్యార్థు లొకగదియందుండగా నాయకులిద్దరిమధ్య కొంతచర్చ ప్రారంభమయింది.

గొ॥ గోపయ్య

మా స్త్రీలకు హెచ్చు స్వాతంత్ర్యముంది. పాశ్చాత్య దేశములం దీనాడు స్త్రీలకు రాచకీయ, సాంఘిక స్వాతం త్ర్యము పురుషులతో సమానత్వము ప్రసాదిస్తున్నారు. ఈ దినములందు మనదేశములోగూడ స్త్రీలకు ఓట్లు నిస్తు న్నారు. మాగ్రామముల స్త్రీలు ఓట్ల నుపయోగించడానికి గాని రాచకీయ వ్యవహారాల నర్థము చేసుకొనడానికిగాని యేమాత్రమూ కష్టపడనక్కరలేదు. మీ మాగాణిప్రాంతాల స్త్రీల కేమాత్రమిట్టి యవకాశాలు లేవుగదా!

పునాదిపాడు కిలారి సుబ్బయ్య

సిగ్గులేకుండా పొలాలవెంట తిరుగుతూవుండే మీస్త్రీల గురించి, మీరు పొగడుకోవలసిందే గాని, నాగరికతపొందిన వారెవ్వరు సిగ్గుపడరు ?

గొ॥ గోపయ్య

ఇసుకలోతలబెట్టి ఉష్ట్రపక్షి తనకుమించిన ప్రపంచము లేదనుకొన్నట్లు, మీపదియూళ్లలో క్రొత్తగా యీఘోషాపద్ధతిని తెచ్చిపెట్టుకొని మావంటినాగరకులు మరెచ్చట లేరనుకొని మీరు మురియుచున్నారు. బ్రాహ్మణులకు వైశ్యులకు ఘోషాయున్నదా ? మనకంటె తక్కువజాతివాళ్లకు ఘోషాయున్నదా ? తుదకు మీాముత్తవ ముదిముత్తవ కాలములలో మీాపూళ్ళలో, మీాయిండ్లలో ఘోషా ఉండినదా ! హిందూ సంఘంలో వందకుతొంబై కుటుంబాలయందుయీాపద్ధతికలదా? వాస్తవంగా మీా గ్రామాలందున్న యనాచారం, స్త్రీలయెడ మీారుచూపుచున్న దుర్మార్గం మరెచ్చటైన చూడగలమా? మీావారికి యీాఘోషగల్గించే ఘోషాపద్ధతి అనర్థదాయకమైనదని తెలియబట్టియే, శ్రీమతి చాటపర్తి అన్నపూర్ణమ్మగారిని, పునాదిపాటి సుబ్బమ్మగారిని, వేల్పూరు సుశీలాదేవిగారిని యింతగా మీారు పొగడుచుండడం.

కిలారి సుబ్బయ్య

పొలాలవెంట స్త్రీల బంపుటమాత్రం మాకు రుచించదులే. రాచకీయపు పెత్తనాలు సాంఘికగౌరవాలు, యింటి వ్యవహారాలందు మాత్రం స్త్రీలకు స్వాతంత్ర్యముండాలని మేముకూడా ఒప్పుకుంటాము. సరేగాని, పంచములవిషయంలో మీావారు చూపెట్టుతున్నంత మాధ్యం, అనర్థదాయకమైన పట్టుదల మావైపున కానబడుతుందా ! బసవలింగయ్యగారు

కోరినంతమాత్రాన మా గ్రామాదులవారంతా పంచముల బాలబాలికలను పాఠశాలలకు రానివ్వడానికి, దేవాలయాలు చెరువులు భావులు పంచములుగూడ నుపయోగించుకొనడానికి, మావారంతా ఒప్పుకున్నారుగదా! మీ మోటువాళ్ళేమి చేస్తున్నారు? చెప్పు. పంచములతో మంచిచెడ్డలగురించి సవ్యంగా మాట్లాడడానికిమారు, వారందరిని చావమోదారు. అంతటితో తనివిదీరక రామవరప్పాడు కవులూరు కొండూరు, ఆదిగాగల గ్రామాదులకుపోయి, అచ్చటి రయితులనందరిని పంచములమీదకు వుసిగొల్పారు. తిరునాళ్ళకువచ్చిన పంచములందరిని తన్నించారు. బెజవాడకు ప్రతిదినం చదువుకొనబోవుచున్న పదిమంది పంచమబాలురను కొట్టించారు. ఇంతకంటె దుర్మార్గం మోటుతనం, అనాగరికకృత్యం మరొకటుంటుందా? మెట్టప్రాంత్యపు రయితులే యోగ్యులన్న లాభమేమి?

## గొల్లపూడి గోపయ్య

మీవాళ్లు మాత్రం మంచివాళ్లా? ఆ పిరికిపందలు వేల్పూరు పెద్దకాపు, యీడుపుగల్లు ముతాదారులు, పంచములుకోరిన హక్కులన్నిటిని కుక్కిరిబిక్కిరి మనకుండా యిచ్చివేసి దణ్ణములుబెట్టి కూర్చుంటే; కమ్మవారి క్షాత్రముచూపెట్టి క్రిందవారెట్లా అణగి మణగియుండాలనో చూపెట్టుట కొక్కరైన ధైర్యముచేయవద్దా? తిండిలేక మలమలమాడుతూ, దొరగారూ, అని మనవద్దపడి పంచములు, కాచేవాళ్లు.

మీసాలు దువ్వేరోజులు తెచ్చింది. వరిబియ్యం తిని సీరసులై బొర్రలపెంచుకొన్న మీవాళ్లేగదా! యీముప్పు రైతులకు దెచ్చిపెట్టింది.

కిలారి సుబ్బయ్య

మావాళ్లు తెలివిగలవాళ్ళయింది మీవాళ్లు జాగ్రత్త గలవాళ్ళయిందీ యీ క్రిమినలుకేసులు పైసలయ్యేలోపల తెలుస్తుందిగా! వంగివంగి సలాములు పెట్టుచుండిన పంచములు మీ గ్రామములందు మిమ్ములను లెక్కపెట్టుచున్నారా యిప్పుడు? ఒకప్పుడు మీరంటే భయముగలిగి గౌరవించెడి వాళ్లు యిప్పుడు మీకమతములోనున్నను మీయం దేమాత్రమైనా ప్రేమకలిగియున్నారా? ఎప్పుడూరయితులనమర్యాద చేసి యెరుగని పంచములు మీగ్రామములందు మిమ్ములను ప్రతివిషయములోనూ ప్రతినిమిషమునందు తిరస్కరించి వేస్తున్నారుగదా? మీరీబండతనపుపనులు చేయడంవల్ల వచ్చినవే కదా! యీయనర్థకములన్నీ. మా గ్రామాలకు యీనాడు పోయిచూడు? మాపంచములెవ్వరో పంచమేతరులెవ్వరో భేదము చూపెట్టగలవా? రయితులయెడ పనివారెంత గౌరవముగా ప్రవర్తిస్తున్నారో చూడు.

ఇదివరకెన్నడులేని మార్దవము యోగ్యత సత్ప్రవర్తన మా పంచములకేర్పడుటయు, రయితునుజూచినవెంటనే ప్రతిపంచముడును నమస్కారము పెట్టుటయు, రయితులు వారిని మర్యాదగా పలుకరించుటయు, కనుగొన్నవారికేరికి

సంతోషము కలుగదు? మావూళ్ళనుండి ఒక్క కేసయిన వచ్చిందా కోర్టులకు? నీవుచెప్పు? అందరిచేత మెప్పుగొన్న మా రామస్వామి, యల్లమంద వారిపెద్దయైన పెద్దకాపుయెడ నెంత వినయ గౌరవాలతో మాపంచములు వారినాయ కుడు బసవలింగయ్య ప్రవర్తించుకొంటున్నారో చూడుము?

గో॥ గోపయ్య

ఈ ప్లీడరొకరు దాపరించి యిలా వ్యాజ్యాలు వేయి స్తాడని మేము కలగన్నామా? ఇప్పటికయినా ముంచినదేము న్నదిలే? హైకోర్టువరకు మేము డబ్బుపెట్టి పోరాడితే, డబ్బు డుబ్బులేని యీపంచములేమినిగ్గుతారుమాతో?

క॥ సుబ్బయ్య

డబ్బున్నదిగదాయని మురియకుము. స్నేహితుడా, ఈ బసవలింగయ్య సత్తా నీకు తెలియదు. బెజవాడ జాయింటు మేజస్ట్రేటుకోర్టులో, బందరు మేజస్ట్రేటు కోర్టులందేగాక మద్రాసు హైకోర్టులోగూడ, అసమానమగు సమర్థతతో పంచములతరపున వాదించగలడు. నిద్రాహారములు లేకుండా స్వసంఘోద్ధరణకై కృషిచేయగలడు. మీకిప్పటికే ఆరువేల రూపాయలు వ్యయమయినవిగదా! పంచములకు రెండు వందలుకూడ కాలేదు. కాంగ్రెసువాళ్లు మా రామస్వామి వాళ్ళతరఫుననే కలరుసుమా!

గొ॥ గోపయ్య

స్వసంఘ విధ్వంసకులు మీరామస్వామి మొతావాళ్లు. వాళ్లలో చేరబట్టియే మనకమ్మారికీ ముప్పువచ్చింది. లేక పోతే యీ అలగావాళ్ళ నొక్క-దెబ్బకు మాపాదాలవద్దకు తీసుకురా లేకపోయెడివాళ్ళమా?

కి॥ సుబ్బయ్య

మీరుచెప్పే ఆలోచన బాగుంది లెండి! దూరదర్శకు లయిన ఆ రామస్వామిగారు, వారి నాయనగారు అంత మాత్రము పంచములయెడ సానుభూతి చూపెట్టుచుండడం చేతనే యింతవరకయిన పంచములు కమ్మవా రందరిమీద కత్తిమెత్తకుండాయున్నారు. లేకపోతే కమ్మారందరు దుర్మార్గులు, కఠోరకులు. వారినందరిని ధ్వంసము చేయవలసిందేనని ప్రతిజ్ఞ పట్టెడివారే!

రామవరపుపాడు రాఘవయ్య

మీ రెంత సేపున్న కమ్మవారిని గురించేమాట్లాడుతారే! పంచములతో పోరాటము కమ్మవా రొక్క-రికనియేనా మీ ఆలోచన? కమ్మవారికిమాత్రమే పంచముల నూతన ఉద్యమము అయిష్టమనుకొన్నచో మీ రెంతయుపొరపడుచున్నారు. కొండూరులోని కలాలీలు, కొండపల్లి వైశ్యులు, గొల్లపల్లి యాదవులు, కొండూరు రెడ్లు అందరు పంచముల నెదిరించుచున్నారుగదా! ఇది రయితులకు పంచములకువచ్చిన తగాదా

గాని కమ్మవారొక్కరికే సంబంధించినదికాదు. పైగా మంత్రాంగవేత్తలగు బ్రాహ్మణులు అన్నిచోటులందు రయితు లను పెడత్రోవల దీయుచున్నారని మరువరాదు.

కిలారి సుబ్బయ్య

నిజమే! యీమార్పు నంగీకరింతాము. ఈప్రాంతపు రయితులలో హెచ్చుమంది కమ్మవారవడంచేత, రయితులన డానికి బదులు కమ్మవారంటున్నాముగాని న్యాయతః పై కులాలవారనుట యుక్తమని అంగీకరిస్తాను.

ఇంతలో పునాదిపాడు వెంకయ్యగారి కుమారుడు పేటంచు ధోవతీ, పొందూరు నూరోనంబరు జరీవుత్తరీయం పట్టుషర్టుతో తములము సేవిస్తూ ఘుమ ఘుమ వాసనలతో వచ్చి వీరందరిమధ్య కూర్చొని "ఏమిటిరా? - సుబ్బయ్యా! యేవో ప్రగల్భాలుకొట్టుతున్నావే? నీకెప్పుడూ ఆనిర్భాగ్యులు రామస్వామి, యల్లమందలగూర్చి పొగడడమే పరిపాటై పోయింది. ఈ మాలవాళ్ళను మనయిండ్లలోనికిగూడ తెచ్చి పెట్టి మనకు వాళ్ళనే గురువులుగా చేసేటట్లున్నారు. మీరీ యింగ్లీషు చదువుచదివి" అన్నాడు.

రా॥ రాఘవయ్య

ఏమండోవ్! మీ బోటివారుకూడా, మానిర్భాగ్యుల బలపరచి కోర్టులకెక్కడం మంచిదంటుంటే మావాళ్ళెంత పిచ్చిపని చేసియున్నారోయని భయముకల్గుచున్నదండీ!

మాధవయ్య

ఓహో ! ఏమోయి ! స్కూలుఫైనలు మిణికావో లేదో, యింత అహంకారమా నీకు ! ఇటువంటి పిరికిపందలు కాబట్టే మీరామవరప్పాడు వాళ్ళనందరిని చుట్టబెట్టి ఆమాల వాళ్ళు కొట్టారు.

గో॥ గోపయ్య

తూలుతూ పడుతూ వేషాలు వేసుకొనేవాళ్ళు కూడా మమ్ము యెగతాళి చేయవద్దులెండి. వ్యవహారము సరీగాజరిగితే మీబావగారు అడ్డమురాకుంటే మేము యీఅలగావాళ్ళను చరిచికొట్టేవాళ్ళమో లేదో తెలిసేది. ఈ మాటలకేమిగానండి ! మీరు ఆ పుష్పావతికి సెలవు చెప్పినారా ! లేదా ?

శృతిమించి రాగాన పడేలాగుంది వ్యవహారమని మెరిగ మిడిగుడ్లు చేస్తున్న మాధవయ్య వైఖరినిబట్టి కనుగొని కిలారి సుబ్బయ్య "మాధవయ్యగారూ ! మాలైబ్రరీలో క్రొత్తగా యీగండికోట భవనాన్ని నిర్మించుట కత్యంతశ్రమపడి కమ్మసంఘ సేవజేసిన శ్రీయుత కొవెలమూడి గోపాలకృష్ణయ్యగారి ఛాయాపటము నీమధ్య తెరచినాము. మీరు చూచినారా ? లేదు. రండి దర్శించుదురుగాని. రండోయి ! కుర్రవాళ్ళందరూ ! పునాదిపాడు షావుకారునకీ మహాశయుని పటమును చూపెట్టుదాము. అని వెలుపలికి తీసుకొని వచ్చి లైబ్రరీలో వ్రేలాడుతూవున్న పటమును జూపెట్టాను. అందరికి ఆజానుబాహుడై గంభీరమగు ముఖవర్చస్సు కల్గి

పట్టుదల కార్యశూరతసూచించు కండ్లు పెదవులగల్గియున్న ఆ గోపాలకృష్ణుని చిత్రపటమును జూచినంతనే ఆనందము అత్మాభిమానము కల్గింది. పటమును జూచినపిమ్మట గ్రంథాలయమందున్న పటముల పరీక్షిస్తూ కొంతకాలము జరిపి, యింతలో భోజనానికి వేళయిందిగనుక అందరు కిచెన్ హాలుకు వెళ్లారు.

మరునాడు (అనగా 1927 సం॥ ఫిబ్రవరి 16 తేది) కోర్టునందు విచారింపబడుచున్న గొల్లపూడి రామవరప్పాడు కొండూరు గ్రామముల రయటంగు కేసులు వాయిదా వేయబడుటవలన కమ్మవారి నాయకులు వారి మిత్రులు ఆతుకూరు కొండూరు కవులూరు రయితులు గండికోట భవనమునకు సాయంత్రపు భోజనాలయినపిమ్మట పండుకొనుటకు వచ్చిరి. విద్యార్థులకు నాయకులయిన కి॥ సుబ్బయ్య గొ॥ గోపయ్య వారందరికి కాళ్ళుకడుగుకొనుటకు నీళ్ళిప్పించి పండుకొనుటకు మూడుగదులు ఖాళీచేయించి చాపలువేయించి సత్కారము చేసిరి. వెన్నెల గాయుచున్నందున కొంతసేపు లోపలి యావరణమందు అందరు ముచ్చటలాడుకొనుచూ కూర్చుండిరి.

కి॥ సుబ్బయ్య

ఏమండీ కేసులవైఖరి ఎలావున్నది.

రామవరప్పాడు సుఖవాసి వీరయ్య

వైఖరి కేమున్నది! ఆబసవలింగయ్య మాసాక్షుల నందరిని కక్కిరిబిక్కిరిగా చేసివేసినాడు. ఒకటి చెప్పబోయి

మరొకటి చెప్పి మాసాక్షులందరు కేసు పాడుచేశారు. కలె క్టరుగారు త్వరలోనే కేసు పూర్తిచేయవలెనను పంతము మీద ఉన్నారు. ఈ దినపు ఆయనమాటలు చేష్టలు ప్రశ్నల బట్టి చూస్తే మనకే వాతపెట్టేటట్లున్నాడు.

గో॥ గోపయ్య

ఒకవేళ శిక్షవేస్తే ఎంతకాలంవరకు

సు॥ వీరయ్య

ఎంతకాలంగాకేమి! అధమము రెండు సంవత్సరాలు.

కి॥ సుబ్బయ్య

పంచముల కేసేమిటి? వారిసాక్షులందరు పూర్తియై నారా?

సు॥ వీరయ్య

ఆహా! వారిసాక్షులందరిచేత బసవలింగయ్య యెంత అద్భుతంగా సాక్ష్యంచెప్పించినాడనుకున్నారు! అసలు ఇంతకు న్యాయము వాళ్ళప్రక్కనున్నదిలెండి!

సు॥ కోటయ్య

పెత్తందారులెప్పుడూ ఇట్లా అవకతవకగా మాట్లాడు తూవుంటేనే మనకేసంతా అధ్వానమైపోయింది. ఇంత చేత కానివాళ్ళు ఆనాడు పోట్లాట యెందుకుపెట్టుకోవలసివచ్చింది? నోరు వాయిలేనివాళ్ళం మేము కావాలన్నామా?

సు॥ వీరయ్య

చూశారా! ఇవ్వి ప్రక్క-పోట్లంటే! ఇప్పుడిట్లా, అప్పు డేమో తన్ను కొట్టు చీల్చు చంపు అని కేకలు. వీళ్ళనోళ్ళకు తాళాలువేసేవాళ్లుంటేగా! నేనప్పుడే చెప్పాను. ఒరే ఎందు కురా తానుచెడ్డకోతి వనమెల్ల చెరుపుతుందన్నట్లు కేసుల్లో దిగిన గొల్లపూడివారు కొండూరువారు మనకుకూడా వాళ్ళ చిలుమే పులుముటకు పూనుకున్నారురా! త్వరపడకండి" అని. ముసలివాళ్ళమాటలు యీ కుర్రవాళ్ళువింటేనా! తస్సాయ్ బుస్సాయ్ అని వెనుకా ముందు చూడకుండా కాలము మారిం దని తెలుసుకోకుండా యీకాడికి తెచ్చారు! మామర్యాద.

కపులూరు వాసిరెడ్డి సుబ్బారాయుడు

వీరయ్యగారూ! గతించిపోయినదానికి విచారపడితే ఏమిలాభము? ఈ రయితుల నేదో యొకవిధంగా వంగదీస్తేనే కాని మేమీవూళ్ళల్లో ఉండలేమో" యని పంచములు అదే పనిగా మొరపెట్టుకుంటూ వారిశరీరములమీదనున్న వాతలు మచ్చలు కలెక్టరుగారికి చూపెట్టుతూ వుంటే ఆయనకళ్ళు రక్తకణములయినవే! మనకిక శిక్ష తప్పుతుందంటరా?

కొండూరు ధారా సూరిశాస్త్రి

ఇప్పటికి ఆరుమార్లు రిమాండులోనికి పోవడం హైకోర్టు వరకు పిటీషన్లు పెట్టుకొని జామీనుమీద విడుదలకావడం జరిగింది. మునిగినవాళ్ళము మునగనేమునిగాము. సరేనంటూరా

కేసు సాంతమయ్యేదాక వెళ్ళుదాము. లేదంటారా ఆ రామ స్వామిగారు చెప్పిన సలహానుసరించి రాజీచేసుకొందాము.

గో॥ గోపయ్య

శిక్షపడడం తప్పనట్లుంటే రాజీయే మంచిదనుకుంటా!

వా॥ సుబ్బారాయుడు

శిక్షతప్పేదెట్లా? అబ్బాయి! మనము వాళ్ళనుకొట్టి నట్లు రుజువయింది. మనవారిలో ఒక్కరికైనా బలమైన గాయాలు తగలలేదాయెను? పైగా దెబ్బలుతిన్నవాళ్ళ నందరిని బెజవాడలోను కొండపల్లిలోను పదిరోజులు కొట్లో అన్యాయంగా లాకప్పులో ఉంచారని సబ్ ఇన్స్పెక్టర్ల నిద్దరిని సస్పెండుచేశారు. వాళ్లుకోరినకోర్కెలు న్యాయసమ్మతమైనవి, రయితులు తమ గౌరవమునకు భంగములేకుండా అంగీకరింప దగినవని మాగాణిప్రాంతపు రయితులే సాక్ష్యమిచ్చారు. ఆచా రమునకు విరుద్ధమని మనము రుజువుచేయలేకపోతిమి. ధనము బలగము మనకున్నట్లు అనాథలు అసహాయులు వారయినట్లు కన్పడుచుండెను. పైగా యీకలెక్టరు క్రొత్తగా ఇంగ్లండునుండి వచ్చినాడట. ఆదేశములో కూలివాళ్ళపార్టీకి చెందినవాడట. మన పూర్వాచారాలంటే మండిపడుతాడట. మనవాళ్ళ కెవ్వరికి కోపమురాకుంటే రాజీ ప్రయత్నముమీదనే వుండా మనీ నా సలహా.

సు॥ వీరయ్య

సూరిశాస్త్రిగారూ! రామస్వామిగారితో మీరు మాట్లాడితిరిగదా రాజీషరతుగురించి యేమిచెప్పినాడు?

## సూరిశాస్త్రి

మనము పంచములయెడ అన్యాయము చేసినందులకు విచారము తెలుపుట ఒకషరతు. రెండవది తగులబడిపోయిన వారి ఇండ్లను తిరిగి కట్టుకొనుటకగు ఖర్చులనిచ్చుట. మూడవది యీ వివాదములందు పాల్గొన్న పాలేరుల నందరికి తిరిగి యేభేదభావము చూపక యేర్పాటుచేసికొని నాగాదినములకు కూడ జీతభత్యములిచ్చుట. నాల్గవది వారుకోరిన సాంఘిక హక్కులను ప్రసాదించుట. ఐదవది ఇకముందెన్నడు వారిని హింసించమనుటకు ధరావతుగా పెద్దమనుష్యులవద్దగాని కోర్టులోగాని ఊరికొక వేయి రూపాయలుంచుట. ఆరవది తమ తరపున వాదించిన న్యాయవాదికి వేయిరూపాలు ఫీజునిచ్చుట. నాకుమాత్రము యీ చివర రెండు షరతులు నచ్చలేదు. మనయందేమాత్రము నమ్మకములేనివాళ్ళతో రాజీ యెట్లా పొసగునని రామస్వామిగారితో అన్నాను. ఆయన "నిజమేకానండీ మీవారిలో మొరటుతనముగ వెనుకటికాలపు రోషము ద్వేషము పెట్టుకొని తుదకు మహాత్ముని మాటయినా వినకుండా కర్రలు తీసుకొని పైనబడేవాళ్లు చాలామంది యున్నారే" అనిరి. మీరు దయతో యీ విషయముగూర్చి మరల ఆలోచింపవలసియుండునని వారిని కోరాను. తరువాత ప్లీడరయితే రయితుల కేసును ధ్వంసముచేసి రాజీ తప్పనిసరి చేయుచున్నాడో అతనికే రయితులు ఫీజు యివ్వమనుట

ధర్మమా"అని ప్రశ్నించాను. దానికి రామస్వామిగారు మంద హాసముచేస్తూ "శాస్త్రిగారూ! మీరుగూడ యింత సంకుచితముగా మాట్లాడితే యెట్లా? ఈ కేసు లేకున్నట్లయితే అధమము రెండువేల రూపాయలయినా యీ నాలుగు నెలలో సంపాదించుకునేవాడేగదా! మీమూలాన నాలుగు దమ్మిడీలు సంపాదించుకొనడానికి బదులు తనడబ్బే నాలుగువందలవరకు ఖర్చుపెట్టుకున్నాడే! మనము పంచములయెడ అన్యాయము చేసి తుదకు వారికి రక్షకుడయినవానికి తిండికిలేకుండా చేయడం న్యాయమా!" అన్నాడు.

సు॥ కోటయ్య

బాగుంది! యీబ్రాహ్మణుడు మాకు సలహాజెప్పితే మేము దానినివింటే మాకొంపలు కూలినవన్నమాటే. ఈయన వాళ్ళవద్ద, మావద్ద మింగడం లేదుగద. ఇంత బ్రతుకు బ్రతికి క్షమించమని మాలవాళ్లకాళ్లు పట్టుకోవడమా? అదీచాలక యిళ్లుకట్టిపెట్టాలా! అంతటితో పోక బాండులువ్రాసి యివ్వాలా? మేము దొమ్మరవాళ్ళమా దొంగదోపిడివాళ్లమా! బాండులు వ్రాసియివ్వడానికి. పైగా ఆనాలుగు నాలుకలవాడు కండ్లకావరముబట్టి అగౌరవముగా కమ్మవారిని కోర్టులకీడ్చే ఆ లింగడికి వేయిరూపాయలు కట్టిపెట్టాలా? ఏమిశాస్త్రివయ్యా నీవు? చాలు! చాలులే! ఇక మీవూరుపోయి పంచాగం చెప్పుకో.

సు॥ పీరయ్య

శాస్త్రిగారూ! ఈ మొద్దు సన్యాసులు యెప్పుడూ యిట్టే. మందు వెనుక మంచిచెడ్డ తెలియకుండా అరుస్తూ వుంటారు. పొలానపాటడి గట్టునకావుండి పశువుల బీట్లోకి తోలి కోపమొచ్చినప్పుడు అడ్డంగాపెట్టి నాల్గుదెబ్బలు చచ్చే టట్లుగా భార్యయైనది, బిడ్డయైనది, కాపు, పాలేరు, కూలీ లైనది తెలియకుండా కొట్టే యిట్టివాళ్లుండబట్టే మాకీగతి పట్టింది. ఎప్పుడయినా రయితులిట్లా కోర్టుల్లోపడి నలుగురిలో నామూషీకలుగునట్లు క్రిమినలు కోర్టులచుట్టూ తిరగడం సంభ వించిందా?

సుబ్బారాయుడు

అయిదోషరుతు అనగా ధరావతు మినహా మిగతా అన్నిషరతులకు మనమొప్పుకోవడమే ఉపయోగము. నేనిది వరకు విన్నదానినిబట్టిచూస్తే రామస్వామిగారు యల్లమంద గారు పంచముల నందరిని ఒకదారికి తీసుకొనివచ్చి కొంచెము చూచాయగా పోవడమే మంచిదని సలహాచెప్పినట్లు తోస్తు న్నది. మనమెన్ని అనుకున్నా యల్లమందరెడ్డి రామస్వామి కమ్మ వారికిమాత్రము తమసంఘీయులు గౌరవముగా బయట పడవలెనని ఆతురతయుండదా?

గో॥ గోవయ్య

పంచములందరికి ఒక్కొక్కరిగాపిల్చి మనము క్షమా ర్పణ చెప్పాలనా? అట్లయితే మనమెట్లొప్పుకొనగలము?

సు॥ వీరయ్య

ఎందుకయ్యా మనందరితరపున యేయొక్కరో వారి నాయకునకు మనవాళ్లు వాళ్లుచేరియున్నప్పుడే మర్యాదగా జరిగి పోయినదానిని గురించి మరచిపోదాము. ఇకముందు మన గ్రామములందు సోదరులుగానే మెలగుచూయుందాము అంటే చాలదూ? ఏమంటావు శాస్త్రీ? మీాయభిప్రాయ మేమయ్యా? సుబ్బయ్యా!

వారిద్దరూ "అవును అట్లంటే చాలు" అన్నారు. ఇంతలో రొప్పుచూ రోజుచూ గొట్టిపాటి క్రిష్ణయ్య (గొల్ల పూడి)వచ్చి సు॥ వీరయ్యగారి నటుపిలిచి చెవిలో యేమేమో చెప్పాడు. తిరిగి వచ్చినపిదప కృష్ణయ్యగారు అందరి నుద్దే శించి క్లబ్బులో మన ప్లీడరుగారు కలెక్టరుగారిని కలుసు కున్నారు. అప్పుడు యేమండీ ఇంతటి పనికిరానికేసు తీసు కున్నారేమి? నీయందెంత మక్కువ నాకున్నా నీకు సహాయము చేయజాలననుకొందు. రాజీచేసుకుంటే మంచిదన్నారని ప్లీడరు గారు నాకుచెప్పారు అన్నాడు.

కి॥ సుబ్బయ్య

ఏమండో! యీామాట తెల్లవారేసరికి వారికి తప్పక తెలుస్తుంది. అప్పుడు రాజీషరతులు హెచ్చిపోతవి. ఇప్పుడే త్వరపడి రామస్వామిగారిని యల్లమందగారిని కలుసుకొని పరిష్కారం చేసుకోవడం మంచిది.

సు॥ కోటయ్య

నిజమేనండీ ! గౌరవమూ అగౌరవమూ తరువాత చూచుకుందాము. ముందు రాజీచేయించండీ ! పీడాకరపు జైలుకెందులకు వెళ్ళడం. మొన్నటి నాలుగు రోజులందు కుండలు మెత్తివేయడం చుట్టలేకుండడం ఆవార్డరు సవాళ్ళకు లొంగియుండడం రాత్రింబవళ్ళు ఆబోనుల్లో ఈగలు దోమలు నల్లులచే పీడింపబడుతూయుండడం అంత యమబాధయింది. అబ్బో ఆబాధ మళ్లాపడలేము. కావాలంటే ఆ వెయ్యిరూపాయలకు నోటు వ్రాసిద్దాం.

గో॥ గోపయ్య

కిలారి సుబ్బయ్య, మిగతా విద్యార్థులందరు యీ కోటయ్య పలిటీలుచూచి ఆశ్చర్యపడి పొట్టలుబ్బ నవ్వవస్తూ వున్నప్పటికీ అపుకొంటున్నారు. సుబ్బారాయుడు సుఖవాసి వీరయ్య సూరిశాస్త్రి రామస్వామిగారి మకామునకు తమ ప్లీడరుతో వెళ్ళి అచటికి బసవలింగయ్యను పిలిపించి రాజీషరతులు మాట్లాడుకొన ప్రారంభించారు.

రయితుల ప్లీడరు

బసవలింగయ్యగారూ! తమ స్నేహితులు శ్రీరామస్వామిగారు మావారితో కొన్ని రాజీషరతులు మాట్లాడినారట. వాటినన్నిటిని మార్పులులేకుండా మావారిని యొప్పుకొమ్మంటే అది రాజీగాదుగదా? మా సూరిశాస్త్రిగారేవో

కొన్ని అభ్యంతరాలు చూపెట్టి మిమ్ములను కనుక్కో మన్నా రట. మీరావిషయాలను గురించి ఆలోచించారా?

బసవలింగయ్య

ఆహా! ఆలోచించ కేమి? ధరావతుమాత్రము యివ్వక పోతే రాజీయెట్లాకుదురుతుందండీ? మీకు యింట్లు యెంతబీద వాళ్లో అనాథలో మీకు తెలియనిదేమండీ?

సూరిశాస్త్రిగారు

క్షమించండి మధ్యమాట్లాడినందులకు. "తక్కువేమి మనకూ రాముండొక్కడుండువరకూ" అన్నట్లు బసవలింగయ్య గారున్నంతవరకు పంచములకు బలమునకు ధైర్యానికి కొదువ కలుగుతుందా?

బసవలింగయ్య

మీరయితుపెద్దలందరు "భద్రము" అని అభయ హస్తమిచ్చి మా వేల్పూరు పెద్దకాపుగారి కుమారులు రయితునాయకులునగు యీ రామస్వామిగారికి మీమాట యిస్తే చాలునని వారంటేగాని నేను మావాళ్ళకు సలహా యివ్వజాలను.

సు॥ వీరయ్య సుబ్బారాయుడుగారలు రామస్వామి గారి చేతులుపట్టుకొని "నాయనా! మావరువుకాపాడవా? నీకు బాధ్యులమై యుంటాము. తప్పక మీసలహాలేనిది యే వ్యవహారముచేయము. మాకీ బెడదను తప్పింపుము" అని

ప్రార్థించారు. యల్లమందగారువచ్చి "రామస్వామీ బసవలింగయ్యగారూ మిమ్ములను పంచముల ముత్తైదువులు ఆరుగురు వెంటనే చూడాలని చాలసేపటినుండి కనిపెట్టుకొనియున్నారు. వారికి నిద్రపోయే వేళ మించిపోతున్నది. దయతో రెండునిమిషాలు వారితో మాట్లాడి తిరిగి రావాలనినా కోరిక" అన్నాడు. అంతట రామస్వామి బసవలింగయ్యా లోపలి గదిలోకి వెళ్ళారు.

సు॥ వీరయ్యా

నాయనా! యల్లమందా! నీసాటి రయితులు కమ్మవారు కాపులు రెడ్లు యీవిధంగా బెజవాడ వీథులలోబడి అలమటిస్తుంటే యేవిధమైన సహాయం చేయకుండా ఉండడం భావ్యమేనా?

యల్లమంద

నాయనగారూ! మీరట్లనడం ధర్మంగాదు. నేనూ రామస్వామి బసవలింగయ్యా లేనట్లయితే ధనమూ భూమి గొడ్లు లేని యీ పంచములు యిప్పటికెప్పుడో తెగించి మీ గ్రామాలమీదబడి మీవారినందరిని ఐపులేకుండా చేసేవాళ్లే. లొంగియున్నంతవరకు వెనుకటి ఆచారాల ననుసరించి పెద్ద చిన్నయను భేదముల గమనించి మన్నుదిన్న పెంజేరులువలె యున్నంతవరకు సరిపోయిందిగాని వాళ్ళు తెగించి తిరగబడితే వాళ్ళకున్న మూర్ఖత ఆలోచనారాహిత్యము ప్రాణముపై నిరాశ రక్తకాంక్ష మరెవరికిగలదు? పాపము వాళ్ళకు

చదువా? కట్టుబాటులా? నాయకులా? సన్మార్గమున ఉంచుట కెవ్వారుగలరు? అసలు తాడు బొంగరము లేనివాళ్ళతో పోట్లాట పెట్టుకోవడమే తప్పుగదా!

సుబ్బారాయుడు

నిజమేనండీ! ఏదో పొరపాటైనది. గ్రహచారంచాలక త్వరపడ్డాం. ఇప్పుడేదో యుపాయముగా గట్టెక్కించేవిధం చూడండి.

యల్లమంద

ఈపెద్దముత్తైదువే అటో యిటో తేల్చాల. ఈనాల్గు రోజులనుండి "రాజీ రాజీ" అని గోలపెట్టుతున్నారు. వాళ్లు వీళ్ళనందరినిపిలిపించి మీ మీ గ్రామాదుల రైతుల యువతీ మణులు పండుగపబ్బములకు జరుపుకొన్న మర్యాదలు, పెండ్లి పేరంటములకిచ్చిన బహుమతులు, కరవుకాటకములం దందించుకొన్న సహాయసంపత్తులువీనిగూర్చి జ్ఞప్తికిదెచ్చి తమవారిని జైలునుండి కాపాడుభారము మాతంగులు మాలమాదిగ పేరంటాండ్రపై యున్నదని కళ్ళనీరు పెట్టుకొని చెప్పినారట. వీళ్ళు ప్రతిదినం తమపెత్తందారులతో అదేపనిగా పోరుసల్పుతున్నారు. మీరుకొట్లల్లోనికి పోయినామానెకాని మన ఆసాములను మనకన్ని సహాయములచేసిన రయితులను మాతో కలసిమెలసి పొలాలలో లక్ష్మిదేవతలవలె పాటలుపాడుతూ సరసాలాడుతూ పనిజేస్తున్న రయితుల ఆడంగులందరికి గోడు కల్గించి జైలుకుపంపించడం మాకిష్టములేదని పంతంబట్టారు.

ప్లీడరుగారివద్దకు తమ్ము తీసుకొని వెళ్లవలసినదనీ నన్నెంత బ్రతిమాలినను పంచముల పెత్తందారులు ప్లీడరుగారికి వీళ్ళను జూపెట్టితే ఆయన మెత్తపడతాడను భయముతో తీసుకొని వెళ్ళవద్దని ప్రార్థించారు. ఈ సాయంత్రిం తమ పెద్దలందరు "రయితులకిక శిక్షతప్పదు" అని చెప్పుకోవడం విన్నారు. ఈ సాయంత్రిము భోజనమైనా చేయక "మీరు మమ్మెట్లా నైనాగాని ప్లీడరుగారిదగ్గరకు తీసుకువెళ్లాలనని" పంతముతో యీ గడపప్రక్కనే కూర్చునియున్నారు. మీ రెవ్వరైతే రాజీ మాట్లాడడానికి వచ్చారో సరియగు సమయము వచ్చిందనుకొని వారిద్దరిని ఆ సాధ్వీమతల్లులవద్దకు పంపించాను.

సుబ్బారాయుడు

వాళ్ళలో గంగమ్మ ఉన్నదా?

వీరయ్య— రోశమ్మ ?

సూరిశాస్త్రి— భాగ్యం ?

యల్లమంద

ఆహా! ఆముగ్గురున్నారు. ఇంకొక ముగ్గురున్నారు కూడా. ఇంతలో పంచముల ముత్తైదువలతో బసవలింగయ్య, రామస్వామి గదిలోనికి వచ్చారు. ముత్తైదువలందరు సుబ్బారాయుడు, సూరిశాస్త్రి, వీరయ్యగారలకు వంగి నమస్కారాలు పెట్టారు. వారిముందు తాను కూర్చొనజాలక బసవలింగయ్య రైతుల నుద్దేశించి, "అయ్యా! ఈ నాపిన తల్లులందరూ మీ కేసును యేవిధముగానైన యెత్తివేసుకో

వలసిందేనని నిరాహారదీక్షబట్టి బలవంతపరుస్తున్నారు. మాకే హక్కులువద్దు. మారైతులు, వారిపేరంటాండ్రు పసుపు కుంకముతో సుఖంగాఉంటే చాలునని వీరు కోరుతున్నారు. మీకు యికముందెప్పుడైనా రైతులు బాధపెట్టుతారేమో యను భయములేదా! యని నేనడిగితే కర్మముచాలక దిన మల్లా మమ్ములను కసరినారేకాని లేకపోతే మారయితుల నుండి మాకేమి భయమున్నదండీ! అన్నారు. ఇట్టి ప్రేమ, భక్తి విశ్వాసమును మీకూలీల భార్యలనుండి మీఆడంగులు సంపాదించినందులకు నాకెంతో ఆశ్చర్యము కలుగుతూఉంది. మీస్త్రీలెంతయు పుణ్యాత్ములనుకుంటాను. అయ్యా! రామ స్వామిగారూ! మీరే యిక రాజీషరతులను తేల్చండి. నా అభ్యంతర మేమాత్రము లేదుసుమండీ! అమ్మా! మనము లోనికి వెళ్లుదామా? మీరిక భోజనంచేయవచ్చును, అన్నాడు. పరమసంతోషంతో తలలువంచుకొని ఆ స్త్రీలు ముందు నడువ బసవలింగయ్య వారి వెన్నంటి లోనికి వెళ్లాడు.

రామస్వామి

ప్లీడరుగారూ! రైతునాయకులారా! ఘోషాలేని గ్రామాలందు రయితులస్త్రీలు యింత సమర్థులని వ్యవహార దక్షులని యోగ్యతకల్గిన యజమానురాండ్రని, పనివారి హృద యములజూరగొను కులదేవతలని యిదివరకెన్నడు యింత దృఢముగా తెలియలేదు సుమండీ. మా అమ్మగారున్నూ మన బసవలింగయ్య తండ్రి చెపుతూవుంటే ముసలివాళ్ళ ముచ్చట్లనుకొనేవాడను. బెజవాడకు పదిపరుగుల దూరంలో

భర్తలు అజ్ఞానకూపమునబడి అమర్యాద పాలవుతూవుంటే రైతాంగపు గౌరవమును నిలబెట్టగల స్త్రీలున్నారని యీదినం తెలుసుకొని ధన్యుడనైతిని. నా స్నేహితుడు బసవలింగయ్య గారుకూడ యీమీ రైతాంగస్త్రీల విషయమై విని, సమ్మో హితుడై ఐదారుఖండితము లవసరములేదని తన యుదారతను వెల్లడించాడు. మీరుకోర్టులో రేపు దేవునిముందు మాపంచ ముల నెప్పుడునూ కాపాడుచుందుము” అని ప్రమాణము చేస్తేచాలు. బసవలింగయ్యకు ఫీజుగూడ యివ్వనక్కరలే దన్నాడు.

రయితులు

అది యెట్లానండీ? బసవలింగయ్యగారికిగూడ మేము బాకీపడతామా? అని ఒక్కమారు పల్కారు.

సు॥ వీరయ్య

రామస్వామిగారూ! మీరు ముగ్గురు రయితులను, పంచముల నుద్ధరించడానికి పుట్టినారు. యల్లమందగారు తన స్వొంతసొమ్ము అయిదువందల రూపాయలు ఖర్చుపెట్టినట్లు తెలుస్తావుంది. మాప్లీడరుగారుకూడ యీకేసులో తనవలెనే బసవలింగయ్యగారుకూడ మూడువేలు సంపాదించుకునేవాడే యని చెప్పారు. తానొక వేయిరూపాయలు తక్కువగా పుచ్చుకుంటానని యిప్పుడే సెలవిచ్చాడు. కాన పదిహేను వందల రూపాయలు బసవలింగయ్యగారి కిచ్చెదములెండి.

మీరందరు మాకింత సహాయము చేసినందులకు కృతజ్ఞతా పూర్వక వందనాలు” అని చెప్పి సంతోషాంతరంగులై గండి కోట భవనానికి వెళ్లారు. తీర్మానము గూర్చియు జరిగిన యుదంతము గూర్చియు చెప్పేసరికి రయితులు, విద్యార్థు లందరు కరతాళధ్వనులుచేశారు. గోపయ్యను ఒక ప్రక్కకు పిలిచి, కి. సుబ్బయ్య “నీవన్నమాట నిజమేసుమా! మీప్రాంత పు స్త్రీలే సమర్థులును రయితులయొక్క గౌరవమును కాపాడ గలవారు” అన్నాడు. స్నేహితులిద్దరు పరమసంతోషం బొం దారు. మరునాడు కమ్మహాస్టలునందు గొప్ప విందుజరిగింది. రాత్రి రామభజన జరిగింది. ఆయాగ్రామా లన్నిటియందు దేవుని కారాధనలు జరిగినవి. శివరాత్రినాడు అన్నిగ్రామా లందు అన్నికులాలవారికి వనసంతర్పణ జరుపబడినది. దేవాల యములలోనికి అన్నికులాలవారు వెళ్లి శివుని ఆరాధించారు. ఆనాడు గ్రామస్థుల జూచినవారెవ్వరు కొలది మాసాలక్రితమే వారందరు రెండుముఠాలుగాయుండి ఒకరినొకరు లొంగదీయా లనే దీక్షాబద్ధులై యున్నారని అనుకొనజాలరు. రయితాంగ మునకు సాశ్వత యేర్పడింది. పంచమగూడెములు మానవులకు వాసయోగ్యములయినాయి.



# హరిజన నాయకుడు.

## ఎనిదవ ప్రకరణము.



రయిటింగు కేసు పరిష్కారమైన సంవత్సరానికి (అనగా 1928 సం॥ ఫిబ్రివరి మాసమునందు) రామస్వామి, యల్లమంద, బసవలింగయ్య, కొండపల్లి ప్రాంత్యములందు కాంగ్రెసు ప్రచారముచేస్తూ కవులూరునందు రెండు దినములు మకాం చేశారు. బసవలింగయ్య మాదిగపల్లెయందు, యల్లమంద రామస్వామి, కమ్మవారింటియందు బసచేశారు. విద్యానగరమందు క్రిస్తియను మిషనరీలు గొప్పవిద్యాలయమును వృత్తి విద్యా పరిశ్రమాలయమును విద్యార్థి వసతిగృహములను నిర్మించి చుట్టుపట్టు గ్రామములందుగల పంచములందరిని క్రీస్తుమతమందు చేర్చ ప్రచారము జేయుచున్నారని వినుటకెంతయు విచారించిరి. బసవలింగయ్య హిందూమతోద్ధారణ జేయుటకును పంచముల మతమును నిలబెట్టడానికిని పూనుకున్నాడు. ప్రతిగ్రామమందు తన యుపన్యాసమునందు పంచములు క్రీస్తియను మతమునందు చేరుటవలన కలుగులాభము లేమియు లేవనియు తానెట్లు క్రీస్తియను కావలెనని ఉత్సాహపడికూడా తుదకు సనాతనమయిన హిందుమతాన్నే ఆచరింప తీర్మానించుకొన్నట్లు తెలిపెను. క్రీస్తియనులుగా నుండుటవల

ననే ప్రభుత్వమువలనగాని ప్రజాసామాన్యమునుండిగాని ప్రత్యే కాదరము పొందుట సాధ్యమని నమ్మట పొరపాటనియు పంచములందరకు నచ్చజెప్పుచుండెను. తానుమాత్రము క్రీస్తి యనులుగా నున్నవారిని తిరిగి హిందూమతమునందు చేరమని ప్రోత్సహింపకున్నను ఆయన జీవితాదర్శములగాంచి ఆయన పంచములకు చేయుచున్న సేవను గమనించి క్రీస్తియనులుగా మారినను తీరని కష్టములను పోగొట్టి కల్గిన హక్కులను కలిగించిన యీ బసవలింగయ్యగారిని జూచి నూతనభావో ద్రేకులై తమ తాత ముత్తాతలవలె హిందూమతాచారముల నవలంబింపగోరి అనేక క్రీస్తియనులు తిరిగి హిందూమతము నందు చేర ప్రారంభించారు.

క్రీస్తియను మిషనరీలు బసవలింగయ్య ప్రభృతుల ప్రచారమును యేదోయొక నెపముపై ఆపుదలచేయవలెనని తెల్లవారగు కలెక్టరులను తమ్ముగాంచిన వణకు బెజవాడ ఉద్యోగస్తులనుజూచి సహాయముకోరి నిష్ఫలులయినారు. తాలూకాబోర్డులందు స్వరాజ్యము కొంతవరకయిన కలుగుట వలన పంచములయందు విద్యాభివృద్ధి కలిగించడానికి కలెక్టర్ల సహాయము బసవలింగయ్యకు అవసరమేలేకపోయింది. పై కులాలవారి సంపూర్ణసహకారమును సానునయంగా సంపా దించుటబట్టి సాధారణ సాంఘికహక్కులను సంపాదించడానికి కలెక్టర్ల సహాయము అగత్యముకాదయ్యెను. బసవలింగయ్యకు గాని తదితరులకుగాని ప్రభుత్వోద్యోగములుగాని బోర్డు

మెంబరు నామినేషనులుగాని అవసరము లేకపోబట్టి తెల్లవారి మీాద ఆధారపడడానికి అవసరములేదయ్యెను. ఇందువలన యేమిచేయుటకును తోచక రాచకీయనేరముచేసినాడను నెప ముపై బసవలింగయ్యను నిర్బంధించవలయునని మిషనరీలు కలెక్టరులు సమయమునకై వేచియుండిరి.

తనకు యేనాడో యుద్యోగస్థులు మిషనరీలవలన ముప్పువాటిల్లనున్నదని తెలుసుకొన్నను భయమేమాత్రమును పొందక దేశమునకై స్వసంఘముకొరకై మతమునకై అవసర మయితే కారాగారమునకైన పోవనిశ్చయించుకొనియే బసవ లింగయ్య తన ప్రచారమును సాగిస్తున్నాడు. రామస్వామి యల్లమందగార్ల నిప్పటికెప్పుడో పట్టుకొనవలసినది. అదను దొరకక యుద్యోగస్థులింకను వారిని స్వతంత్రముగా తిరగ నిస్తున్నారు. కొండపల్లి ప్రాంతపు గ్రామములందు యింకను ప్రజలు పూర్వాచార పరాయణులై సంకుచితాభిప్రాయులై దేశము, మతము అన్న హెచ్చుగా నుత్సాహవంతులు కాకున్నను యీా ముగ్గురు జాతీయయోధులు తమ ప్రచారము వలన ప్రజల కొకింత చురుకుదనము జాత్యోత్సాహము కలి గిస్తూయున్నారు.

కొండపల్లియందు ఉపన్యాసము చేసినపిమ్మట కోట చూచుతలంపున కాఫీ పుచ్చుకొని గ్రామనాయకులు నలుగురు భోజనపదార్థములు వెనుక తెప్పించుచుండ మన యోధులు కొండయెక్కారు. దారివెంట నీడనొసంగుచున్న తరుజొంప

ములచూచి ముచ్చటపడుచు రాళ్ళపై దుముకుతు అచ్చట చ్చట ప్రవహించు యేరులందు పాదములు ముఖములు కడుగు కొంటూ ఆచల్లని సలిలముల త్రాగుతు అత్యుత్సాహముగ అలసట నేమాత్రమును పొందకయే కోటచేరారు. బంగాళా యందు తినుబండారములుపెట్టి పాడుబడిన ముసలమానుల మహాలునుదర్శించి అందున్న పూర్వకాలపు సరస్సును జలక మాడుటకున్న తటాకమును సహజముగ యేర్పడిన జలధార లనుగాంచి సంతసమొందారు. ఆ తటాకముప్రక్కన నిలబడి మైళ్ళ పర్యంతము ఒకవంక బెజవాడ, మఱొకవంక కృష్ణానది ఆవలివంక కొల్లేరులగాంచి ఇట్టి హృదయానందకరమగు యీ భూభాగమందు గజపతుల సైన్యము మహమ్మదీయుల సిపా యీలు విజయనగరపు నాయకులు సంచారమొకప్పుడొన ర్చిరిగదా యని తలపోసి విరోధులు వచ్చుజాడలు కనుగొను టకు యెంత అనువగు కొండ యిదియని ఆశ్చర్యమొందారు. ఏనుగుల శాల చూచుటకు వెళ్ళి గబ్బిళముల కంపుతో అసహ్యముగానున్న ఆ విశాలమగు భవనమును చూచినంతనే విరాగులై యొకప్పుడు కోట తలుపులు భేదించగలిగి మహారాజులకుగూడ గొప్పతనము తెచ్చుచుండిన యేనుగు లకు నోచుకొనిన మహాల్ కానికాలమున గబ్బిలములకు నిలయమైనదిగదాయని విచారపడ్డారు. తిరిగివచ్చి శిథిలమై యున్న మహాలునందు నిలిచియున్న స్థంభములపైనున్న మూరిష్ పరిసియను పాలరాతి చిత్రములనుగాంచి అచ్చెరు వందారు. బసవలింగయ్య యీదృశ్యమంతా చూచినపిమ్మట

యున్నారని నిట్టూర్పువుచ్చి ప్రజాభ్యుదయము కొరక యితర మతముల పీడిస్తూ స్వార్థలాభముల కాంక్షించి స్వాత్మాభి మానమునే యభిలషించి దేశపు బాగోగులు చూడకుండిన రాజులు రథికులు నాయకులు సిపాయీలు తండోపతండము లుగ మనచరిత్రయందు మనదేశమునకు దాపరించుటవలననే గదా యిప్పటి దాస్యపు నిర్భాగ్యపు అవమానకరపు దుస్థితి కలిగినదని కండ్లవెంట నిప్పులుగ్రక్కుచు విసుగుకొన్నారు. అట్టి స్వార్థపరులు అసమర్థులు నగు రాజులు పోయి తుదకిట్టి యైక్యసామ్రాజ్యము సంప్రాప్తించుట లాభకరమే. మనకేగనుక కలయిక త్యాగశక్తి సుబుద్ధులుండుచో బ్రిటిషువారిని తరిమి వేయ గలుగుచో ఈ కొండపల్లి నవాబులువంటి నిర్భాగ్యులు వేలకువేలుగా దేశస్థుల పీడించి పిప్పిచేయుటకుమారు భారతీ యులకు ప్రజాపరిపాలనము ద్వారా స్వరాజ్యసిద్ధివలన భాగ్య భోగ్యములను తక్కువలేకుండా చేయగలము." అని రామ స్వామి చెప్పాడు. మీరెన్నిచెప్పినా యిట్టి కోటలు యింత తెలివితేటలతో యిట్టి ప్రదేశములందు కట్టుకొని కళాప్రదర్శ నమున లోపముచేయక మనవారొకప్పుడు రాజ్యముచేసిరను తలంపు మనకు స్వరాజ్యమునకు గల హక్కును బలపరచు చున్న" దని యల్లమంద పలికాడు. భోజనానంతరము కొండ మీదనున్న గంధపుచెట్ల సముదాయమును అడవుల ప్రభావ మును సెలయేరుల మర్మర ధ్వనులను కోయిలకూతను తదితర పక్షిజాలపు సంగీతమును విని మనసార ఆనందించి చెట్ల నీడ యందు పరుండి కూర్కొంచెందిరి. సాయంత్ర మగుచున్నతరి

బయలుదేరి యింటిదారిబట్టారు. కొంతదూరము వచ్చినపిదప చల్లచల్లగ సంభాషణ ప్రారంభించారు.

రామస్వామి

బసవలింగయ్యా ! అరుంధతీదేవి పై వారములో బెజవాడ వచ్చుచున్నదని నీకేమయినా వ్రాసినదా? కాన్వెంటు స్కూలునందు ఫస్టు అసిస్టెంటుకు అడ్వర్టైజు చేసినారట. ఆమె అప్లికేషను పెట్టితే యుద్యోగము వచ్చిచేరమని వ్రాసినారట. తనకొకయిల్లు కుదిర్చిపెట్టమని వ్రాసింది. నేనెట్లా యీ బెజవాడలో వచ్చే మూడుమాసములుండనుగదా! సుశీ నేనూ వయోజన విద్యాప్రచారము చేయడానికై గ్రామముల వెంట పోనున్నాము. పైగా యీ సైమన్ కమిషన్ బాయ్కట్టులో యెప్పుడు కారాగారమునకు పోవలసివచ్చునో! ఆమెను నాయింటియందే యుండమని అడుగుదామనుకుంటూవున్నాను నీయభిప్రాయమేమి?

బసవలింగయ్య

మనము యిప్పుడు చేస్తూయున్న హిందూమత ప్రచారము ఆమెకు యిష్టముండదేమో? తీరావచ్చి మీయింట్లో దిగినపిమ్మట మన ప్రచారముచూచి అసహ్యించుకొనునేమో? పైగా మీరు తిరిగి ఆయింట్లోనే యుండడానికి మీనాయనగారు ఒప్పుకుంటారా?

యల్లమంద

లింగయ్యగారూ! అరుంధతీదేవినిగూర్చికూడ మీరట్లు అనుమానగ్రస్థులై మాట్లాటతగునా! నేనామెను వై. యం. సి. ఎ. లో రెండుపన్యాసాలిచ్చుటకు వెళ్ళిన వారమునందు ప్రతిదినము కలుస్తూ యుండేవాడను. క్రిస్తియన్ పిల్లయైనా, మన ప్రచారమునెడ మనయుద్దేశ్యములుగూర్చి ఆపెకు యెంతో అభిమానము కలదుగదా! నీ కంటె నాకు ఆమెను గురించి హెచ్చు తెలుసునా?

బసవలింగయ్య

నాకీ క్రీస్తియనులను హెచ్చుగా చూచినకొలది దృఢమగుచున్న యభిప్రాయమేదనగా తమమతమే పరమ ఉత్తమమయినదనియు తదితరమతస్థులు కొంతవరకయినా పొరపాటు పడుచున్నారనియు నిండు నమ్మకములో నున్నారనీ తుదకు అరుంధతిగూడ ఒకటిరెండుమార్లు "మీరేగనుక క్రీస్తియనులయితే యెంత బాగుండేదోకదా" అన్నది. నామనస్సు చివుక్కుమన్నది. మనము మన మతస్తులందరు దేవుని ప్రేమిస్తూ సన్మార్గములోఉన్న చాలునని యాతురత జెందుచున్నాముకదా?

క్రీస్తియనులకు మహమ్మదీయుల కట్టి సహ్యాముండదు. మనకు అన్నిమతములవారు దేవుని జూచుటకై ప్రియత్నించుచున్నారను నమ్మకము కలదు. వారికట్లుగాక తదితరమతస్థులు అజ్ఞానాంధకారమునబడి బాధపడుచున్నారను భయముకలదు.

రామస్వామి

లింగయ్యా! నీవన్నమాట నిజమే! అరుంధతి యిన్నాళ్ళటివరకు బస్తీలందుండుటవలన క్రిస్తియనుల పరిసరములందే యుండి ఆమతస్థుల యహంకారమును పూర్తిగా పోగొట్టుకొనలేకున్నదేమో! బెజవాడకు వచ్చినపిమ్మటనైన హిందువులగు పంచముల జీవితము జూచినపిమ్మట తన యభిప్రాయము మార్చుకొనునని నానమ్మకము. ఇప్పటికి మూడు సంవత్సరాలనుండి మీరొకరినొకరు స్నేహితులుగా పరిగణించుకొంటున్నారుకదా! ఆమెకుకూడ పెండ్లియీడు జారిపోవుచున్నది. మీనాయన యింకా యెంతోకాలము బ్రతుకునట్లులేదు. ఆయన నీపెండ్లిచూచి పోవాలనని యెంతో కోరికపై యున్నాడు. అరుంధతికి నీకు యీడుజోడవునని నాకనిపిస్తుంది.

బసవలింగయ్య

నాయనా! నాకును యీ ఆలోచనలు లేకపోలేదు. కాని, అమె క్రిస్తియను, నేను హిందువుడ. లా ప్రకారము నే నామెను పెండ్లి చేసుకోవాలంటే ముందు క్రిస్తియనుగా మారాలి. ఆమె మాత్రము హిందూమతమున జేరుతుందను నమ్మకములేదు. భార్యకోసరము నా ప్రజలను, మతమును, వీడమంటావా?

యల్లమంద

మీరెందుకిట్లా మాట్లాడుకోవడం? క్రిస్తియను లందరు తమ మతముగూర్చి బహుతీవ్రముగా ఆలోచించుకొం

టున్నారా ! మన జనసామాన్య మెట్లామతమును సాధారణ జీవితమందు తలపెట్టకనే తమ సత్ప్రవర్తనద్వారా సంఘము నందు నడచుకొంటున్నారో అటులనే వారుకూడ సాధారణ ముగా మతముగూర్చి యాట్టె ఆలోచింపరనియే నానమ్మకము. నేను అరుంధతితో పెండ్లిమాట చూచాయిగా మాట్లాడాను. తనకు బీదవానిని చేసుకోవడానికి మొదటలో సందేహముగా యుండేదటకాని, తాను పరీక్షలందు త్తీర్ణతపొందిన తరువాత ఉద్యోగమేదేని సంపాదించుకొని బీదవానినైన పెండ్లిచేసుకొని ఆయనకు సాంఘికసేవ జేయడానికవకాశ మివ్వడానికి కోరికగా యున్నదని చెప్పింది.

రామస్వామి

ఐతే తనమతమును మార్చుకొనడాని కేయభ్యంతరము లేదని చెప్పినదా?

యెల్లమంద

నేనేమీ గట్టిగా చెప్పలేను కాని అభ్యంతరపెట్టుతుం దనుకోను. ఆమెకు మన బసవలింగయ్యగారియెడ అత్యంత అభిమానముకలదు. మనపంచములను అత్యుత్తమ హిందు వులుగా మార్చవలయునను మన ప్రయత్నము తనకెక్కుడు ప్రీతికరమని చెప్పింది.

రామస్వామి

సుశీకిమాత్రం ఆమెమీద చాలాగురి కుదిరింది. వారిద్దరు మద్రాసులో ఉన్నన్నాళ్లు అక్కచెల్లెండ్రులాగున

ముచ్చట్లు చెప్పుకొంటూ నాటకాలకు పోవుచూ సాంఘిక విషయాలు చర్చించుకొనుచుండెడివాళ్లు. అరుంధతీదేవివలెనే పంచములకు వన్నె దెస్తుందని సుశీ చెప్పింది. అందరితో బాటు మర్యాదగా నడచుకొనడానికై అట్లు పట్టణవేషము వేస్తున్నదికాని, మనగ్రామజీవితము వేషభాషలే ఆపెకెక్కువ ఇష్టమనిగూడ చెప్పింది.

బసవలింగయ్య

మీరిద్దరు నామేలుగూర్చి యింతవరకు యెంతో శ్రద్ధ జేస్తూవున్నారు. మీకుమించి నాకు కావలసిన స్నేహితులు కాని బంధువులుగాని లేరుగదా! దాచక అన్నివిషయాలు మీకు చెప్పుతాను. నాకుచాలాకాలమునుండి హృదయమున చాలా యాందోళనముగనేయున్నది. సాంఘికసేవకై పెండ్లి వద్దనుకొందు. మరల అరుంధతి జ్ఞాపకంవచ్చినప్పుడెల్ల పెండ్లి చేసుకోవాలనియే యుత్సాహాము కలుగుతుంది. ఆమెమతము గూర్చి తలంచుకొని నిరుత్సాహపడుచుందు. ఎవ్వరితో జెప్పుటకూ తోచక అమితమనోవేదనపడుతున్నాను.

రామస్వామి

లింగయ్యా! నాతో చెప్పుటకుకూడ యిన్నాళ్లు విచారించవలసివచ్చెనా? ఎంతపెత్తందారులైనా నీరహస్యాలను నేను దాచకూడదా?

బసవలింగయ్య

అట్లనరాదుసుమండీ! పెండ్లి ప్రేమ విషయములందు కొంచెము సిగ్గు సంకోచముండునుగదా! మాచెల్లి సుందరివలె నిర్భయంగా అందరము మాట్లాడలేముకదా! పైగా స్త్రీలు మనకంటె త్వరితంగా ఒకరి రహస్యాలు మరొకరికి తెలుపుకో గలరు.

యల్లమంద

రామస్వామీ! మేమెన్ని వ్యవహారాలు చేయనేర్చినా వంశపారంపర్యత పోదుగదా! నాతండ్రికి, గంగయ్యకు, మీ నాయన "పెద్దకాపు" గదా! సరే! నాకును, బసవలింగ య్యకు నీవు పెద్దకాపువు. సుశీలాదేవి "అమ్మి" కనుకనే బసవలింగయ్యకు పెండ్లి కుదుర్చుములే!

బసవలింగయ్య

మన వ్యవహారాలనన్నిటిని చక్కబెట్టడానికి యల్లమంద యుండగా తక్కువేమి రామస్వామిగారూ? తుదినాడు నా కన్ని చెప్పేపంపిస్తాడనుకుంటూ. యల్లమందగారూ! తాలూకా బోర్డులోకూడ నోరు లేనివాళ్ళతరఫున మీరే వ్యవహారము చేస్తున్నారు గదా! కొండదిగివచ్చి ఆరాత్రి కొండపల్లిలో నిద్రించారు.

మరునాడు తిరిగి కవులూరు వెళ్ళి వ్యవహారము ముగించుకొని సాయంత్రింవేళ కొండూరునకు బయలుదేరారు. ఊరి పెద్దలనేకులు కొంతవరకు వీరిని సాగనంపడానికి వచ్చారు. కవులూరు చెరువునందు సగభాగమునకే నీరున్నను తటాకము అత్యంతరమణీయముగా ఉంది. మునసబుగారి బాతులు అట్టె తలయెత్తి నాయకులజూస్తూ మా "అందము" జూడుడని వయ్యారముజేస్తూ సిగ్గుజెంది నీటియందు తలలు దాచుకొంటూ బహుశృంగారముగా నీటి అలలపై వుయ్యాలలూగుతూ వీరికిసంతోషము గల్గించెను. డొంక వెంట నడుస్తూ రయితుల బాగోగుల గూర్చియు భూముల వ్యత్యాసమును గురించియు మాట్లాడుకొంటూ రోడ్డు చేరారు. కవులూరు యువకులు ముగ్గురు, వీరిముగ్గురు వస్తువులు మోస్తున్న కూలీలిద్దరు యెనిమిదిమంది సాయంత్రం ఐదున్నరగంట లగుసరికి విద్యానగరము జేరారు.

దాదాపు లక్షున్నర రూపాయలు ఖర్చుపెట్టి కట్టించిన యీ భవనములగాంచి పేరాశ్చర్యపడ్డారు. రోడ్డునకొకప్రక్క ఉపాధ్యాయులు విద్యార్థులు నివసించు వసతిగృహాములు మరొకప్రక్క కర్మాగారములు పాఠశాలా భవనములు చర్చియు కట్టబడినవి. చర్చికి వందగజముల దూరమున ఒక గచ్చు భావియుకలదు. నీటిసప్లయికి పంపులమర్చబడియున్నవి. ఆ నగరనిర్మాణమునందు తెల్లవారు పెత్తనము జేసిననూ యిప్పుడీ పాఠశాలలను వసతిగృహాములను నడుపువారు భారతీయులే. వారందరూ క్రీస్తియనులయినను వారితాత ముత్తా

తలూ (కొందరి విషయమున తల్లిదండ్రులుకూడను) హిందు వులే. అందరు మాలమాదిగపల్లెనుండి బయటికివచ్చినవారే. యిప్పుడు వారిని జూచినవారేరును మాలమాదిగల సాంప్ర దాయమువారని చెప్పజాలరు. ఇటులనే తగు యవకాశము లున్న మన దీనజనులందరు అలగా ప్రజలందరు వృద్ధిబొందుట కవకాశముండునుగదా! యని రామస్వామిగారన్నారు.

యల్లమంద

మనకింత ధనవంతులున్నను ఒక్కరయిన యిట్టి మహా సంస్థను జిల్లాకొక్కటియయిన నేర్పరచిరా? ఏయే దేశముల నుండియో యీ క్రీస్తీయను మిషనరీలు వచ్చిన నల్లవాళ్ళ మయిన మన లాభముకొరకు యిన్నిలక్షల ధనమును వెచ్చించి యిట్టి క్రొత్తపద్ధతులద్వారా ముందు మార్గముల జూపుచుండ మన దేశస్థులై మతస్థులైయున్న పంచముల నుద్ధరించుటకింత వరకు మన ధనికులేమాత్రము శ్రద్ధదీసికొనకుండుటెంత విచార కరము?

కవులూరు యువకుడు

మీరంతదూరము వెళ్లుతున్నారుగాని మా కవులూరు ఆతుకూరు యీ కొండూరు రయితులు తమకింత దగ్గరలో యిట్టి మార్గదర్శకమయిన సంస్థయున్నప్పటికి పంచముల యభి వృద్ధికై తగు ప్రయత్నమేమయిన చేస్తున్నారా? నాయకులు మీరు పట్టుబట్టి భావులు చెరువులు దేవాలయములు పాఠ శాలలవరకు హక్కులను బలవంతపెట్టి వశపరచుకొనబట్టి

యింతమాత్రమయిన పంచములు అధమము హిందూమతస్థు
లని రయితులొప్పుకున్నారుగాని.

బసవలింగయ్య

ఈ పరాయి రాజ్యముపోయి స్వరాజ్యము వస్తేనేకాని
మన సాంఘికకట్టుబాటులు తగురీతి మార్చడానికి వీలుకలు
గదు. ఆర్థిక దీనావస్థయందు ప్రజ్ఞానకూపమందు దగుల్కొని
మూలుగుతూవున్న రయితులు పంచములకేమి సహాయము
చేయగలరు?

రామస్వామి

నీవెప్పుడును పరాయి ప్రభుత్వంచాటున దాగుంటావు.
అసలు మనవాళ్లు మంచివాళ్లైతే, స్వరాజ్యము రావడానికెంత
సేపు పట్టుతుంది. అలగావారను భేదముపోవడానికి కష్టపడవల
సిన యవసరముంటుందా ? అదుగో ! కొందూరు రయితులు
మనకెదురుగానేవచ్చారు. రాముని స్తంబముతో పంచములు
గూడ తయారుగానున్నారు. ఈవూరి మునసబు మంచి పలుకు
బడిగలవాడట. పంచములయెడ సానుభూతితోనే ప్రవర్తిస్తా
డట, అన్నాడు.

ఆయూరిలో ప్రచారమైన పిమ్మట బెడవాడ తిరిగి
వెళ్లాడు. అరుంధతీదేవి వచ్చేవరకచటనేయుండి, ఆమెను తన
భవనమందే ప్రవేశపెట్టి మునిసిపల్ చైర్మను, జాతీయనాయ
కులు, హైస్కూలు హెడ్‌మాష్టరు, సాంఘికసంస్కార నాయ

కులకు, పరిచయపరచి, అరుంధతీ గౌరవార్థంగా ఒక చిన్న టీపార్టీ నేర్పాటుచేసి, ఆమె స్కూలునకు పోయిరావడానికి ఒక జట్కా యేర్పరచి, రామస్వామి తన మిత్రునితో వేలూర్పారు వెళ్లాడు. బసవలింగయ్యమాత్రం వారమునకు రెండు మూడు మారులు రామస్వామి, యల్లమంద నెలకొకసారి ఆమెను చూచి, సత్కరించి పోతూవున్నారు. పాఠశాలలో ఆమెకు వసతిగానేయుంది. ఆరునెలల పర్యంతము జాతీయోద్యమ ప్రచారము చేసినపిమ్మట, ఒకవారంవరకు సేదదీర్చుకోడానికి వేలూర్పారునకు యల్లమంద, రామస్వామి వెళ్లారు. "అమ్మ" రామస్వామికి భోజనంపెట్టి మాటలసందడిన "అబ్బాయీ! మద్రాసునుండి యెవరో కిరాస్తానీఅమ్మాయిని మన బసవ లింగయ్యకు పెండ్లిచేయడానికి రప్పించావట నిజమేనా? అన్నది. లే దత్తయ్యా! బెజవాడలో యుద్యోగం చేయడానికి ఆమేవచ్చింది, చాలామంచిది. అంతా నీమాదిరిగానే ముచ్చటగా ఉంటుందన్నది సుశీల. నీదంతా ఒయ్యారమే! ముసలి వాళ్ళను యెగతాళిచేస్తావు. లే దత్తయ్యా! యీమధ్య మా నాయనగూడావచ్చి నీకీమెను పోల్చాడు. మా అన్నకూడ, ఆమె సావాసము చేసినతరువాత చాలా మారిపోయాడు. తప్పుడునోట్లు వ్రాయడంమాని, స్వదేశీగుడ్డలు వేస్తూ, సానిని వదలివేసి తాగడం తగ్గించుకోవడానికి డాక్టర్ల సహాయంతో చాలా అవస్థలుపడుతున్నాడు. మావదినెను బెజవాడకు పదిహేను రోజులక్రితం తీసుకువెళ్లాడుగా! ఆమెకు మన కమ్మారి పిల్లలంటే మంచి అభిమానమంట. కమ్మ హాస్టలుకుపోయి

వాళ్ళకు పాటలుపాడుతుందట ప్రతి ఆదివారము. మన సుబ్బ మ్మంత బుద్ధిమంతురాలని అందరు పొగడుతున్నారు. ఏమిరా అబ్బాయీ! సుశీలమాట నిజమేనా? అంగుపొంగుగల పిల్లేనా? నేను బెజవాడచూచి చాలాకాలమయింది. నీవు పోయేటప్పుడు తీసుకువెళ్లుతావటరా? ఏమిటి! మాలపిల్ల యుండే యింటికెట్లా తీసుకువెళ్ళమంటావు? అనా నీ సందే హం. నాకేమి? నాకొడుకు పంచముల సావాసముజేసి పెత్త నాలు చేస్తుంటే నేనా యింటికికూడ పోకూడదా? నాతిండి నేనే వండుకుతింటాను. నాగది నాకువేరుగా యుంచితేచాలు. పలాహారాలు నాకవసరము లేదుగా. ఇక కలసిమెలసి తిరగడాని కేమిలే! నాచిన్నతనాన పంచములతోబాటు పొలాన పనిజేసిన దానినిగదా! అన్నది. " అత్తయ్యా! మామగారు కేకలేస్తా రేమో? ఎంతదానివమ్మానీవు? నేనేమోననుకున్నా. మీవద్ద నుండే మీ కొడుకునకీ పంచమాభిమానము వచ్చింది. పెద్ద కాపుకుగూడ గంగయ్య కొడుకుమీద పేమేనమ్మా. బయ టికిచెప్తే సాగదనికాని, లేకపోతే మనయింట్లోనే, అరుంధతీ దేవికీ, బసవలింగయ్యకూ, పెండ్లిచేసేవాడు." అన్నది సుశీల. " నాకొడుకు దేశానికంతా పెత్తనంజేస్తుంటే, నేను నాయింట్లో అరుంధతికి వసతి కల్పించడానికైన ధైర్యము చేయవద్దా?" అంటూ, పెరుగు గురుస్వామికి వడ్డించింది. ఇంతలో రమణయ్య గారొచ్చారు. అమ్మమ్మ లోపలికిపోయింది. రమణయ్య మీసము సవరించుకొంటూ, కొడుకుప్రక్కన కూర్చుని ధాన్యపుధరలు, బెజవాడ వ్యాపారపువైఖరి, కొట్టములోని

కోడెలు, అగ్రికల్చరల్ వారి క్రొత్త విత్తనాలగురించి మాట్లాడినపిమ్మట, అమ్మాయీ! సుశీలా! బసవలింగయ్య పెండ్లెప్పుడు నిశ్చయించారు? మీరీ విషయాలేమి నాకుచెప్ప రేమి?

సుశీల

చెప్పడానికేముంది మామయ్యగారూ! పెండ్లిమాట యింకా తలపెట్టుకోనేలేదట, పైగా మతాలడ్డమున్నవటగా?

రమణయ్య

మీకు చదువుకున్నకొలది మతిబోతున్నదా? మత భేదాలు పెండ్లికెట్లా అడ్డము? నిలువుబొట్టు పెట్టుకునేవాళ్లు అడ్డబొట్టు పెట్టుకునేవాళ్ళతో మనలో సంబంధాలు చేసుకోవడంలేదా యేమిటి? రామానుజమతం పట్టిన కమ్మవారు మనవాళ్ళతో బంధుత్వాలు చేస్తున్నారుగా! మనవాళ్ళెంత మంది బిడ్డలులేకపోతే తురకల దేవుని మ్రొక్కుకొని పుట్టిన పిల్లలకు ఫకీరని పేరుపెట్టుకోవడములేదు? అట్లానే కిరస్తానీ వాళ్ళపిల్లలను పంచములెందుకు చేసుకోగూడదు!

రామస్వామి

(భోజనముచేసి లేచి చేయి తుడుచుకొని నాయన ముందు నిలబడి) అదికాదండీ క్రయిస్తవుడయినవాడు తాను పంచముడను కాదనుకొని పల్లెలోనివాళ్ళ నందరిని తక్కువగా చూస్తున్నాడు. క్రైస్తయివుల పిల్లను చేసుకొనే ప్రతి

పంచముడుఆమతములో చేరవలసిన దేనని చట్టముంది. బసవ లింగయ్యకు హిందువులలోనేతప్ప యితరుల చేసుకోవాలని లేదు.

సుశీల

కాని అరుంధతిని అమితంగా ప్రేమిస్తున్నాడటగా?

రమణయ్య

నేనామెను నిన్న బెజవాడలో మనయింట్లో నీవున్నావేమోయనే సాకుమీదపోయి చూచివచ్చాను. మీ అమ్మలాగానేయుంది. దానికండ్లే ముక్కే మాటలే. మన బసవ లింగయ్యకు బంగారానికి వెలిగారమతికినట్లు అతుకుతుంది. నన్నుజూచి "తమ దేవ్వూరండీ? యెవరికోరకొచ్చారు?" అని రాణివలెనే పలుకరించింది. నాకెంతో పరమానందమయింది. "నేను రమణయ్యను. వేల్పూరుమాది. రామస్వామికోసర మొచ్చాను" అనేసరికి యెక్కడలేని వినయము భక్తి తెచ్చుకొని నాకాళ్ళకు మన సుశీలమాదిరిగానే మ్రొక్కి కుర్చీయందు కూర్చోబెట్టి మేము క్రీస్తియానులము. మీ అబ్బాయి గారిల్లంతా మయిలచేశామని మీమీద కోపగించుకోరుగదా. మాయింట్లో మీరు వంటపదార్థములేవీ తినరుకాబోలు? ఈ ద్రాక్షపండయినా తినరా? సోడా తెప్పించుతాను పాలు పనికిరాకపోతే" అని యెంతో సత్కారం చేసింది. నిన్నుయల్లమందను బసవలింగయ్యను గురించి యెన్నో సంతోషకర మయిన విషయాలుచెప్పి వేల్పూరు పెద్దకాపునుగురించి

మద్రాసులోని ప్రతిష్ఠిత్తందారు పొగడుచున్నాడని విన సొంపయిన మాటలు చెప్పింది. ఏమతమయితేనేమి? అట్టి మర్యాద మంచి కలిగినపిల్లను మన బసవలింగయ్య పెండ్లిచేసు కోవలసిందే. గంగయ్యతో యిప్పుడే యీమాటలన్నీ చెప్పి రేపు బెజవాడ పంపిస్తానన్నాను.

సుశీల

గంగయ్య ఒకమాత్రానికి అరుంధతిని నాణ్యము చేయడు. బసవలింగయ్య భార్య యీపాట్లో కొంతకాలం కాపురముచెయ్యాలంట. తనకుటుంబానికంతకూ తానే వండి పెట్టాలట. అన్నమువడ్లు దంచాలట. ఇంకా యేవేవో షర తులు చాలా సంవత్సరాలనుండి వ్రేళ్ళమీద లెక్కిస్తున్నాడే!

రమణయ్య

పండ్లూడిపోయినా ముసలాడు వాడిని వంగదీయడ మెంతసేపు? ఆపిల్లనొక్కపర్యాయము చూచి, ఆమెమర్యాద నొక్కమారు రుచిచూచాడా చిన్నవాడను కాకపోతినే యని సంతాపపడి యిట్టిచిన్నది నాకు కోడలయిందిగదా యని గంతువేయడూ? అబ్బాయీ! రామస్వామన్నట్లు గంగయ్యకు దాదాపు తొంభై సంవత్సరాలు వస్తున్నాయి. రేపోమాపో రాలిపోతాడు. వెనుకటికాలపువాడుగనుక కాయ వంటి శరీరంతోయున్నాడు. బసవలింగయ్య పెండ్లి సుందరి పెండ్లితోబాటు వచ్చే వైశాఖమాసంలో జరిగేటట్లుచూడు.

సుశీల

మామగారూ! మా అత్తయ్యగూడ అరుంధతిని చూడా లనుకుంటుంది. నేను యింటివద్దనుండి నీకాళ్ళు పిసుకుతాలే! నీకొడుకునిచ్చి ఆమెను గంగయ్యను యల్లమందను పంపండి, వారేదోయొకటి తేల్చుకొస్తారు.

రమణయ్య

నీమాట కెదురేమున్నదమ్మా? సుశీలా! నీవులేకపోతే యీపిచ్చివాడు ఆపిచ్చిది యీయింటికెప్పుడో దివాలా తెచ్చేవారే. ఏమే! రాయిడీ చంద్రంక పెట్టుకుపోతావా?

అమ్మి

మీావన్నీ సరసాలండీ! నెత్తి నెరసినా మాటలు మెత్తబడలేదుగా!

సుశీల

(రామస్వామితో మెల్లగా) ముసలివాళ్ళకు యెంత ప్రేముందో చూశావా?

మరునాడు బెజవాడలో అరుంధతీ పాఠశాలనుండి సాయంత్రం ఐదు గంటలవరకు తన ఇంట్లో యెవరో బంధువులున్నట్లు తెలుసుకున్నాడు. ఏమీా తోచక తెల్లగ నెరిసిపోయిన తలతో అత్యంత గంభీరముగానున్న ముసలాయనను జూచి జాలిబొంది ఆయనవద్దకుపోయి అయ్యా! మంచినీరు

కావాలా! అని యడిగి ప్రక్కనేకూర్చుండి చల్లచల్లగా మాటలు చెప్పడం ప్రారంభించాడు. మంచినీళ్ళుత్రాగి అటు నిటు పారజూచి,

గంగయ్య

అమ్మా! వేల్పూరు రామస్వామిగారు నన్నిక్కడవిడచి తల్లితో బజారుకు పోయాడు. కొంచెముసేపటిలో వస్తాడు. మీాకీవూళ్ళో యుద్యోగములో ఉన్నారట. మీా పూర్వీకు లేవూరివారు?

అరుంధతి

వేల్పూరు పెద్దకాపుగారు మొన్ననే వచ్చిపోయారు. వారికి కావలసినవారంతా నాకు బంధువులే. మాతండ్రిగారిది బెజవాడే. ఆయన తండ్రి నందిగామ తాలూకా పెద కంచర్ల. మాదిగల పెద్దట. మాతండ్రి బెజవాడలో కుర్రవాడుగా ఉన్నప్పుడు కలెక్టరుగారికి జవానుగాఉండి క్రమక్రమంగా డఫే దారై, తెలుగు చదువుకొని యింగ్లీషు మాట్లాడడం నేర్చు కున్నాడట. ఆయనకు యిరవైయైదవ సంవత్సరం వచ్చేవరకు కలెక్టరుగావచ్చిన కొటనుదొరగారికి చాలా యిష్టుడై ఆయ నతో చెన్నపట్టణం వెళ్లాడు. నెలకు ముప్పై రూపాయలూ భోజనము, వుండడానికిల్లు ఆదొరగారిచ్చేవారు. మద్రాసులో క్రీస్తుయను మతము బట్టి ముప్పై సంవత్సరాలలో యిరవై సంవత్సరాలు వయస్సు గల్గిన సౌభాగ్యమ్మను పెండ్లాడినాడు. ఆమెకు నేనొక్కతెనే బిడ్డను. నన్ను చిన్నప్పటినుండి గారాబ

ముత్తో పెంచి, యింగ్లీషుచదువు చెప్పించారు. ఇంటివద్ద మా తండ్రి తెలుగున వ్రాయడం, చదవడం నేర్పాడు. నాకు పదహారు సంవత్సరాలు వయస్సువచ్చేసరికి, మాతల్లి మృత్యుముఖానబడింది. (కండ్లవెంట నీరుగార్చుచున్నది) ఎట్లయితే నేమి! ఆ సంవత్సరమే పెద్ద పరీక్ష ప్యాసవడంవలన సంతోషంపొందాను. దొరగారింగ్లండు వెళ్లుతూ, తన పుస్తకాలను, రెండువందలు నాకిచ్చి మానాయనకు రెండువేల రూపాయలు, నెలకు యిరవై రూపాయల పెన్షను, మూడువేలు ఖరీదుచేసే చిన్నయిల్లు, యిచ్చి వెళ్లిపోయాడు. నేను బి. యే. (ఆనర్సు) ప్యాసై యిప్పటికి మూడు సంవత్సరాలయింది. జీతమంటారా! నాకిప్పుడు వందరూపాయ లిస్తున్నారు. ఈవూళ్లో నాకెట్లా కాలంగడుస్తుందంటారా? ఈబెజవాడ యెంత వేడిగాఉన్నా చాలాఅందంగా ఉంటుందండీ! సాయంత్రపువేళలందు సూర్యకిరణజాలమునందేకమై, దుమ్ముదుమారము మహాద్భుత దృశ్యమును గల్గిస్తుంది. కృష్ణాస్రవంతిని, ఆనకట్టు ప్రక్కనున్న రోడ్డువెంట తిరుగుతూ చూచి ప్రతిదినమూ ఆనందిస్తున్నాను. అస్తమయసూర్యుడు, ఆవలి ప్రక్కనున్న తాటిచెట్ల మీదుగా యిసుక పర్రలమీద నాట్యమాడుతూ జలధారలయందు నాట్యమాడుతూ హృదయ రంజకమగు నగుమోముజూచి, నాహృదయ ముప్పొంగుతుంటుంది. మేడమీద నిలబడిచూస్తుండే, మీ దుర్గమ్మకొండ విద్యుద్దీపాలతో తళతళమెరుస్తూ, రాత్రికి ముగ్గుపెట్టుతుంటుంది. ఈరైలిసుకాల్వ ప్రక్కకాల్వ మహానదికి రెండు బాహువులుగా నున్నట్లుండి దేశానికి భాగ్య

మును భూములకు అమృతమును, ప్రసాదిస్తుంటాయి. మన దేశమెుకప్పుడు స్వరాజ్యము ననుభవించే రోజుల్లో బెజవాడ శ్రీ కృష్ణదేవరాయ లంతటివాని దృష్టి నాకర్షించిందట.

స్నేహితులున్నారంటారా? లేకేమి మా స్కూలులో మిస్ట్రెసులుగావుండేవా రప్పుడప్పుడు వస్తారు. మీ బసవ లింగయ్య యల్లమంద రామస్వామిగారలు యిచటికివచ్చి టీత్రాగి దేశపు బాగోగులగూర్చి మాట్లాడి వెళ్లుతారు.

ఒక్కదాననే యుండడానికి భయములేదంటారా! ఇన్నేండ్లువచ్చినతరువాత భయమేముంది? ఈ వూరి సబు కలెక్టరుగారు నామీద గౌరవముగా వుంటారు. అందువల్ల పోలీసువారు నాపై నాభద్రతగూర్చి బహుశ్రద్ధగాయుంటారు. ఈ వూరి చేర్మనుగారు గాంధిశిష్యుడు, యోగ్యుడు, జ్ఞాని, దేశ భక్తుడు. ఆయన అప్పుడప్పుడు నన్ను పిలిపించి మంచిబుద్ధులు గరపుతూవుంటాడు.

గంగయ్య

అమ్మా! యెరుగక అడుగుతాను. మావాళ్ళల్లో ఇరవై యేండ్లు వచ్చేవరకు ఆడపిల్లలందరికీ పెండ్లిండ్లు చేస్తాము. మీకు ముప్పైయేండ్లుంటాయిగదా! యింకా పెండ్లిచేసుకో లేదేమి?

అరుంధతి

పెద్దవారడిగితే తప్పేమున్నదండీ? బస్తీలలో యున్న క్రిస్టియనులు చాలా వయసువచ్చేదాకా పెండ్లిండ్లు చేసు

కోకపోయినా తప్పులేదు. నాకు యిరవై సంవత్సరాలే ఇప్పుడు. ముప్పై సంవత్సరాలు వచ్చినా పెండ్లికాని కన్య లెంతమందో మాసంఘంలో కలరు. నాకు బాగా చదువు చెప్పించిన తరువాత పెండ్లి తలపెట్టాలని మానాయన పంతం పట్టాడు. కాని మాకదృష్టము చాలలేదు. ఆయన నన్ను ఐ. సి. యస్. పరీక్ష ప్యాసయి కలెక్టరు ఉద్యోగముచేస్తున్న ఒకరిని చేసుకోమన్నాడు. నాకు మరింకొకరిమీద ప్రాణము గలిగింది. ఈ అభిప్రాయభేదమువలన మానాయన నన్ను చూడడానికి రావడంలేదు. అదే నాకమితదుఃఖమును కలిగిస్తూవుంది.

బసవలింగయ్య

మా బసవలింగయ్య వరించిందినిన్నేనా తల్లీ? నావద్ద దాచబోకు. నేను నాల్గుతరాలు చూచినవాడను. అవసరమైతే మీనాయన దగ్గరకుపోయి బ్రతిమాలుతాను. నీవేతరపున? నీవెంత పెద్దదానవైనా, చదువుకున్నా, నాబోటి ముసలివాళ్లు కాని యీపెండిండ్లు చేయించలేరు. పెండ్లిమాటలంటే సిగ్గుపడ డానికి నీవు చిన్నపిల్లవు కాదుగదా!

అరుంధతి

(సిగ్గుపడి) తాతా! నాకా సంగతేమీ తెలియదు. పెద్దలందరే సలహాయిస్తారో? మానాయనకు క్రీస్తియనుఅల్లుడే కావాలంట.

గంగయ్య

అదేమిటి తల్లీ! మీనాయన పుట్టుకతో హిందువు నీవును హిందూ మతములోనే యుండాలి. మన పంచములను పైకి తీసుకురావాలంటే వాళ్ళమతములోనే యుండాలని బసవలింగయ్య యెప్పుడూ చెప్పుతుంటాడు. ఇంతలో బండిదింపి, అమ్మిమ్మగారి చేయిపట్టుకొని, నడపించుకుంటూ, రామస్వామిగారు చుల్లమందతో వచ్చారు. వారిద్దరికి గంగయ్య, అరుంధతి ప్రణామములొనర్చి అందరిని కూర్చోనబెట్టారు. అమ్మిమ్మ మాత్రము తన కొడుకుప్రక్క చాపమీదనే ఆసీనురాలయింది. గంగయ్య యెంత బ్రతిమాలినా కుర్చీపై కూర్చోనలేదు. అమ్మిమ్మ అరుంధతివంక ప్రేమపూర్వక దృష్టి నిగుడ్చి అబ్బాయీ రామస్వామీ? యీమెనేనా నీవు బసవలింగయ్యకిచ్చి పెండ్లి చేసేది? గంగయ్యా! నీకోడలితో మాట్లాడావా? నీవు మాట్లాడకుండా యూరకుంటావా? నీళ్ళకుండలకు ఉచ్చులు వేసేవాడవి. ఇటురా అమ్మా! నిన్ను బాగా చూచుకోనివ్వు! బసవలింగయ్య యెప్పుడూ నిన్నుగురించి కలవరిస్తుంటాడట. వాడు మారామస్వామంతటి బుద్ధిమంతుడు. అరుంధతి సిగ్గుపడి యేమీతోచక పెదవులు తడబడ ముసుగు ముందుతీసుకొని, అమ్మిమ్మ వడిలోవచ్చి దాగొన్నది.

రామస్వామి

అమ్మా! అట్లా తొందరపడతావేమిటి? ఏమండో! అరుంధతీదేవిగారూ! నేనేమీ మాఅమ్మతో చెప్పలేదండి.

నామీద కోపపడకండి. ఏసంగతి తెలుసుకోకుండా యీ ముసలివాళ్ళిట్లాగే వ్యవహారాలు చెడగొట్టుతారు. గంగయ్యా నీవేమీ అవకతవకమాటలు మాట్లాడలేదుగదా? మీలాంటి చదువుకున్నవాళ్ళవలె అంత రహస్యాలతో వంకరటింకర చూపులతో మనోగతాభిప్రాయముల దాచుకొనక తుదకు సాంఘిక వ్యవహారాలుగూడ సహజమగు పద్ధతిని మనగ్రామస్థులు మాట్లాడుకొనగలరు. మీ అన్నగారితో యీ విషయముగూర్చి ఎరుకు బెరుకు లేకుండ తేల్చకపోయినయెడల మనమెప్పటికయినా యీ వ్యవహారమును తేల్చగలిగెడివారమేనా? అరుంధతిగారూ! మీ హృదయ రహస్య మిదివరకే మాకందరకీ తెలిసియున్నది. కాన యేమి అనుకోకు లెండి.

యల్లమంద

రామస్వామిగారూ! మీరు అమ్మినేమి అనకండి.

అరుంధతి

అమ్మమ్మ చెవివద్దకు తలయెత్తి అమ్మా మీరిట్లు మాట్లాడకపోతే ఎప్పటికయిన నాహృదయవేదన బయట పెట్టకలిగెడిదానను గాను. బస్తీలోని విద్యార్థులందరు పెండ్లి జేసుకోండుమని కబురులు పంపినను నాకు మీ బసవలింగయ్యగారిని తెలుసుకొన్నప్పటినుండి వారిమీదనే మనస్సు హత్తుకొని పోయినది. మా నాయనగారికి యీ మనువు యిష్టముగాకపోబట్టి ఆయనగారి యభిప్రాయము

మన యల్లమంద చెప్పేవరకు నాకు పూర్తిగా తెలియకపోబట్టి పెండ్లియాలోచన యీ విధముగా నెవ్వరు బయల్పరచక పోబట్టి యిన్నాళ్ళనుండి మనస్సులో పెట్టుకొంటిని. (అందరు వినునట్లు) అమ్మా! ఎన్నాళ్ళకు చూచినానుతల్లీ! అమ్మమ్మ గారూ! ఎంతధన్యురాలిక న్నావుతల్లీ! పుణ్యమన్న నీదేసుమా! అయ్యా! రంగయ్యగారూ! మీరేనా వారితండ్రి? ఎంతటి ధన్యాత్ములు మీరు. అమ్మా అమ్మమ్మతల్లీ! నీకంత యిష్ట మయితే యిదివరకు చెప్పకపోయినా యిప్పుడయినా చెప్పి తానులే! మామయ్యా! నేను నీకు పనికివస్తానా! అని చెప్పి చెప్పనట్లుగా ఆనందబాష్పము లొలుకుచుండ మెల్లమెల్లగా చెప్పెను. గంగయ్య గడ్డము సవరించుకొనుచు "అమ్మా అన్నిటికి యీ అమ్మి ఆపెద్దకాపు,వారే మాకుదిక్కు. నీవంటి వరాలతల్లి మా అబ్బాయికి దొరికితే యింకా మాకు కావాల సిందేమున్నదన్నాడు.

అమ్మమ్మ

అరుంధతీ! నీపేరు ముచ్చటగానున్నది. నాపెండ్లికి అరుంధతిని చూపెట్టమని మావారడిగితే ఆయనకెంతసేపటికి కనబడనేలేదు. నేనట్లే పైవంకజూచి 'అదిగో అరుంధతి' అంటిని. అందరు పకపక నవ్విరి. ఆసంగతి నాకెప్పటికినిమరపు నకురాదు.

రామస్వామి

అమ్మా! అప్పుడేగాక ఎల్లప్పుడు మానాయనకు కనపడని విషయాలు నీవుచూచి దారి చూపుతుంటావు.

మొన్ననేగా మా నాయన అరుంధతిని చూచినది. ఈ పెండ్లి మాట కనుకొ్కనగలిగినాడా! నీవు వచ్చావో లేదో అప్పుడే అన్నీ తేల్చివేశావు.

గంగయ్య

మారామస్వామి యెప్పుడూ "అమ్మి" మీద ప్రాణం గానేయుంటాడు. అమ్మి ధన్యురాలు.

అమ్మమ్మ

ఈ మాటలకేమిగాని "అమ్మాయీ" నీకీ కిరస్తానీ మతమునుగూర్చి యింత పట్టుదల ఎందుకమ్మా! నీ వేమైనా పురోహితురాలవైతే మతముపట్టుకొని వ్రేలాడినా బాగుం డును. ఏదీలేని మనబోటివాళ్ళకు యీపట్టింపు లెందుకు? ఈ వూరిలోని కనకదుర్గాంబను సేవించుటకు వైష్ణవులుగూడ సంతోషముతో వచ్చుటలేదా! కృష్ణామతల్లి పుష్కరాలు వచ్చినప్పుడు అన్ని శాఖలవారు దేవుని ఒకేమారు కృష్ణా స్రవంతిద్వారా పూజించుకొనుటలేదా?

అరుంధతి

అమ్మా! అన్ని మతముల సామరస్యమును అనుభవ పూర్వకముగా జూపెట్టి పంచములనుగూడ నీపిల్లలవలెనే ప్రేమించి నీవద్ద పాలేరులుగానున్న యల్లమంద, వెంకయ్య, సుబ్బమ్మలను యింతగాపైకి దెచ్చినమీరు అట్టినామతము వదలమంటే కాదంటానా! నీకేమతము సరిపోయినదో నాకదే

చాలును. ఇన్ని గొప్పకార్యాలుచేయించి యింత గొప్పవారికి తల్లివైన నీకంటె నాకు గొప్పగురువు యెవ్వరుదొరకెదరు? మీభగవద్గీతను, పోతన్నగారి భాగవతమును, మీకొమరుల సహాయముతో చదివినాను. చూడగా చూడగా హిందూ సంఘమునందు నాస్తికలకు, విగ్రహారాధకులకు దేవుడొక్కడే యనువారికి, ఆస్తికులకు అందరికిని స్థానముకలదు. ఈసంఘము నందువలె అన్ని అభిప్రాయములు అన్నిపద్ధతులద్వారా భగ వంతుని దర్శింప యత్నించువారిగూర్చి సహనము జూపెట్టు మతేయితరమతస్థులు కానరారు. మీరే యిందులకు నిదర్శ నము.

రామస్వామి

అమ్మా! నేను బసవలింగయ్యవద్దకు వెళ్ళి యీకబురు చెప్పి లగ్నముపెట్టిస్తా. అరుంధతిగారూ! త్వరపెట్టినామనుకో వద్దుసుమా?మాపల్లెటూరివాళ్ళకు పెండ్లిండ్లు ఏర్పాట్లుచేయుట కిట్టి పద్ధతులే చాలునులెండి. అవసరముంటే మీనాయనగారికి తంతియిద్దాము. మావూరిలో గూడెములోనే పెండ్లి. మా పంచములెట్లా బ్రతుకుతున్నారో చూతురుగాని. గంగయ్యా! నాతోవస్తావా? అమ్మా అరుంధతిని లోపలికి పోనివ్వు, అలిసి పోయినట్లుంది. నీవీబొమ్మల చూస్తూయుండు. నేనిప్పుడే తిరిగి వస్తానులే అని వెళ్ళినాడు.

వైశాఖ శుద్ధ పంచమినాడు వేల్పూరులో గొప్ప యుత్సవము జరుగునని బెజవాడనుండి చుట్టుపట్ల గ్రామముల

నుండి వందలకొలది ప్రజలు వచ్చిరి. బెజవాడ ఫిర్కాలోని ప్రతిగ్రామముతరఫున ప్రతినిధులుచేరిరి. కృష్ణాజిల్లాయందు సాంఘికసేవకులందరు వారినాయకులుగూడ వచ్చిరి. ఉద్యోగస్థులేకాక జాతీయనాయకులు అనేకులు వచ్చిరి. వేల్పూరు పంచములగూడెమొక పట్టణమువలె ప్రజలచే క్రిక్కిరిసిపోయినది. గల్లీలన్నిటియందు పందిళ్ళే. బజారుల కన్నిటికిని తోరణాలే. ప్రతియింటిని అలికి ముగ్గులుపెట్టి గోడలకు సున్నముగొట్టి గ్రామమునకు నూతనకళను కలిగించిరి. బందరునుండి బెజవాడనుండివచ్చు బంధువులు స్నేహితులు యీడుపుగల్లు వద్ద దిగుచుండ వారినందరిని క్రొత్తపెండ్లికొడుకగు సుబ్బారావు తండ్రి అంకమ్మ అందుకొని రాములవారి స్తంభముతోబాటు భజనలతో యీడుపుగల్లు గూడెమునకు తీసికొనిపోయి పెండ్లియింట తాంబూలములు సమర్పించి కాలవగట్టున అడ్డదారిని వేల్పూరునకు వాలంటీర్లతో పంపించుచుండెను. పంచముల పెండ్లిండ్లు జరుగుచుండ నెప్పటివలె తమకేమి సంబంధములేనట్లు సరిపెట్టుకొనుటకుమారు ఈడుపుగల్లు వేల్పూరు రయితులందరు తమగ్రామములందు గొప్ప సాంఘిక సత్కార్యము జరుగుచున్నదను అభిమానమును జూపెట్టుచు పొరుగూళ్ళనుండి వచ్చుచున్న పెద్దలను తమతమ ఇండ్లకు తగురీతి తీసుకొనివెళ్ళి వారికి అతిథిసత్కారము లొనర్చుచు సాంఘికసమానత్వమును వివిధసంఘ సామరస్యమును జూపెట్ట ప్రయత్నించుచుండిరి.

గంగయ్యగారు యల్లమందగారి యాజ్ఞప్రకారము రాముని పటముముందే పెండ్లిచేయింప నిశ్చయించుకొని పది గంటలకు వేల్పూరునందు క్రొత్తగా తాళపత్రములచే నిర్మింప బడిన రాముని మందిరమందు బసవలింగయ్యకు అరుంధతీ దేవిని, సుబ్బారావునకు సుందరిని యిచ్చి పెండ్లి చేయించెను. బసవలింగయ్యగారికి రామస్వామిగారు, సుబ్బారావుగారికి మధుసూధనరావు తోడిపెండ్లికొడుకులుగాను ; అరుంధతికి సుశీలాదేవి, సుందరికి సుబ్బమ్మ ; తోడిపెండ్లికూతుళ్లుగాను ముచ్చటలనెరపిరి. పెద్దలందరు వధూవరులదీవించి దాదాపు రెండువేల రూపాయలు చదివించిరి.

పెండ్లి యూరేగింపుచేయు విషయమున యీ గ్రామ ముల కమ్మవారు, కాపులు, రెడ్లు కొంచెము హడావుడిపడిరి. ఇప్పటివరకు పంచములు తమ గూడెమునందు, కులస్థులు తమ యూరియందే తమ తమ యుత్సవాదులు జరుపుకొను ఆచా రముగానుండెను. ఈ పేరుపొందిన పంచముల పెండ్లిండ్లు సంద ర్భమున పొరుగూళ్ళ పెద్దలెందరో వచ్చినప్పుడు సత్కారపు పద్ధతుల నవలంబించితిమని తాము రైతులోకమునందు జయ పతాకమును లేపుచున్నప్పుడు తమవలెనే పంచములుకూడను మేళతాళములతో పల్లకీలతో నూరేగింపుచేసికొను అధికా రము పొందుటమంచిదని యితరులన్నచో తామేమి చేయువల యునాయని సందేహముపొందిరి. "అందరివలెనే పంచములు గూడ పాలకీలెక్కి వచ్చుచున్నచో రోషపడు పూర్వాచార పరాయణు లడ్డగింతురేమో" వల్లకాదన్నచో యిక మీా

సాంఘికసంస్కార మేమిటని బయటవా రాక్షేపించెదరేమో యని కొందరనిరి. పెత్తందారయిన రమణయ్యగారు "మనకు యెవ్వరితోను ఏవిధమైన యిబ్బందిలేకుండా యుండేపద్ధతి కావాలెగదా. పెండ్లి యూరేగింపులను, ఊరు, గూడెముల గుండా ఒకేమాదిరిగా చేసుకోమందాము. పాలకీగాని, గుఱ్ఱము గాని లేకుండ చూచుకోమని కోరుదాము. మనకు వాళ్ళు వాహనాలమీద ఊరేగుటకున్న యభ్యంతరము తీరిపోవును. వాళ్ళకుగూడ మన వూళ్ళో యూరేగి ముచ్చట తీర్చుకొనన డానికి వీలుగలుగును. అవి అందరిని సంతృప్తిపరచిరి. "ఇన్ని వ్యవహారలలో తమకు మేలుచేసినపుడు తాము ఊరేగింపుల గూర్చి వివాదము పెట్టుకొనుట మంచిదికాదు." అని తీర్మా నించుకొన్న పంచములకు రైతులయొక్క విశాలహృదయ సూచితమగు యీ ఏర్పాటెంతయు ముదముగూర్చెను.

పెండ్లికివచ్చిన పెద్దలందరు, అన్ని సంఘములవారును, ఊరేగింపులయందు మన్నన, మర్యాదలందు యింత సామర స్యముగా ప్రవర్తించినందుల కెంతయు రయితుపెద్దల నభినం దించిరి. ఖర్చులేకనే మర్యాదకరముగ వింతవినోదముల జరి పించియే, పండితపామర జనహృదయాకర్షకముగ బాజాభజం త్రీలు, సభలు, సభ్యులనేర్పాటు చేసినందులకు అందరు సంతో షించారు. "సుబ్బమ్మగారి పెండ్లిపద్ధతినే పంచములుగూడ యవలంబించి దేశమునకు క్లుప్తముగ, యోగ్యముగ, శుభ ముగ, చౌకగ, వివాహములుచేయుమార్గము చూపెట్టినందు లకు దేశసేవకులు హర్షమందారు. వునాదిపాడు గరల్సు

స్కూలు హెడ్ మిస్ట్రెస్‌గానున్న శ్రీ సుబ్బమ్మగారు, తన శిష్యురాండ్రు సందర్భించే మంగళహారతిపాటలు పాడించారు. సుశీలాదేవిగారు తన శిష్యురాండ్రు, స్నేహితులగు పేరంటాండ్రచే అప్పగింతలపాటలు పాడించారు. రామస్వామిగారు వధూవరుల నాశీర్వదించి సర్వమానవ సౌభ్రాతృత్వమును సముద్ధరింతురుగాక యని యాశించిరి. పెద్దకావు రమణయ్యగారు గోదానము చేసిరి. సుశీలాదేవి, సుబ్బమ్మగార్ల బిడ్డలిద్దరు వధువులిద్దరకు కుంకుమ నొష్టన పెట్టారు. బంధువులందరు మరునాటి పొద్దుననే తమతమ నెలవులకు వెళ్లారు.

శ్రీ బసవలింగయ్య అరుంధతీదేవితో సుప్రసిద్ధ దేశభక్తులగు లక్ష్మీనారాయణ దంపతులచే నడుపబడు "శారదా నికేతనమునుగురించి" దీనజన బంధువగు శ్రీ హనుమంతరావుగారి "పంచమాశ్రమమును"గురించి తెలుసుకొనుటకయి గుంటూరు వెళ్ళి పదిదినములపాటు విశ్రాంతి గయికొన నచటికి వెళ్లారు. శ్రీ సుబ్బారావు సుందరులు అటవీజాతుల నుద్ధరించుటకై సర్వమును ధారవోయుచున్న శ్రీ పుసులూరి కోదండరామయ్యగారి "పోలవరపు ఆశ్రమములో"నుండి కోయవారి ఆచార వ్యవహారములగూర్చి తెలిసికొని కొండలందును అడవులందును ఇచ్చవచ్చినట్టు తిరిగి సృష్టియొక్క గాంభీర్యత కన్నులార చూడవలయునని గోదావరి స్టీమరెక్కి వెళ్ళారు.



# హరిజన నాయకుడు.

## తొమ్మిదవ ప్రకరణము.

1928-వ సంవత్సరమునందు భారతదేశపు రాజ్యాంగ చట్టమం దేయే మార్పు లవసరమో విచారించి తగు సలహాలను పార్లమెంటుకిచ్చుటకై సర్ జాను సైమనుగారి యాధిపత్యముక్రింద యొక రాయల్ కమిషన్ భారతదేశమునకు వచ్చినది. దానియందు ఒకరయినను భారతీయ ప్రతినిధులు లేరు గనుక భారతదేశపు భావికాల రాజ్యాంగ ప్రణాళికను తయారుచేయుటకు భారతీయులకేగాక మరి యితరులకు సర్వాధికారములేదని జాతీయవాదులు పట్టుపట్టిరి. జాతీయ మహాసభవారు ఆ కమీషనును బాయికాట్ చేయడానికి తీర్మానించిరి. భారతదేశపు రాజ్యాంగపరమావధి సంపూర్ణ స్వాతంత్ర్యము అని మద్రాసునందుగూడిన కాంగ్రెసు మహాసభ తీర్మానించెను. ఈ రాచకీయ ఆందోళనమందు చిక్కుకొనియున్న మన రామస్వామి బసవలింగయ్య ప్రభృతులు బెజవాడ గాంధిపార్కునందు వివిధగ్రామములయందును తీవ్రమగు ఉపన్యాసములిచ్చి సైమను కమిషను అటునిటు బెజవాడ స్టేషనుద్వారా వెళ్ళునపుడు నల్లజండాల యుత్సవముల జరిపించారు. ఆ సైమను కమిషనుముందు సాక్ష్యమియ్య

డానికి బసవలింగయ్యను ప్రభుత్వముకోరెను. తనసంఘము నందు ప్రాముఖ్యత పొందగోరి లోకలుబోర్డులు కౌన్సిల్ సభ్యత్వములకాంక్షించి ప్రభుత్వసేవ సేయుచున్న పంచము లనేకులు సాక్ష్యమియ్యవలసినదని తన్ను బలవంతపెట్టుతూ వుండిరి. తనకు బిరుదులువచ్చును, ప్రఖ్యాతికలుగును, అని క్రిస్టియను స్నేహితులు ప్రోత్సహించిరి. అట్టివేవియు లక్ష్యపెట్టక తతిమ్మా హిందువుల యదృష్టములోనే పంచముల యదృష్టము యిమిడియున్నదనియు భారతీయులందరికొక్కమారే స్వరాజ్యము రావలయుననియు గ్రహించి బసవలింగయ్య సహాయనిరాకరణ మవలంబించాడు.

హిందూమతమునందు చేరినదనుకోపముననుా, సమర్థురాలై, సుగుణముల కాలవాలమై, విద్యార్థినుల హృదయముల చూరగొన్నదై పాఠశాలకు నూతనశోభకలిగించు అరుంధతీదేవిని వెంటనే రిజగ్నేషను యివ్వమని మిషను హైస్కూలువారు కోరలేదు. కాని సైమను కమీషను బాయకాటునందు ఆమెభర్త తీవ్రముగా కృషిచేయుచున్నారను నెపముపై అరుంధతీదేవిగారిని తన నూట యిరవై అయిదు రూపాయల యుద్యోగమును వదలుమనికోరాడు. ఆమె యే యభ్యంతరమునుచెప్పక యుద్యోగమును వీడి గుంటూరు నందలి జాతీయ స్త్రీవిద్యాలయమునకు ప్రధానోపాధ్యాయినిగా నెలకు అరవై రూపాయల జీతముపై వెళ్ళి దేశసేవ చేయడానికి సిద్ధమయింది.

యం. సి. రాజా పన్నీరు సెల్వాం వీరను వగయిరాలు పంచములతరఫున సైమను కమిషనుముందు సాక్ష్యమిచ్చుచు ప్రత్యేక సాంఘిక ప్రాతినిధ్యము తమసంఘునకు కావలెనన్నారు. స్వరాజ్యము వెంటనే ఇచ్చిన తమ్ము పై కులములవారు అణచివేసెదరనియు బ్రిటీషురాజ్యమున నిందువలననే ఇంత మాత్రమయిన తమకు నిలుచుటకునీడ పలుకుటకు స్వాతంత్ర్యము కలిగినదని సంఘమున కగౌరవకరముగా సాక్ష్యమును చెప్పిరను విచారమును బసవలింగయ్య పొందాడు. పట్టణమందే కాంగ్రెసువారి సహాయముతో గొప్ప స్వరాజ్య ప్రచారమును సాగించి యుత్సవమునకు తగు యేర్పాట్లు చేశాడు. ప్రభుత్వము సభలుగానీ యుత్సవములుగానీ జరుపుటకు వీలు లేదని 144 సెక్షను పట్టణమందు ప్రయోగించారు. ఈ నిర్బంధమును లెక్కగొనక అది వీరహృదయభేద్యమగునట్లు స్వరాజ్యశంఖమును పూరించాడు. అనేకులు బసవలింగయ్యకు తోడై యుత్సవమును సాగింతమని ప్రకటించారు. ప్రభుత్వమున కేమియు తోచక యుత్సవమును అడ్డగించక గూండాలను కొంతమందిని చేరదీసి వారిని సభయందు పాల్గొన్నవారిపై దుర్మార్గమునకు తలపడవలసినదని పురిగొల్పారు.

సభ, తిలక్ ఘాటునందు యేర్పరచారు. కొన్ని వేల మంది పంచములు, అంతకుమించిన పై కులములవారు సభకు విచ్చేశారు. జాతీయవాదులగు ప్రొఫెసరుల ప్రోత్సాహము వలన పచ్చయప్ప కళాశాల మూయబట్టి వందలకొలది విద్యార్థులుకూడ చేరిరి. సభకు హిందూమతోద్ధరణ చేయుటకును,

సాంఘికసేవ చేయుటకును, అంటరానితనమును నిర్మూలించుటకును కంకణము కట్టుకొని జీవితమంతయు ధారవోయుచున్న శ్రీరామకృష్ణ మఠాధిపతి స్వామి గోపికానందులవారు అధ్యక్షులు. ప్రధానోపన్యాసకుడు మన బసవలింగయ్యగారు. కరతాళధ్వనులు చెలరేగుచుండ, పుష్పమాలలు కంఠము చుట్టు వెలుగుచుండ సాక్షాత్తు హరిభక్తునివలెనున్న యీ బసవలింగయ్యను చూచి సభికులు "యీయన నిజముగా పంచములేనా" అని నివ్వెరపొందుచుండిరి.

"అధ్యక్షా, సభాసదులార, మనమీదినము (మన భారతీయజాతికంతకు, అవమానము కలిగించడానికై ఇంగ్లీషు ప్రభుత్వముచే పంపబడిన) సైమను కమిషనును బహిష్కరించుటకై చేరాము. భారతీయ ఆత్మగౌరవమునకు యీసైమను కమిషను ప్రచారమే భంగకరము.

పంచములుగూడా భారతీయులే. పంచములుగూడా హిందువులే. మీదుమిక్కిలి పంచములు ఆదిమనివాసులు. ఇప్పుడు దురదృష్టవశాత్తు అనేక సాంఘిక, ఆర్థిక, రాచకీయ యిబ్బందులందు చిక్కి, దరిగానక అజ్ఞానాంధకారమునబడి క్రుగ్గుచున్నను, పంచములందింకను, ఆత్మాభిమానము జాతీయాభిమానము, స్వదేశాభిమానము చావలేదు. ముమ్మాటికి చావలేదు. (చప్పట్లు).

సైమను కమిషనుముందు సాక్ష్యమిచ్చు స్వసంఘీయులు మనకేవో ఇంగ్లీషువారు లాభములను గలిగించి

రని చెప్పుచున్నారు. ఆలాభము లేవో వివరించుటలేదు. ఇదివరకు మనకులేని సాంఘిక హక్కులుగాని గౌరవములుగాని యీ ప్రభుత్వము మనకు కలిగించినదా! బావులుగాని చెరువులుగాని దేవాలయములుగాని గ్రామములందు వీధులుగాని పాఠశాలలుగాని మనకుగూడ చెందునట్లుచేయుటకేమాత్రమయిన శ్రమపడినదా? మనల రక్షించుటకై మనకు కష్టములు కలిగించుచున్నవారి నేమయిన నిర్బంధించిందా? తిండిలేక మలమల మాడుచున్న మనవారికి విద్యార్థివేతనముల నిచ్చి విద్యాధికులచేసి యుద్యోగములనిచ్చి పోషించినదా (లేదు లేదు అను ధ్వనులు).

అయితే, మనసైమను సేవకులు, పైకులాలవారు మీకు చేసిన మేలేమీలేదుగదా! పైగా అన్యాయము చేస్తున్నారుగదాయని ప్రశ్నిస్తున్నారు. పంచములను అంటరాని పిశాచము పట్టుకొన్నమాటనిజమే. కాని దానిని వదలించడానికి, బ్రిటిషు ప్రభుత్వముకంటె గాంధిమహాత్ముడు, జాతీయమహాసభ, హెచ్చుశ్రద్ధ తీసుకున్నారు. జయము అంతసులభంగా చేకూరుతుందా? పంచముల నంటుకొన్నపాపమనే భీతికల్గిన, పైకులాలవారు కోట్లకొలదికలరు. అంటరానితనము మాన్పుట, అశాస్త్రీయము, స్మృతిబోధకు వ్యతిరేకమని, వాదించిన పండితులు లేరు. తుదకు, "తామంటరానివారము, పైకులాలవారి నంటుకున్న మనకు పాపమువస్తుంద"ని మనవారంతా యింకా భయపడుతున్నారు. ఇట్టి పరిస్థితులందు, హిందూమతానికే అంటరానితనము వ్యతిరేకమనీ, అంటరానితనమును లక్షించు

వారు సరియగు, పూర్ణమగు హిందువులుకారనియు, హిందూ సంఘమంతా, మహాత్ముని బోధవలన, కాశీలో పండిత మాలవ్యాగారి పండిత సభాతీర్మానమువలన గ్రహించింది. అంటరానితనమును సమర్థించేవారు హిందువులలో ప్రముఖులెవ్వరూ లేరనవచ్చు. ఈ భావప్రపంచమునందుకల్గిన అత్యంతమార్పును మనము గమనించాలి.

కాని పంచములింకా, "మనము అంటరానివారమే" అని నమ్ముతున్నారు. వారియొక్క ఆ దాస్యపుబుద్ధిని పోగొట్టడానికి ప్రభుత్వమేమాత్రమైన సహాయముచేసినదా! (లేదు. లేదు.) క్రీస్తుమతము మాత్రము, కొంతవరకా తక్కువబుద్ధిని తనయందు చేరినవారికి పోగొట్టింది. కాని అంటరానితనమును పోగొట్టుకొనడానికి మలబారునందు తప్ప, తదితరప్రాంతాలలో మనవారికి మతము మార్చుకొన్ననూ సాధ్యముకాలేదు. మహాత్మునిశిష్యులే కొంతవరకైనా యీలోపమును దీర్చ బ్రయత్నిస్తున్నారు. మా ఆంధ్రదేశమందే, రాజమండ్రి, ఏలూరు, బందరు, బెజవాడ, గుడివాడ, గుంటూరులందు పంచమబిడ్డలకే ప్రత్యేకంగా, ఆశ్రమాలను బ్రాహ్మణులే యేర్పరచారు. ఉచితముగా బాలబాలికలను పోషించి, చదువు చెప్పి, తయారైన విద్యార్థులను గ్రామాలవెంట మనవారియందు ఆత్మగౌరవాభివృద్ధి జేయడానికై పంపుతున్నారు. ఎన్నాళ్ళనుండో గోలబెట్టగా యీనాటికి యీ మద్రాసు

గవర్నమెంటు మాత్రము, ఒకవంద పాఠశాలలను, రాజధాని మొత్తముమీద మనకై పెట్టి, యీపట్టణములో ఒక చిన్న హాస్టలును యేర్పాటుచేసింది. నిజమిట్లుండగా, భారతీయులతో మాకు పనిలేదని, సైమనుకమీషనుముందు సాష్టాంగ పడుట మనవారికితగునా? (సిగ్గు, సిగ్గు).

ఇంతచెడి చివరకు మనవారు కోరినదెల్లయేమి? కొంత మంది నాయకులనో, అనాయకులనో, మనతరఫున ప్రభుత్వము, శాసనసభ్యులుగా నియమించవలెనట. (సిగ్గు. సిగ్గు. మాకు ప్రజాప్రతినిధ్యము కావాలి) అథవా! యెన్నికలుంటే పంచములే, పంచమ ప్రతినిధుల నెన్నుకోవాలట. పైపైననే విచారించితే, యీవిధానము చాల బాగుండునట్లుంటుంది. కాని దీర్ఘముగా విచారిస్తే, యిది నేతిబీరకాయ వతుయని మీరు గ్రహించగలరు. పంచములు పంచములనే యెన్నుకుంటే, మన ఆ ప్రతినిధులు యెప్పుడూ కౌన్సిలునందు పంచములుగానే యుంటారుకాని, జాతీయనాయకులుగా భారతీయ ప్రతినిధులుగా ఉండడానికి వీలులేదుగదా! అన్ని కులాలవారిచేతనూ, యెన్నుకోబడిన పంచముడు, దేశీయులందరిచే గౌరవింపబడును కాని, పంచములచేతనే యెన్నుకోబడిన పంచముని తదితరులు గౌరవిస్తారా? లక్ష్యపెడతారా? తమ నాయకునిగా పరిగణిస్తారా? ప్రస్తుతపు దీనావస్థయందే యుండడం మీకిష్టమా? (లేదు, లేదు) లేక నందమహాఋషివలె, శంకరుని గురువువలె,

రామానుజుని ఆళ్వారువలె, అన్ని సంఘాలవారిచేతనూ అన్ని మతాలవారిచేతను గౌరవింపబడుట పూజింపబడుట మీ యభీష్టమా ? (మనము జాతీయనాయకులు కావాలి. మీలాగున దేశీయనాయకులు కావాలి) మీరందరిట్లా భావికాల పురోభివృద్ధిని, గౌరవాభివృద్ధిని కోరుచుండ మనసంఘ వినాశనమును సంఘపు దుస్థితిని వృద్ధిచేయడానికి స్వకపోల స్వకపితత్వ నాయకులు కొందరు కమీషనుముందు సాక్ష్యమిచ్చుట మనకు సమ్మతమని తెలపడానికే యీ సభ చేశాము. ఈ కోర్టుసాక్షుల విజ్ఞానాభివృద్ధికై సైమను కమీషను బ్రిటిషు మంత్రాంగ వర్గమువారి లాభమునకై మన సంఘముయొక్క కోరికయేమో బహిరంగముగా 'ధర సింహాసనమై నభంబు గొడుగై' యున్న యీ మహాసభ ద్వారా తెలియజేస్తాము. మనదేశమందున్న వయస్సువచ్చిన ప్రతి స్త్రీకి పురుషునకు ఆస్తిపాస్తులతో నిమిత్తంలేకుండా రాజ్యాంగపు ప్రథమహక్కుగు ఓటు ప్రసాదించబడాలి. చదువు లేని మనవాళ్ళకు ఓట్లనిస్తే ధనవంతులు మనలను బురిడీపుచ్చి ముతాదారులను త్రాగించి మనవోట్లన్నిటిని సంపాదించెదరు. కనుక మనకు వోట్ల మర్యాదని లిబరలుపార్టీవారు వాదిస్తున్నారు. "త్రాగుట మానవలెనని" మనకు మహాత్ముని శిష్యులందరు చెప్పుతూవున్న యీ దినాలలో త్రాగుడు మానవలెనని మనమందరము ప్రయత్నముచేస్తున్న యీ దినాలలో చదవడానికి పాఠశాలలు చదివించడానికి తలిదండ్రు లుండ

వలెను. పిల్లల నందరిని చదివించాలని మనమున్నా జాతీయ వాదులున్నా పట్టుపట్టుతూవున్న యీ దినాలలో మనకు ఓట్లు యిచ్చుటవలన దేశమునకు నష్టమేమాత్ర ముండదని మనవారికి నచ్చజెప్పుచున్నాము.

ఓట్లున్నా ధనికుల ప్రాబల్యమే హెచ్చుతుంది గాని బీదలమయిన మన పెత్తనము సాగదు. ధనము సాంఘిక పెత్తనము గ్రామగౌరవము అన్ని అంగలు కలిగిన పెద్దకులాల వారికే వెనుక ముందు తెలియని పూర్వాచార పరాయణు లయిన మన ప్రజలు తమ ఓట్లనిస్తారుకాని మన సంఘీయు లయిన అభ్యర్థుల కివ్వరన్న విషయము మనముకూడ ఒప్పు కుంటాము. కనుకనే మనమందరము సమష్టి నియోజకవర్గము లందు మనకని ప్రత్యేకముగా జిల్లాకొక్క స్థానముండాలని మనము కోరుచున్నాము. ఈ కోరికలు జాతీయవాదులుకూడ ఒప్పుకుంటారని నమ్ముతాను. పాఠశాలలు చెరువులు బావులు రోడ్లు దేవాలయాదిగాగల ఉమ్మడిసంస్థలందుకూడ సమాన హక్కులు కావాలనీ, అంటరానితనము పోవాలనీగదా కోరు తున్నాము. పరస్పర సహకారమువలన గాంధిమహాత్ముని బోధ ఆయన శిష్యకోటి సహాయమువలన రయితునాయకుల యుదారతవలస మా బెజవాడ ఫిర్కాలో నెంత యద్భుత ముగా సాంఘికసంస్కారము చేయగలిగినామో పత్రికల ద్వారా మీరు తెలుసుకునే ఉంటారు. స్వరాజ్యమునకుతోడు మనవారందరికి ఓట్లువచ్చి సంయుక్తనియోజకవర్గములందు

మనకు జిల్లాకొక స్థానముచొప్పున మద్రాసు కౌన్సిలునందు ప్రాతినిధ్యము కలిగినదా, అంటరానితనము మటుమాయ మవుతుంది. సాంఘికపుటగౌరవములు పేరుచెప్పి పారిపోతవి. మనసంఘము దేశమునందు గౌరవస్థానము బొందుతుంది (చప్పట్లు).

కొన్ని ప్రదేశాలలో రయితులు మొండిగాయున్నారని లేక మూర్ఖులై దుండగాలు చేస్తున్నారని లేక ధనముజూచుకొని పైబడి కొట్టుతున్నారని విసుగొంది భారతదేశము మీదనే యలిగి పరాయివారి శరణు కోరుటకంటె హీనమగు కార్యమేదీలేదు. (చప్పట్లు) మునిగినా తేలినా భారతదేశము తోడిదే మనలోకమూ; ముంచినా లేపినా హిందూసంఘమే మనల నుద్ధరించాలి. (చప్పట్లు) అందరికంటె ముందీదేశమున ప్రవేశించి యీదేశమును పుణ్యభూమిజేసిన పవిత్రజాతి వంశీకులము మనము యీ సందిగ్ధసమయాన ఒకవైపు మహాధీరుడై యోగియై భక్తుడై సేవకుడై మనపాలిటి దేవుడై మనపాదాలకు మడుగులొత్తుతూవున్న మహాత్ముని విడనాడి వారి వేలకొలది శిష్యుల బోద్రోసి యేముఖముపెట్టుకొని దేశద్రోహులమై యితరుల శరణుగొచ్చుట. (సిగ్గుసిగ్గు)

పంచముల జాతీయతాభిమానమును వెల్లడించే తీర్మానాలు తదితర నాయకులు మాట్లాడినపిమ్మట యేకగ్రీవముగా అంగీకరింపబడినాయి. సభ పూర్తియైనపిమ్మట జనసమూహ

ముతో తిరిగివచ్చే సమయాన అధికారాభిమానులచే పురికొల్పబడిన దుండగీంద్రుడు గభాలున పంచములమీదబడి బసవలింగయ్యను బట్టుకొని చటపట కర్రలతోను చేతులతోనుకొట్టి తుదకు తమ్ము కొట్టించాడనే నెపముపై పోలీసుల కొప్పజెప్పారు. నెత్తిమీద బలమయిన గాయము తగులుటవలన నెత్తురుచే ఒడలంత భీభత్సమైయున్నా దెబ్బలచే దేహమంతా బలహీనతచెందియున్నా తన్ను హింసించినవారి నొక్కమాటయినా యనక తన యనుచరులను మహాత్ముని యాజ్ఞననుసరించి అహింసావ్రత మాచరింప ప్రార్థించి పోలీసుస్టేషనులోకి వెళ్లాడు. 144-వ శెక్షను నతిక్రమించెననే నెపము బసవలింగయ్యగారిపై పోలీసువారు మోపిరి.

విచారణయందు బసవలింగయ్య పాల్గొనక, తనపై మోపిననేరముల తాను చేయలేదనియు, ప్రభుత్వము తనకు రక్షణకల్గించడానికి బదులు దుర్మార్గులకు జాతిద్రోహులకు సంఘవిద్రోహులకు కుమ్మక్కైయైనదనియు, నిర్భీతిగా, గంభీరముగా, స్టేటుమెంటుచెప్పి, సంవత్సరపు కఠినశిక్షను సంతోషముతో స్వీకరించాడు.

విచారణ దినమునకు బెజవాడనుండి పెద్దకాపుగారి కుటుంబము గంగయ్యగారి కుటుంబము అందరూ వచ్చారు. అరుంధతీదేవిగారికి తనభర్త దేశసేవావ్రత కంకణుడై, కృతార్థుడైనాడనే హృదయానంద మున్ననూ, తన కన్నివిధములా

నిండుగానున్న సఖుడు వెళ్లుతున్నాడే యనే దుఃఖము పట్టలేక పోయింది. సుశీలకు తన దుఃఖమునంతా నాపుకొని, ఆమె నోదార్చుటయే పనియైపోయింది. సుబ్బమ్మ బసవలింగ య్యతో అలనాటి బసవేశ్వరుడవై నావు; నీజన్మము సార్థకత బొందినది, అని పొగడి కండ్ల నీరు కండ్ల గ్రుక్కుకొన్నది. ఎన్నడు భయమెరుంగని రమణయ్య కూలబడి, బసవలింగా! బసవలింగా! యెందుకింత దెచ్చినావురా నాయనా? యనే సరికి రామస్వామికి, యల్లమందకు, బసవలింగయ్యకు, ధైర్యము పోదొడంగినది. ఇక గంగయ్య సంగతి చెప్పదరమా? తెల్లని దట్టమగు శిరోజములు గల్గి దీర్ఘమగు తెల్లని గడ్డముగల్గి గంభీరమైన నెన్నుదురు కల్గిన ఆ యత్యున్నత ముదుసలి తండ్రి యొక్క విషాదపూరితమైన మొగముజూచి, విచారపడనివా రెవరును కోర్టునకువచ్చిన వేలకొలది ప్రజలయందు లేరైరి.

ఆ సాయంత్రమే, తిలకుఘాటునందు, సుబ్బమ్మగారి యధ్యక్షతక్రింద గొప్పసభ జరిగింది. అందు రామస్వామి వగైరా లుపన్యసించారు. గంగయ్య లేచి, అందరికీ నమస్క రించేసరికి, సభ్యులంతా కళ్ళనీళ్లు పెట్టారు. ప్రభుత్వ చర్యను తీవ్రంగా విమర్శిస్తూ ఒక తీర్మానము, స్వరాజ్యమును కాం క్షిస్తూ మరొకటి బసవలింగయ్య నభినందిస్తూ మరొక తీర్మా నము ఆమోదింపబడినవి. (బసవలింగయ్యకు జే యను జయ జయ ధ్వనులతో సభ ముగిసింది).

ఇంటికి వెళ్లినప్పటినుండి, మంచము పట్టి కొడుకు విచారముతోనే క్రుంగి క్రుంగి గంగన్న ఆరవమాసమునందు కాలగతిజెందాడు. పాదముల నొత్తుచున్న అరుంధతిని యోదార్చుట కేరితరము కాదాయెను. గంగన్న కాత్మశాంతి గల్గుగాక.






| | |
|---|---|
| Acc No. | 660 |
| Class No | H·261 |
| Book N. | 176 |

# రైతుగ్రంథమండలి.

## త్వరలో వెలువడనున్న గ్రంథములు.

(1) రషియా చరిత్రము
(ఆధునిక పరిస్థితులు).

(2) ఆధునిక రాజ్యాంగోదయము.

(3) జమీన్ రైతునాయకుడు (నవల)

(4) ఇటలీ రాజ్యాంగము
(ముసోలినీ పెత్తనము).

(5) ఫ్రాన్సుదేశపు రాజ్యాంగము.

(6) అమెరికా ప్రభుత్వము.

(7) జర్మనీ ప్రభుత్వము.

(8) పాలేరు (నవల).